శ్రీ

# ప్రపంచమాణిక్యము.



ఇది

పానుగంటి లక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడి

ప్రకటింపఁబడినది.



రెండవకూర్పు.

పిఠాపురము.

మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1930.

# ఇందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

నందుఁడు—మగధాధిపతి. ఇతనికి సర్వార్థసిద్ధియను పేరుకూడఁగలదు.

రాక్షసుఁడు—ప్రథమమంత్రి.

చాణక్యుఁడు—ద్వితీయమంత్రి.

కృష్ణదేవుఁడు—నందుని ప్రథమపుత్త్రుఁడు.

చంద్రగుప్తుఁడు—మురకు నందునివలనఁ గలిగిన పుత్త్రుఁడు.

వసంతుఁడు—నందుని చెలికాఁడు.

భట్టనాథుఁడు—జ్యోస్యుఁడు.

ఇందుశర్మ—చాణక్యుని మేనల్లుఁడు.

భృంగారకుఁడు—బ్రాహ్మణశిష్యుఁడు.

మైత్రేయుఁడు—చాణక్యునిహితుఁడు.

హరదాసుఁడు—నందుని సేనానాయకులలో నొక్కఁడు.

యాదవసేనుఁడు—పశ్చిమపాంచాలాధిపతి.

యాదసేవసుని పురోహితుఁడు.

నందుని సేవకుఁడు.

## స్త్రీలు.

సునంద—నందుని భార్య.

మురి—నందుని యుంపుడు వెలఁది.

చతుర—సునందపరిచారిక.

-మురపరిచారిక.

-త--చతురతల్లి.

శ్రీ

# ప్రచండచాణక్యము.

## ప్రథమాంకము.

నాంది.

ఉ. వారిజనేత్రల న్వలచువారును గచ్ఛపము ల్పిగిల్చి కా
మారిని గేపువారును నయస్ఫురదప్రతిమానధీయుతుల్
వైరిజయప్రధానులుఁ గృపారహితుల్ గలచిత్రసృష్టికిం
గారకుఁడైన నర్తకశిఖామణి మీకొసఁగుం బ్రమోదముల్.

[ నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి. ]

సూత్ర—సమస్తకావ్యనాటకాలంకారవేత్తలైన యీపరిషన్మహాజనులయెదుట నొక్కయభినవనాటకంబుఁ బ్రయోగింపఁదలఁచి నాఁడను. కవి ప్రతిభావంతుఁడు; నాటకంబు రసభూయిష్ఠంబు కాని యీకవితారసంబు భుజింప నర్హంబైనపాత్రంబు లభించునో లేదోయని శంకవొడముచున్నది; అయినను మహా ధైర్యముచేతను నటియొక్క సాహాయ్యముచేతను నాకుఁగార్య మనుకూలింపక పోదు.

[ తెరవంకఁజూచి ] ఓహో!

గీ. కలితచిత్రప్రదర్శకకాచదీప
యంత్రమునఁబెట్టుప్రతిమ దాయవనికపయి

స్ఫుటముగాఁ గానిపించెడిపోల్కి—నాకుఁ
దలఁచుమాత్రాన నటియె ప్రత్యక్ష మయ్యె.

కావున నాప్రయత్నము సఫలమౌననుట కిది శుభసూచకముగనున్నది.

[ నటి ప్రవేశించుచున్నది. ]

నటి—ఆర్యపుత్త్రమా ! మీ రేదియో యాలోచించుచున్నట్లున్నారు ?

సూత్ర—మతేమియు లేదు. నేనొక నాటకము నీసభాసదులయెదుటఁ బ్రయోగింపఁదలఁచినాఁడను. నాయభీష్టసిద్ధికై నీవుసహకారిణివి కావలెను.

నటి—నీడ వస్తువు నెప్పుడు వదలియుండదుకదా ! కాని మీవంటి కుశలులకుఁగూడఁ దోడుగావలసినట్లు చేసిన నాటక మేదియో యడిగిన మన్నింతురుగాక !

సూత్ర—ప్రచండచాణక్యంబను నాటకమాణిక్యంబు.

నటి—అబ్బో ! నందవంశదాహకుఁడైనచాణక్యుని చారిత్రమా ! పేరు విననమాత్రముననే గుండె జల్లు మనుచున్నది.

సూత్ర—ఓసీ ! భీరువా !

తే. గీ. అస్త్రశస్త్రవ్యథాభీల మైనయుద్ధ
కార్యమీక్షింపఁగా భయంకరముగాని
కవివచోవల్లితంబైనకదన మమిత
మోదజనకంబె యగుఁగాదె ముదితలకును.

వైద్యునిశక్తిచే విషపదార్థములు శుద్ధినొంది ప్రాణదాయకంబులగు నౌషధంబు లైనట్లు ప్రత్యక్షానుభవభీకరంబు లైనకృత్యంబులు కవుల మహిమచే శ్రావ్యంబులును మోదావహంబులు నగునుగదా !

నటి—ఇది క్రొత్తనాటకమా యేమి ?

సూత్ర—మనకుఁ గ్రొత్తకాని, కవికిఁ గ్రొత్తకాదు.

తే. గీ. నర్మదాపురుకుత్సీయనామనాట
కంబు, సారంగధరనాటకంబు, రెండుఁ
జారుశృంగారకరుణరసప్రధాన
ములుగ రచియించె నింతకు మునుపె యతఁడు.

ఆ. వె. చెఱకునడుముఁబోలి చిక్కని చక్కని
పరువుగల్గుదోఁరపండుఁబోలి
నడివయసున నుండు నారీమణిని బోలి
వాటమౌఁ దృతీయనాటకంబు.

అయిననుఁ గనఁబోవుదానిని వర్ణింపనేల ? తినఁబోవుదానికి రుచి చెప్పనేల ?

నటి—ఇట్టిప్రశస్తనాటకకర్త యెవ్వరో యడుగ నిచ్చెదరా ?

సూత్రి—ప్రశస్తకవిప్రశంస చేయుటకును వినుటకు నాహ్లాదముగనే యుండును. మధ్వమతస్థుండునుఁ బానుగంటికులప్రసూతుండును, శ్రీవేంకటరమణార్యరత్నమాంబాప్రథమపుత్త్రుండు, నాంగ్లేయభాషా విశారదుండును, మృదుమధురాంధ్రకవితా సంపన్నుండును, నవనవోన్మేషకల్పనాచణుండు నగులక్ష్మీనృసింహారావీనాటకమునకుఁ గర్త.

నటి—ఆధునికకవులలో నట్టిమనోజ్ఞకావ్యకర్తలు గూడఁ గలరా ?

సూత్ర—గ్రంథప్రాశస్త్యము గుణము ననుసరించియుండును గాని కాలమును బట్టియుండదు.

ఆ. వె. తాతనాఁటిదైనఁ దండ్రికాలమునాఁటి
దైన నిప్పు డుండు నట్టిదైన
ముక్కు గలిగినట్టి పురుషుల కెల్లను
గప్పురంబుతావి గుప్పఁగాదె.

నటీ ! కాల మతిక్రమించుచున్నది. నీమధురగానముచే నొక్కసారి సభ్యకర్ణంబులఁ దనిపి నాటకంబున కన్నియు నాయత్తము సేతుము.

నటి—దేనిఁ గూర్చి పాడవలెనో యనుజ్ఞ యిచ్చెదరా ?

సూత్ర—విస్తుతమనోజ్ఞకంఠివగు నీబోఁటి బోటి గాయనిగా లభించి
వచ్చినను వసంతంబుకంటె నొండు వర్ణ్యంబు గానంబడదు.

నటి—చిత్తము. ( పద్యముఁ బాడుచున్నది. )

చం. విరులను దాల్చి మల్లియలు వీక్షణపాత్రములయ్యెఁ జల్లగాఁ
గరువలి వీచె మేనులను గందములందఁగఁ బుట్టెఁ గోరికల్
తరుతతులు పల్లవాంశుకముఁ దాల్చె వసంతుఁడు నూత్నయౌవనా
కరుఁడయి కాంతశాలికి వికారము గొల్పుచుఁ దోఁచెఁ గాలుఁడై.

సూత్ర—ఆహా! పాట! వృక్షములకుఁ బల్లవాంకుర మటుండ, వృద్ధు
లకుఁ దారుణ్యాంకుర మగున ట్లున్నది.

నటి—స్నేహపక్షపాతమున నిట్లనుచున్నారు గాని నేనంతటిదాననా?
దూరదర్శినియద్దములవలె మీ శ్రోత్రపుటంబులలో నొకటి
నాలోపంబులఁ దద్వ్యతిరిక్తంబుగఁ జేసి రెండవది గుణంబు
సహస్రగుణంబుగఁ జేసె.

సూత్ర—కాదు. కాదు. నేను యథార్థమే పలికితిని.

ఉ. ఈసున మంత్రిరాక్షసుకువృత్తము నూతఁగఁ జేసికొంచు రా
కాసి సునందనప్రాభ్యుఁ గడగండ్లను బెట్టఁగఁ బన్నినట్టిమా
యాసమితిం బ్రచండచణకాత్మజుఁ డేపున ద్రుంచినట్టులో
సీ ! సఖి ! నామదింతలను దెంచితి నీమృదుగానమాధురిన్.

(అన్యోన్యము నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

ప్రదేశము—పాటలీపురము-అంతఃపురము.

ప్రవేశము—సునంద, చతుర, భట్టనాథుఁడు, ముర, వసంతుఁడు.

వసం—దైవజ్ఞోత్తమా! ఇదివఱకు మీరుచూచిన జాతకములకెన్నిటికిని రాజయోగమే లేదా?

భట్ట—చెప్పుటకు శాస్త్ర మంగీకరింపకున్నది.

సునం—ఎందుచేత?

భట్ట—గీ. రాజ్యభాగ్యాధిపతులు పరస్పరంబు
కలియ కరుదైన యోగంబు గలుగుటెట్లు?
రాజనదివు లన్యోన్యవైరంబునొంద
రాజ్యశాంతికి భంగంబు రాకయున్నె?

వసం—మీరు బ్రాహ్మణులేకద ?

భట్ట—ఔను.

వసం—మీకీబ్రాహ్మణత్వ మేగ్రహసంపత్తిచేఁ గలిగెను?

భట్ట—నాజాతకపరీక్ష నీకెందులకు? అయినను జన్మమువలన నేకలిగిన బ్రాహ్మణత్వమునకు గ్రహవిచార మేల ?

వసం—రాజపుత్త్రిలగుటచే జన్మమువలననే కలిగిన రాజయోగమునకు గ్రహవిచారణ మేలచేసితివి?

భట్ట—రాజపుత్త్రిలగుటచేతనే రాజయోగముఁ జెప్పవలసినదా ? ఇఁక గ్రహబలముతోఁ బనిలేదా?

చతు—పితృగ్రహమే బలవత్తర[illegible]దా?

భట్ట—తండ్రిదశ[illegible] ప్రొ[illegible]హింప సాధ్యము కాదు. తండ్రికొ[illegible] [illegible]కాదులం దపరిమితభేద ముండ వచ్చును.

వసం—మహాపండితునికి శు[illegible] [illegible]ంచినట్లులా ?

చతు—(తనలో) అందునకు నీవే నిదర్శనము.

భట్ట—ఆ. వె. నీటిబుగ్గయైన నీరదమందున
రాలు పుట్టవచ్చు రాలఁబోలు
నకవి పండికొమ్ములందున సరసమౌ
మౌక్తికములుకూడఁ బుట్టవచ్చు.

ముర—భట్టనాథా! మీ రింతకుముందు పరీక్షించిన జన్మపత్రములు మహాభాగ్యవంతుఁడైన నందమహారాజుగారి పుత్త్రులవని యెఱుఁగరా?

భట్ట—ఎఱిఁగియున్న నేమి? గ్రహబలప్రాప్తి లేనియెడల.

వసం—దైవజ్ఞశిఖామణీ! మీజాతకమునకు దశమగ్రహబలముఁగూడ నిప్పుడు తటస్థించినది.

భట్ట—అట్టిదేది?

వసం—దేవ్యాగ్రహబలము.

సుశం—వసంతా! ప్రమత్తాలాపము లేటికి? పూజ్యుఁడయినమహాను భావుఁ డానతిచ్చిన మాటలు శిరసావహించితిని. మాగతికాతఁ డేమిచేయఁగలఁడు? పంచాంగము దేశమునకు క్షామము దట స్థించునని చెప్పఁగలదు. కాని క్షామమును దీసికొనివచ్చునా? ఎంత మందబుద్ధియైన నందుకొఱకు పంచాంగమును జంపినైచు నా? నే నాతనిపై నాగ్రహము కలవాననైతినని నీవు చెప్పు చున్నావు. నేను మూర్ఖురాలనని నీయభిప్రాయమా! లేక యాతఁడు సర్వశక్తిమంతుఁ డని నీయభిప్రాయమా?

వసం—ఆరోగ్యము రాదని చెప్పిన వైద్యుఁడును, యోగము లేదని చెప్పిన జ్యోతిషికుఁడు నను గ్రహపాత్రులు కారని నాయభిప్రాయము.

చతు—ఓయిబ్రాహ్మణుఁడా! ఆరోగ్యమును గఁగఁడే ము ధన

ఔషధసాహాయ్యరూపమునఁ గొంతవఱకైన వైద్యునిచేతిలో నున్నది. కాని యోగమునిచ్చుసాధనము కాలజ్ఞునియం దేమున్నది?

వసం—గ్రహశాంతిసాధనము.

చతు—అట్టిగ్రహశాంతులందుఁ గలుగఁబోవు దానదక్షిణాదులవలన యోగము ముందుగా నీకుఁ దటస్థించును.

సునం—అనవసరమగు కాలక్షేప మెందునకు? భట్టసాధుని మఱియొక సారి దర్శింపవచ్చును. కావున నాతఁ డిప్పటికి వెళ్లవచ్చునా?

వసం—నా కెంతమాత్ర మాక్షేపణము లేదు.

ముర—అక్కా! నావెఱ్ఱికూడ తీర్చుకొననిమ్ము. ఒకజాతకముమాత్రము చూపింతును.

సునం—ఆజాతకము నీదేనా?

ముర—సరి సరి నాకు జాతకముకూడనా?

సునం—అది నీకుమారునిదా?

ముర—అవును.

వసం—నీటఁబుట్టినమత్స్యములకుఁ బిపాసాబాధఁ జెప్పిన మహానుభావుఁడు స్థలజంతువుల కేమి చెప్పకుండును?

సునం—ఆపూజ్యు నేలనిందింతువు? ఎవరియదృష్ట మెటులుండెనో? చెల్లెలా! చంద్రగుప్తుని జన్మపత్రి మా బ్రాహ్మణుని చేతికిమ్ము.

(ముర యిచ్చుచున్నది)

భట్ట—(పరిశీలించుచున్నాఁడు.)

వసం—చతురా! నీకు జన్మపత్రమున్నదా?

చతు—జన్మపత్రమునుగుఱించి నే నెఱుఁగనుగాని ఋణపత్రములు మూఁడునాలుగున్నవి.

భట్ట—(జాతకమును గన్నుల కద్దుకొనుచున్నాఁడు.)

వసం—దైవప్రసాదమా యేమి? కన్నుల కద్దుకొనుచున్నారు.

చతు—(అపవారించి) అమ్మా! అతనిది యోగజాతకమై యుండును.

సునం—(అపవారించి) సంకరజన్మునికది యాశ్చర్యము కాదు-(ప్రకాశముగా) అయ్యా! చూచితిరా? యోగము ప్రబలముగనున్నదా?

మురా—అవును! మావంటివారి కన్నవస్త్రములకు లోపము లేకుండుటయే ప్రబలయోగము.

భట్టు—గీ. సర్వసర్వంసహాచక్రిచక్రవర్తి
యగుచుఁ బ్రజలను బాలించునమ్మ యితఁడు
రమ్యకీర్తి నేకాతపత్రంబుగాఁగ
నలహరిశ్చంద్రసగరభూపులను బోలి.

చోరం—(ఆశ్చర్యముతో) కారణమేమి?

చతు-(అపవారించి) మురవొక్క యోగము చేతింతయయినది. చూచితివా?

సునం—(తలపంకించి, అపవారించి) కాలగతి!

భట్టు—గీ. తేలుపేటిటిలగ్న మీబాలకునిది
కర్కటకమందు సురగురుకమలవైరి
యోగ మగుట మహారాజయోగమగును
గురులు ఋషమందుఁ గూడిన నరునికట్టులు.

చెనం—గురుచంద్రులు లేకగృహాగతు లగుటవలవనేకదా గురువునకు భార్యాహానియుఁ జంద్రునికిఁ గళాహానియుఁ దటస్థించెను. అట్టి యోగమును గొనియాడుచుంటివేమి?

భట్టు—(నవ్వుచు) ఏమి! ఈజ్యోతిషపాండిత్యప్రతిభ యసాధ్యముగ నున్నది. మీరు పదిసంవత్సరములు కాయక్లేశ మొంది గ్రహశాస్త్రమును జదివిన మీకు శాస్త్రీయసమాధానము చెప్పఁగలను; గాని యెంతవఱకును మీప్రశ్నమునకుఁ దగిన యుత్తర[illegible]మును గ్రహింపుఁడు.

ప్రథమాంకము.

గీ. గురుగృహంబున శశి గురుఁ గూడినప్పుడు
శశికి తనుహాని గురునకు సతివిసర్జ
నంబు చెప్పితి చంద్రగృహంబునందు
వారియోగంబు పరమవైభవద మగును.

వసం—కప్ప దాఁటు.

సునం—అబ్బ! మీమాటలు నాకుఁదెలియకున్నవి. స్పష్టముగమాటా
లాడుఁడు.

భట్టు—ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది?

గీ. ధనము విద్యతోఁగూడిన దారిగాఁగ
విద్యవినయంబుతోఁ జేరువిధముగాఁగ
కలిమి సంతానయుక్తమౌ కరణిగాఁగ
భాగ్య మాయువునుంగూడఁ బట్టె నిచట.

ఇదికాక యితఁడు కత్తితోఁ జీవింపవలసిన పురుషుఁడు.

వసం—(తనలో) మంగలిదానిపుత్రుఁ డగుటచేఁ గత్తితోఁ జీవించుట
యితనికి వంశానుక్రమముగ వచ్చినదేకాని క్రొత్తకాదు.

సునం—చెల్లెలా! సంతుష్టిపడితివా? నీవువీరమాతవు! నాకుమా
రులకు యోగములే దనువిచారము నాకెంతమాత్రమును
లేదు. నేనిఁక ధన్యురాలను. నీకుమారుఁ డైననేమి? నాకు
మారుఁ డైననేమి? అందఱుగూడ నందమహారాజపుత్రులే కద!
అదిగాక చంద్రగుప్తుఁడు సర్వజ్ఞుఁడు. సుగుణరాశి. అతఁడే
పరిపాలించుఁ గాక! చెల్లెలా! నాకుఁగొంచెము పనియున్నది.
నీవింటికిఁ బోయెదవా?

ముర—అక్కా! దండము, నేనుబోయెదను.

సునం—(కౌఁగిలించుకొని) చెల్లెలా! ఎప్పుడు నాయంతరంగసామి

చతు—(అపవారించి) అమ్మా! అతనిది యోగజాతకమై యుండును.

సువం—(అపవారించి) సంకటజన్మునికది యాశ్చర్యము కాదు-(ప్రకాశముగా) అయ్యా! చూచితిరా? యోగము ప్రబలముగనున్నదా?

ముర—అక్కా! మావంటివారి కన్నవస్త్రములకు లోపము లేకుండుటయే ప్రబలయోగము.

భట్టు—గీ. సర్వసర్వంసహాచక్రచక్రవర్తి
యగుచుఁ బ్రజలను బాలించునమ్మ యితఁడు
రమ్యకీర్తి నేకాతపత్రంబుగాఁగ
నలహరిశ్చంద్రసగరభూపులను బోలి.

సువం—(ఆశ్చర్యముతో) కారణమేమి?

చతు-(అపవారించి) మురయొక్క యోగము చేటంతయయినది. చూచితివా?

సువం—(తలపంకించి, అపవారించి) కాలగతి!

భట్టు—గీ. తేలుపేటికిలగ్న మీబాలకునిది
కర్కటకమందు సురగురుకమలవైరి
యోగ మగుట మ్మహారాజయోగమగును
గురులు ఋషమందుఁ గూడిన నరునికట్లు.

సువం—గురుచంద్రులు లేకగృహగతు లగుటవలననేకదా మురపునకు భార్యాహానియుఁ జంద్రునికిఁ గలాహానియుఁ దటస్థించెను. అట్టి యోగమును గొనియాడుచుంటివేమి?

భట్టు—(నవ్వుచు) ఏమి! ఈజ్యోతిషపాండిత్యప్రతిభ యసాధ్యముగ నున్నది. మీరు పదిసంవత్సరములు కాయక్లేశమొంది గ్రహశాస్త్రమును జదివిన మీకు శాస్త్రీయసమాధానమును జెప్పఁగలను; గాని యింతవఱకును మీప్రశ్నమునకుఁ దగిన యూహసమాధానమును గ్రహింపుఁడు.

గీ. గురుగృహంబున శశి గురుఁ గూడినప్పుడు
శశికి తనుహాని గురునకు సతివిసర్జ
నంబు చెప్పితి చంద్రుగృహంబునందు
వారియోగంబు పరమవైభవద మగును.

వసం—కప్పదాఁటు.

సునం—అబ్బ ! మీమాటలు నాకుఁదెలియకున్నవి. స్పష్టముగమాటలాడుఁడు.

భట్టు—ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది ?

గీ. ధనము విద్యతోఁగూడిన దారిగాఁగ
విద్యవినయంబుతోఁ జేరువిధముగాఁగ
కలిమి సంతానయుక్తమౌ కరణిగాఁగ
భాగ్య మాయువునుంగూడఁ బట్టె నిచట.

ఇదికాక యితఁడు కత్తితోఁ జీవింపవలసిన పురుషుఁడు.

వసం—(తనలో) మంగలిదానిపుత్రుఁ డగుటచేఁ గత్తితోఁ జీవించుట యితనికి వంశానుక్రమముగ వచ్చినదేకాని క్రొత్తకాదు.

సునం—చెల్లెలా ! సంతుష్టిపడితివా ? నీవువీరమాతవు ! నాకుమారులకు యోగములే దనువిచారము నాకెంతమాత్రమును లేదు. నేనిఁక ధన్యురాలను. నీకుమారుఁ డైననేమి ? నాకుమారుఁ డైననేమి? అందఱుగూడ నందమహారాజపుత్రులే కద! అదిగాక చంద్రగుప్తుఁడు సర్వజ్యేష్ఠుఁడు. సుగుణరాశి. అతఁడే పరిపాలించుఁ గాక ! చెల్లెలా ! నాకుఁగొంచెము పనియున్నది. నీవింటికిఁ బోయెదవా ?

మురా—అక్కా ! దండము, నేనుబోయెదను.

సునం—(కౌఁగిలించుకొని) చెల్లెలా ! ఎప్పుడు నాయంతరంగసామీ

ర్యమును నెఱుంగుదువు. భట్టనాథా! ఆలస్యమైనది. మీరుకూడ మీగృహమునకు వెళ్ళవలెను.

చతు—అమ్మా! అమ్మా! నేనుగూడ నీబ్రాహ్మణునివలనఁ గొంచెము తెలిసికొనవలసియున్నది. క్షమింపుము.

సుసం—నీయోచనేమి ?

వసం—ముండ కాసక్తి యెప్పుడు మగనిమీఁద నేకదా !

భట్ట—శీఘ్రకాలములో నాకస్మికముగ దివ్యుఁడయిన బ్రాహ్మణుఁడు నీకు మగఁడై నీయింటఁ గనకవర్షమును గురిపించును.

వసం—అయ్యా! దీనికినే నొక ప్రశ్నము చెప్పెదను. దీని పూర్వాపరసందర్భము లెఱుఁగక యంతకాంచనాభిషేకము చేయు మిండఁడు తానిచ్చినదియును దీనికిఁ బూర్వమునన్నదియును సమస్తము నపహరించును. వ్యభిచారిణియిల్లు గుల్లచేయఁదలఁచిన విటకానికిఁ గొండంతయాపి ప్రారంభమందే యుండుట యాచారమై యున్నదే కదా !

సుసం—చెల్లెలా! నకేఁబొమ్ము. (పోవుచున్నది) అయ్యా భట్టనాథా! పోవచ్చును (పోవుచున్నాఁడు) చతురా! నీవుద్వారమువద్దకుఁ బోయి, వారెంత దూరముగఁ బోయినారో చూచిరమ్ము.

[చతుర పోవుచున్నది.]

వసంతకా! చూచితివా? కాలవైపరీత్య మెటులున్నదో !

చతు—(ప్రవేశించి) అమ్మా! వారుదూరముగ వెళ్ళినారు.

సుసం—ఇఁక మనము చేయఁదగినదేమి ?

వసం—(తలవంకించి యూరకున్నాఁడు.)

సుసం—బ్రాహ్మణవర్యా! అడిగినప్రశ్నమున కుత్తరము సెప్పక తల వంకించి నోరు తాటించి యూరకుంటి వేమి ?

చతు—నోటిలో మామిడితాండ్ర యున్నదేమో ?

వసం—(చతురమొగముపైనుమిసి) అదిగో ! అదిగో ! ఆగింజయేదో చూడుము.

చతు—ముద్దకజ్జూరమా ?

వసం—భట్టనాథుఁ డమ్మగారికిసమర్పించిన ఖర్జూరపుఁ బండ్లెవారు భక్షించిరనుకొంటివి ?

చతు—భోజనవిద్యాసాగరుఁడవు.

సునం—చతురా ! మాటలాడకు ; వసంతా ! దానితో నెందులకు ? నీకు మహారాజుగారిపైఁ బ్రీతికలదా?

వసం—పరమాన్నముపైఁ బ్రీతిలేనివాఁ డుండునా ?

సునం—వయసురాఁబోవు రాజపుత్రులు ముఖ్యముగ దేనిన పేక్షింతురు?

వసం—పితృమరణమును.

సునం—చతురా ! నీవు ద్వారమునొద్ద వేచియుండి మహారాజుగారి రాకను మాకు నివేదింపుము.

చతు—చిత్తము. (పోవుచున్నది.)

సునం—వసంతా ! నీవునాకొక కార్యమందు సాహాయ్యముచేయవలసి యున్నది.

వసం—చక్కిలములు నములుటయందా యేమి ?

సునం—బాగుగఁజెప్పితివి. ఆసన్నవార్ధకమున దంతములు కదలుచునే యున్నవి. అసూయావిచారములచేత హృదయముఁ గూడఁ జలించుచున్నది.

వసం—(నవ్వుచు) మరల మనరాజుగారిచే నే నీచకాంత రాజకాంత గాఁ జేయఁబడినది ?

సునం—ఆసౌభాగ్యము తటస్థించునెడల వేఁడుక చాలికాఁడ వైన నీకుఁ

చెలియకుండునా ? పరమనీచుఁడైన చంద్రగుప్తుఁడు తక్షక వంశమునందుఁ బాటలీపురమునఁ బట్టాభిషిక్తుఁడై యేకచ్ఛత్రముగ భూమినిబరిపాలించుననీ యీతఁడు చెప్పినాఁడుకదా ! నాపుత్త్రిలగతి యేమియగును ?

వసం—ఏమియగుట కేమున్నది ? వారు రాజ్యభ్రష్టులగుదురని తోఁచుచున్నది.

సునం—తనకొడుకుయొక్క మహోన్నతదశాసూచకములైనమాటలు చెవినిఁ బడఁగానే జల్లుమని యొడలుప్పొంగ మునిమునిసగవులు చెంపలావరింప, నేత్రములయం దొకవింతలావణ్యము ంకురింపఁ దలయూఁచి యొయారముగ నది నన్నుఁ గ్రీగంటఁ జూచి చూడనట్లుచూచెను. అప్పుడు నేను వెల్లఁబోయి, గుండెలు దడదడఁ గొట్టుకొనఁగ విన్నఁబోయి యుదయించుచున్న బాష్పకణములు రెప్పలనప్పళించుచుఁ దలవంచుకొని పరధ్యానమును నటించుచు గొంతుకలోనే మోసగ్రంథించిన కుండపవక్షస్స నవశకం చిచ్చులన మాత్రముననే నిశ్వాసమును వెల్లడిచేయుచుఁ బక్కకుఁ జేయిసైచి, బొట్టనవ్రేలనేల వ్రాయుచు నాపరిచారిక చతురమొగము మొగము చెల్లనివానివలెఁ జూచితిని.

వసం—అప్పుడు నేనునిన్నుఁ గనిపెట్టితిని. స్వస్తివాయనము పోయిన ముత్తైదువవలె నుంటివి.

సునం—సూర్యచంద్రాదులు గతులు దప్పుదురా ? కాలము తలక్రిందైనదా ! కలియుగము కాలిక్రిందను బానిసలు నెత్తిమీఁదనా ! బ్రహ్మాస్త్రమై సొమ్మరికలు చెప్పవలసిన నిముఁడు ప్రోక్తితి ధరాంధితోఁ వై తక్షకవంశజాతమహాప్రాణనాథపవిత్రమైన ... వలసినదా !

వసం—మంగలిపొదిని వదలించి యుంబులపొదినిఁ బట్టఁజేసిన యదృష్ట దేవత [illegible]

సునం—బ్రాహ్మణమంత్రులును [illegible] లైన యితరోద్యోగులు, వేమకచెలికాఁడ వైన నీవు క్షౌరకుని యాజ్ఞలకు శిరములను జేతుల నొగ్గి కీటకములకంటె నీచములైన బ్రదుకులు బ్రదుకఁ దలఁచితిరా? ఛీ! ఛీ! మీకందఱికిఁ జావు మేలుగదా? ఓభాగ్య దేవతా! ఓజాత్యంధురాలా! ఓమూర్ఖురాలా! ఊరఁబందు లుండఁ గుక్కలుండ, గాడిద లుండఁ జంద్రగుప్తుఁడే సింహాస నార్హుఁ డని యెంచితివా?

వసం—అమ్మా! శాంతింపుము.

సునం—శాంతి నొందుదును గాని నందమహారాజు నీ కేమి యపకార మును జేసినాఁడు?

వసం—ఉపకారమును జేయుటయెఱుఁగనివాఁ డపకార మేమిచేయ గలఁడు?

సునం—నీ కాతనియెడలఁ గోపము?

వసం—నాకు భోజనముపైఁ గోపమున్నయెడల—

సునం—నాపుత్రులు నీయెడల నెప్పుడైన నపరాధ మొనరించిరా?

వసం—మూఁడవయేఁట మాత్రము కట్టఁ దీసికొని పొదుముకుండు వసులఁగొ[illegible]

సునం—అజ్ఞానకృతము; [illegible] చిరకాలమునుండి నీవనుభవిం చుచు మాకే [illegible] నాఁడవై యుంటివికదా! మావం శము [illegible] త్యము బురదలోఁబడినట్లు, చంద్ర గుప్తుని [illegible] యుండఁగ నీ వూరకుండవలసినదేనా? ఇట్టి సమయమున నిశ్వాసము మూఁగవై యుండునా? పోషించు

ప్రభువునకాపద రాఁబోవుసమయమున విని యోగపడని యాప్తుని బుద్ధియేల? తనువేల? అదికాక సర్పమింటిలోఁ దిరుగుచున్నప్పుఁ డింటివారికి మనశ్శాంతియుండునా? అటులే దుష్టుఁడైనరాజు రాజ్యమందుండఁ బ్రజలకు శాంతియెక్కడిది? ప్రజోపద్రవ నివారణమునకైనను రాజాభిమానము చేతనైనను,నీవు-

వసం—ఏమిచేయవలసినదో? భక్ష్యములన్నియు నెదుట పళ్లెరములలో నుంచినఁగాని భోజనమందునాకుఁ జొరవకలుగనట్లు చేయవలసినకార్య మేదియో స్పష్టముగ నెదుటఁబెట్టినట్లు నియోగించినఁగాని నాబుద్ధికిఁ దెగువరానేరదు.

సునం—చంద్రగుప్తునివలన మనకేబాధయు లేకుండునట్లు చేయవలెను.

వసం—అట్లుచేయుటకుఁ జంద్రగుప్తుని బాధించుటతప్ప యితరసాధనమేమున్నది?

సునం—బాధించెదవో! సాధించెదవో! అతఁడు సమూత్యుఁడైనా మావశిష్టుఁడు కావలెను.

వసం—విస్తరియం దున్నయపథ్యపదార్థములను జిహ్వాచాపల్యముకల రోగితినుటకును మానుటకును నాందోళనముఁ బడునట్లు రాజవిశ్వాసమునన్నీకార్యమునకుఁ బురికొల్పుచున్నను, మొక్కవోయిన కత్తిపీటవలె నున్నబుద్ధిమాత్రము—

సునం—ప్రథమమంత్రి యగురాక్షసుఁడు నీ కిందునఁ దోడుపడును.

వసం—సరి; బాగుగనున్నది. రాక్షస కృత్యమేకాన రాక్షససాహాయ్యమగత్యమే.

సునం—చతురా!

చతుర—(ప్రవేశించి) అమ్మా!

సునం—నీవుపోయి రాక్షసుని దీసికొనిరమ్ము.

చతు—చిత్తము. (పోవుచున్నది)

వసం—చంద్రగుప్తుని, మురను హింసించుటయే తప్పని సరిగఁ జేయవలయునా? లేక వారిని దూరదేశమునకు వెడలఁగొట్టినఁజాలునా?

సునం—దూరస్థితదుష్టుని దుర్మార్గతను దొలఁగింపగలదా ? అందున కంతరిక్షస్థములగు దుష్టగ్రహములే సాక్షులుకదా !

వసం—అమ్మా! భట్టనాథుఁడు నీకుఖర్జూరపుఁబొట్లములు తెండిచ్చినాఁడా.

సున—ఏమి ?

వసం—ఇదిగో మఱియొక పొట్లము (విప్పుచున్నాఁడు) అమ్మా! సెనగపప్పు కలిపి చేసిన చేగోడీలవలెఁ బ్రకాశించు చున్న మణిఖచితములైన కంకణములు—

సునం—(చూచి) ఇవి మురకు నిన్ననే మహారాజుగారు గోలకొండ వర్తకుని యొద్ద కొని యిచ్చిన రత్నఖచితము లగుగాజులు; నాకుఁ జూపించుటకుఁ గాఁబోలు నది యిచ్చుటకుఁ దీసికొనివచ్చి వెళ్లఁ బోవునప్పుడు పుత్త్రునిపట్టాభిషేకమహోత్సవముఁ దలఁచుకొని మఱచివెళ్లెను.

వస—ఈయాభరణములు రాక్షసునికిఁ జూపి మాతంత్రమున కుపయోగించు నెడలఁ జాతుము. వీనిని నాయొద్దనుంతును.

సునం—సరే.

చతు—(ప్రవేశించి) అమ్మా! రాక్షసుఁడు వచ్చుచున్నాఁడు.

సునం—నేను బోయెదను. నీవే నాతరఫుగ నన్నిసంగతు లాతనితోఁ జెప్పవలెను. మీరిద్దఱును సాహాయ్యపడి నాహృదయశల్యమును బెఱికివేయవలెను. చతురా! పిల్ల లీసరికిఁ బాఠములను ముగించి నాకొఱ కెదురు చూచుచుందురు. పోదమురమ్మా.

(సునంద, చతుర నిష్క్రమించిరి)

[రాక్షసుండు ప్రవేశించును]

రాక్ష—వసంతా! దేవిగారినిం జూడవచ్చిన నాకు నీదర్శన మైనదేమి?

వసం—(గాజులు దొడుగుకొనుచు) గాజులం దొడిగించుకొని యంతఃపుర ములోం గూరుచుండు నన్నే దేవిగారినిగా భావింపరాదా?

రాక్ష—(నవ్వుచు) గాజులు ధరించినావేమి?

వసం—ఇంకం బౌరుషముతోం బని లేక.

రాక్ష—రెండుమాత్రమే ధరించి యూరకుంటివేమి?

వసం—మిగిలినజత మీకొఱకు జాగ్రత్త పఱచినాను.

రాక్ష—ఛీ! ఛీ! దేవిగా రెచ్చట నున్నారో చెప్పెదవా లేదా?

వసం—దేవిగా రెవరు?

రాక్ష—అనవసర మైనప్రశ్న మెందులకు? దేవినే యెఱుంగనా?

వసం—ఎఱుంగ రనియే నానమ్మకము. ఎవరో చెప్పుము.

రాక్ష—సునంద.

వసం—తప్పు—సునంద యెందుచేత?

రాక్ష—మహారాజభార్య యగుటచేత.

వసం—మురకూడ మహారాజభార్యయేకద!

రాక్ష—రాజునకు స్త్రీవాంఛం దీర్చిన ప్రతికాంతయు భార్యయగునా?

గీ. విధివిహితభార్య యిహపరవిభవద యగు
విష్ణుమందిరాన్నపుటికవిధము గాంగ
బ్జాంజాలక తెచ్చుకొన్నట్టి దిహాసు
ఖంబ యిడును విక్రీతాన్నశబళమట్లు.

వసం—ఆసంగతి నేనెఱుంగుదును, యథావిధిగం బెండ్లాడంబడిన కాంత శాస్త్రోపాసనయను గృహీతయజ్ఞోపవీతలతికవంటిది. ఇంద్రియవ్యాపారములకు మాత్రమే తెచ్చుకొనంబడినది బ్రాహ్మణా

ర్థములు దొరకుటకుఁ గాను ధరింపఁబడిన దొంగజన్నిదము వంటిది. ప్రస్తుతాంశము దేవి యెవతె యని కాని, భార్య యెవతెయనికాదు. మతితగ్గినకొలఁది భార్యలసంఖ్య హెచ్చుగుట రాజుల కాచారమేకద ? మనమహారాజుగారగ్నిసాక్షిగ నింకనలుగుర నుద్వాహమగునెడల వీరందఱు దేవు లగుదురా?

రాక్ష—నీవాదము పరమాసహ్యముగ నున్నది. ప్రాణము విసిగింపక చెప్పవలసిన దేదో శీఘ్రముగఁ జెప్పుము.

వసం—దేవి యెవతె యనఁగ, రాజున కెందఱు భార్యలున్న నేభార్య యొక్కపుత్త్రుఁ డారాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడగునో యామె యే దేవి.

రాక్ష—అయిన నేమి ? ఆయుష్మంతుఁ డైనభర్తృదారకుఁడు కృష్ణనందుఁడు ముందుగఁ బట్టాభిషిక్తుఁ డగును కావున నాతనితల్లి సునంద దేవి యగును.

వసం—తప్పు ; చంద్రగుప్తుఁ డీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ డగును. కావున నాతనితల్లి మురయే దేవి యగును.

రాక్ష—ఛీ ! ఛీ ! అసందర్భప్రలాపములు వలుకకుము. ఈమాట వెల్లడియైన నీనోటిమీఁదఁ గొట్టెదరు.

వసం—అందఱునెత్తి వాయ వెంద్రుక లూడఁగొట్టుటకుఁ జంద్రగుప్తుఁడు రాజుగ రానున్నాఁడు.

రాక్ష—చంద్రగుప్తుఁ డేల రాజగును ?

వసం—గ్రహబలముచేత.

రాక్ష—జాతక మెవ్వరైనఁ జూచి చెప్పిరా ?

వసం—కాకేమి ? భట్టనాథుఁడు.

రాక్ష—జోస్యుఁడా ?

వసం—ఊ. నందసుతులకు రాజయోగము లేదనికూడ నమ్మగారియెదు
టనే స్పష్టముగఁ జెప్పెను.

చాణ—(తలపంకించి) చంద్రగుప్తుఁడు రా జగునా ? కొట్టివేయఁదగిన
మాట కాదు. ఏమికావలసి యున్నదో !

సీ. వెడఁదలై నిడుదలై వెలఁగొందునేత్రము
  ల్జనశాసనాభీలశక్తిఁ దెలుప
సోగలై తుంగలై సుంత వంగినముక్కు
  పరమసర్వంకషప్రతిభఁ దెలుప
నసుమ నిర్వంక లై మలచిన ట్లున్నట్టి
  పెదవులు చాలపట్టుదలఁ దెలుప
వక్షోవిశాలత వరమధ్యసూక్ష్మత
  వైరివిధ్వంసకప్రజ్ఞఁ దెలుప
నరులఁ బాలింప వీఁడు జన్మంబుఁ బొంది
నట్లుగాఁ గానిపించు వన్యంబులైన
జంతుకోటుల శాసింప జనన మొందు
ప్రబలపంచాస్యశాబముభంగి గాఁగ.

స్వక్షేత్రమునఁ గల్గునందకుమారుల కీతేజోరూపాతిశయములు లేవు
సుమా !

వసం—కట్టుకొన్న దానిపై ననురాగము కంటె నుంచుకొన్నదానిపై
ననురాగమె గాముకున కధికము కదా !

సీ. వాలాయమును దీర్ప నేలాగొ సతి వంటఁ
  గులటఁ గూడును గూర్మికొనలుసాఁగ
కనికిపాట్లు పడుచుఁ గులకాంత నొందును
  లంజెతో రాత్రి చాలదని కూడు

ముక్కుచు మూల్గుచు ముద్దియదరిఁ జేరు
నుత్సాహమునఁ దేరయునిష్ఠఁ గూడు
నెన్నాళ్లకును గర్భమిదెయంచు సతిఁబాఁకు
నిదె స్వర్గ మని వెలయింతిఁ గూడుఁ
గానవే యారసులు యోగ హీను లగుదు
రిలను గులటాసుతులు సుహాపేక్ష యోగ
భవ్య లౌదురుగా వెట్టిపనికిఁ బుట్టు
దలను గలిగినవనికి భేదంబు లేదె ?

రాక్ష—దక్షిణనాయకుఁడైన నందభూనాథుఁ డీనిందకుఁ బాత్రుఁడు
గాడు కాని దేవి యాలోచన మెట్లున్నది ?

వసం—గెలవేసిన యరఁటిచెట్టును జేసినట్లు చేయవలెనని—

రాక్ష—సమాతృకముగఁ జంద్రగుప్తుని ఛేదింపవలసిన దనియేనా ?

వసం—కాకేమి ? వారిని సంహరించుటకు సాధనమే మైన నున్నదా ?

రాక్ష—చంపుట కనేకసాధనము లున్నవి. కాని వారినిఁ జంపుటకు
మాత్రము సాధనము లున్నట్లు నాకుఁ దోఁపదు.

వసం—కావున నీ కొక్కయుపాయమును జెప్పెదను. చంద్రగుప్తుఁడు
రా జగునెడల మనమర్యాదలు దక్కవు. మనమిక్కడ నుండఁ
జాలము. నే నేదాసినైన రెంతుగాగరాలమ రెంతు ఆపికలను
దస్కరించికొని వచ్చెదను. కాన నవి దీసికొని యెదూరదేశము
నకైనఁబోయి యక్కడ నాటకములాడుకొని జీవింతమురమ్ము.

రాక్ష—(నవ్వుచు) మనము దూరదేశమునకుఁ బోనవసరము లేదు. మనము
జంద్రగుప్తునిదూరదేశమునకు వెళ్ళఁగొట్టింపవచ్చును. చంపుట
యసాధ్యమని యేలచెప్పితిననఁగ—జ్ఞానసింధుఁడనుబౌద్ధసన్యాసి
సేవ మనమహారాజుగారికిఁ గలిగి నప్పటినుండియు బౌద్ధమ

తాభిమానముగలవాఁడై యహింసనే ప్రధానధర్మముగాఁ జేసి
కొని యున్నాఁడు. చంపఁదగిన నేరము చేసినవారి కైన మరణ
దండనమును మాసినాఁడు. తాను మాంసభక్షణమే మాని
నాఁడు. నీవు మాత్ర మెఱుఁగవా ?

వసం—ఎఱుఁగ కేమి !

గీ. జైనమే సున్న; జగతి వేదంబు మిథ్య
యనెడుబౌద్ధమతంబున నమలగుణ మ
హింస యొకఁడె; యఖిలదోషవృత్తి యైన
కుక్కయందున విశ్వాసగుణముఁ బోలి.

రాక్ష—ఇట్టియహింసాపరుఁ డైనరాజు మురనుఁ జంద్రగుప్తుని హింసిం
చునా ? నాకొక్క యుపాయము తోఁచుచున్నది.

వసం—అది యేది ?

రాక్ష—(తనలో) చాణక్యునిపై నాకుఁగల పగను దీర్చుకొనుటకింత
కంటె నవకాశము లేదు. (ప్రకాశముగా) నాకును ద్వితీయమంత్రి
యైన చాణక్యునకును విరోధ మని నీ వెఱిఁగినయంశమే కదా !

వసం—లోకమంతయు నెఱుఁగును. అట్టివిరోధము సహజమే.

గీ. ఏకరాజదయాగ్రహైకశీలు
రైనమంత్రులు శత్రులే యనుట నైజ
మేకయౌవనవత్కులటాకృపాప్ర
విశాలసారగ్రహణశీలవిటులఁ బోలి.

రాక్ష—ఏకకాంతాపతులిద్దఱును శత్రువులని చెప్పితివి కదా ! ఇది
పూర్వపు దినములలోనిమాట.

వసం—ఇప్పుడు మాత్రమో ?

రాక్ష—అట్టివారే మిత్రులు. నేను వారికిఁ జెప్పిన మొదల విరోధము
చేఁ జెప్పితినని నీ వనుకొనుము.

వసం—క్రొత్తచింతకాయపచ్చడిని దలంచుకొన్న నాకు నోరూరునట్లు లీక్రొత్తసంగతిఁ దెలిసికొన నాకు మనస్సు నువ్విళ్ళూరుచున్నది. వారెవరో చెప్పుము.

రాక్ష—నీవెఱుఁగనట్లే నటించెదవేమి? చాణక్యుఁడు నందమహారాజని నానోటనే చెప్పింపవలె ననియా?

వసం—(తనలో) ఇతఁడు దొంగ. చాణక్యుని సాధించుటకు మురకును జాణక్యునకును సంబంధమని చెప్పుచున్నాఁడు. నేనును దొంగనే. కాని శ్రోత్రియపు దొంగను. మంత్రియగుటచేత నీతఁడు లౌకికపు దొంగ. చాణక్యునిపై నిట్టి యసంబద్ధవార్త కల్పించి రాజుతోఁ జెప్పుమని నాతోడ స్పష్టముగఁ జెప్పఁగూడదా? ఒక చోరుఁడు మఱియొక చోరుని నమ్మునా?

రాక్ష—ఏమి యాలోచించుచున్నావు!

వసం—నీ విపరీతవార్తతో నామనస్సు చెదరినది. రాజుగారికి స్వాధీనమైయున్న కాంతయని యాలోచింపక యీబ్రాహ్మణుఁ డెంత సాహసించెను! మురకు నాతని కెంతకాలమునుండి జరుగుచున్నది?

రాక్ష—అనేకసంవత్సరములనుండి.

వసం—ఈసంగతి రాజుగారితోఁ జెప్పెదను.

రాక్ష—మిక్కిలి జాగరూకతతోఁ జెప్పవలెను. నేను జెప్పినట్లు చెప్పకుము. ఈ గాజు లెక్కడివో చెప్పినావు కావేమి?

వసం—ఇవి మురవి. ఇక్కడికామె తీసికొని వచ్చి త్రొందరగఁ బోవుచు మఱచి వెళ్ళినది.

రాక్ష—ఈగాజులకుఁ జైసఁగట్టినది భూర్జపత్రమేనా అది?

వసం—ఆ.

రాక్ష—ఈగాజులు నాకిమ్ము. ఇవి నేను తగిన స్థలములో భద్రపఱచెదను.

(గాజులిచ్చుచున్నాఁడు.) నేను బోయి శీఘ్రముగ మఱలవచ్చునంతవఱకు నీవిచ్చటనే యుండుము. (రాక్షసుఁడు పోవుచున్నాఁడు.)

వసం—తెల్లవాఱుసరికి నాకువిస్తరిలోని కేదయినను, సాయంకాలమగుసరికి రాజుగారికిఁ బ్రక్కలోని కేదయినను జూడవలసిన సుఖవ్యాపారముకల నేను సేఁడు లౌకికతంత్రమందుఁ జిక్కుపడితిని. ఇది నాకు నూతనవ్యాపారము. ఎటులు నిర్వహించుకొనఁగలనో! అడుగో రాక్షసుఁ డప్పుడే వచ్చుచున్నాఁడు.

రాక్ష—(ప్రవేశించి) ఇదిగో! ఈయుత్తరమును నీవుచూచి యీభూర్జపత్రమునందు మడిచి తటస్థముగాఁ జూచువారికిఁగాక శ్రద్ధతో జూచువారికిఁగనబడుస్థలమందుంచుము. పోయినగాజులుఁగలమురి.

వసం—అబ్బా! యీమాటలు వందునికి హానిసూచకములుసుమా!

రాక్ష—కాదు. ఉపపతియైనచాణక్యునికి. మురగాజులసంగతి జ్ఞప్తికి రాకేగమే తానేవచ్చును, లేనియెడలఁ దనదాసి నిటకుఁ బంపును. నీవు జాగ్రత్తగఁ గనిపెట్టుచు నాపరిచారికవచ్చి యీభూర్జపత్రపుటమునుఁ దీసికొనిపోవ నారంభించినవెంటనే నీవు దానిని చేయిపట్టుకొని రాజసభ కీడ్చుకొని రావలెను.

వపరి—(ఉత్తరముఁ జూచుకొని) సరే నేను రాజుతో నెప్పుడు మాటాడవలసినది?

రాక్ష—రాజుగారిప్పు డిక్కడికే వత్తురు. కార్యవిజయమంతయు నీలోనున్నదిసుమా!

౯సం—ఒక్కవెంతకైనఁ దిగఁబెట్టకుండ—కాదు. ఒక్క స్వల్పాంశమైన విషవక సాలిపురుగు తనగర్భమందుండుతంతువుతో వలయల్లినట్లు స్వకపోలకల్పితము లైనయంశములతో నొకతంత్రముఁ బన్నెదను.

రాక్ష—నీతంత్ర మాయుక్తిరములోని యాశయముల ననుసరించియుండ వలెను. అట్టితంత్రమునఁ జాణక్యుఁడు చంద్రగుప్తుఁడు మురయుఁ జిక్కి నశింతురుగాక!

వసం—తథాస్తు. విను విను, రాజుగారివందులు ఘుమ్మరించుచున్నా రని తోఁచుచున్నది.

[తెరలో]

శ్రీమన్మహారాజరాజ దేవేంద్రభాగ్యవన్నందమహారాజునకు జయము జయము.

రాక్ష—నే నిఁక నుండఁగూడదు. (పోవుచున్నాఁడు.)

[నందుఁడు ప్రవేశించును.]

వసం—జయము జయము మహారాజా!

నంద—వసంతా! యిచటఁ గూరుచుంటి వేమి?

వసం—మఱియొకచోటఁ గూర్చుండియుండక పోవుటచేత. మీరాలస్యముగ వత్తురని నే ననుకొనలేదు.

నంద—చాణక్యునితో మాటలాడుచుంటిని.

వసం—ఎవరితో? ఎవరితో?

నంద—చాణక్యునితో.

వసం—అబ్బా! అలాగునా!

నంద—అటు లనుచుంటి వేల?

వసం—ఏమియు లేదు. చాణక్యుడు మీయొద్ద కేమిమాటలాడవచ్చెనో నే నడుగవచ్చునా?

నంద—ఏమున్నది? ఒకసంవత్సరము సెలవడుగవచ్చినాఁడు.

వసం—ఇప్పు డతనికి సెల వెందునకు?

నంద—రామేశ్వరయాత్ర వెళ్లుటకు.

వసం—అతఁడు చేసిన, యేదోషముయొక్క—పరిహారమునకు ?

నంద—గీ. సౌమ్యరూపుఁడు స్త్రీవిలోచనమిళింద
తత్త్వావాప్తుఁ డద్భుతోద్గాఢబుద్ధి
గతసమిద్ధ సంస్కారుండుగా యతండు
సకలఫలచంపకాఖ్యప్రసవముఁ బోలి.

అతఁడు బుద్ధిపూర్వకముగ దోషములఁ జేయువాఁడు కాఁడు.

వసం—కావచ్చును. మీ రాతని నిప్పుడు చూచితిరా?

నంద—అతనినిఁ జూడకుండ నెట్లు మాటలాడితి ననుకొంటివి.

వసం—చూచినయెడల నతని ముఖవైఖరి యథాప్రకారముగనున్నదో భేదించినట్టుదో చెప్పఁగలరా?

నంద—అంత బాగుగఁ బరిశీలింపలేదు.

వసం—పరిశీలించితినని చెప్పితిరి కాదా! పోనిండు. మాటలాడినపు డేమయినఁ దడఁబడెనా?

నంద—(ఆలోచనభావముగ) ఏమి!

వసం—జ్ఞప్తికిఁ దెచ్చుకొని చెప్పవలెను. మాటలలో నేమయినతొట్రుపాటు నొందెనా?

నంద—ఆసంగతి నేను నిశ్చయముగఁ జెప్పజాలను. అంత గ్రుచ్చి యడుగుచుంటి వేమి?

వసం—మఱేమియు లేదు. సహజవికాసవంతమైన యాతనిమో మెత్తి మాటలాడెనా? లేక తల వంచుకొనియే యుండెనా ?

నంద—తల వంచుకొనియే మాటలాడినట్లు జ్ఞప్తియున్నది.

వసం—ఆ. సరి. తలవంపులుకాకేమి? అయ్యో!

నంద—మిత్రమా! తలవంపు లనుచుంటి వేల?

వసం—నా సందేహనివారణమునకు నే నడిగితిని. మఱేమియుఁ గాఁదు

లేదు. మొగము కలకలలాడుచుండెనా లేక తెల్లఁబారియుండెనా?

మిను పరొ్టైవలె నల్లఁబడియుండెనా?

నంద—విశేషముగ సంతోషముగ నున్నట్లు కనఁబడలేదు.

వసం—మిమ్ముఁజూచి యతఁడేల సంతోషించును.

నంద—ఏమి! అటులనుచుంటివి? నా కేమైన హానిఁ దలఁచుచున్నాఁడా యేమి?

వసం—ఇంతమాత్రమునకు మీకు హాని యేమున్నది ?

నంద—ఇంతమాత్ర మంటివి. ఎంతమాత్రము?

వసం—ఎంతమాత్రమును మీకు హాని లేదు. భయంకరమైన రహస్య మేదో వెల్లడియగుటవలనఁ గలిగిన యాందోళన మాతని ముఖముపై నేమైనఁ గనిపట్టితిరా?

నంద—నేను బాగుగ జ్ఞాపకముఁజేసికొనిచూడ నతని మో మేమో చిన్నఁబోయినట్లు కనఁబడెను.

వసం—చిన్నతనపుఁజేష్ట చేసినవానికంతకంటె భిన్నముగ నుండునా? పై రెండుదంతములు లదుగుపెదవిపైమోపి తల నిలువునపంకించెనా?

నంద—ముందుదంతములుపొడుగయి యధరోష్ఠమునంటుటచేనాసంగతిఁ జెప్పఁజాలను. కాని యింత విశేషపరిశీలనముగనడుగుచుంటివేల?

వసం—మఱేమియుఁ దొందర లేదు. సావకాశముగ మాటలాడెనా ? లేదా?

నంద—నేనే సావకాశముగ మాటాడలేదు. అతనికి నేను చెప్పుట నాకిష్ట ములేక యాతండింక నేమో మాటలాడుచుండఁగనే నేను జక్కవచ్చితిని.

వసం—నాపయి నేమైన దోషములఁ గల్పించి చెప్పెనా లేదా?

నంద—(జ్ఞాపకముఁజేసికొనుట నటించుచు) ఆ! ఆకళంకరహితయైన భార్య

జ్యోతిషజ్ఞానమును భట్టనాథునియొద్ద వెల్లడించితివని పరిహాస
ముగఁ జెప్పినాఁడు.

వసం—దానికుండకొనుకు—

నంద—(కొందరతో) ఎవఁడు? ఎవఁడు? చాణక్యుఁడేనా?

వసం—కాదు. భట్టనాథుఁడు.

నంద—పోనిమ్ము. చాణక్యుఁడు మంచివాఁడేకద!

వసం—ఆహా! మంచివాఁడే. అతనికంటెఁ జెడ్డవానికంటె నాతండు
మంచివాఁడు కాకేమి?

నంద—చాలు. చాలు. నీయుత్తరము బాగుగ నున్నదికాదు.

వసం—ఇంతకంటె చెడ్డయుత్తరముకంటె ఇది మంచిదే.

గీ. మంచి చెడ్డల కవధిగా మహిని లేదు;
మంచిదే చెడ్డయగు; చెడ్డ మంచి యగును;
బుద్ధి నొకటితో నొక్కటిఁ బోల్చిచూడ;
ధరణి నిమ్నోన్నతంబుల దారిగాఁగ.

నంద—అట్లైన నతఁ డందఱివంటివాఁడేకద!

వసం—అందఱివంటివాఁడు కాఁడు. ప్రత్యేకమిత్రుఁడు నీవంటివాఁడయ్యెను.

నంద—నీయభిప్రాయము నాకుఁ దెలియకున్నది. చెప్పుము.

వసం—అతఁడేమో యిన్నాళ్లయున్నట్లు మాకుఁ దోఁచినదని చెప్పితిరి
కదా! అందుకుఁ గారణమును గ్రహించితిరా?

నంద—గోచారరీతి నతనిదినములు బాగుగనున్నవికావని చెప్పినాఁడు.
అందుకొఱకే తీర్థయాత్రాసేవనము.

వసం—దినములు బాగుగనున్నవికావని చెప్పనేమి? దినములత్యుచ్ఛ్రయములుగ నుండుటచేతనే యింతకాలము మహారాజుకంటె
నెక్కువగ జరిగినది. దినములు సామాన్యముగ నున్నవనుమిద
మీఁద నా ద్రోహి శీఘ్రముగ రాజదండనమునకు నురిగిపోఁ
దలఁచినాఁడా?

నంద—ఏమేమీ! అతఁడు రాజదండనార్హుఁడా? శీఘ్రముగఁ జెప్పవేమి?

వసం—రాజదండనమునకుఁ దగినవాఁడైన శిక్షించువారెవ్వరు? అతనిపై మీకుఁ గొండంతనమ్మకముగదా!

గీ. రోగిజిహ్వాకపథ్యంబె రుచ్యమగును;
గటికవానినె నమ్ముఁ గాయుజంతు
వెలచెలినె నమ్ము నింద్రియవిహ్వలుండు,
ద్రోహినే నమ్ము మనుజనాథుండు మిగుల.

నంద—చాణక్యుఁడు ద్రోహియని యెఱుంగక నేనాతనిని విశ్వసించిన మాట నిజము. తెలిసిన నే నతనిని నమ్మియుందునా! అతఁడు ద్రోహమేమియొనర్చెనో శీఘ్రముగఁ జెప్పినంగాని నాకు మనశ్శాంతి కలుగదు.

వసం—అబద్ధము.

నంద—నీవు చెప్పుట యబద్ధమా?

వసం—కాదు-నేనుఁ జెప్పిన సిసలు మనశ్శాంతి కలుగుట.

గీ. తగుప్రతీకారమును జేయఁ దగనియప్పు
డజ్ఞతయె సౌఖ్యదం బట్టియంశములను
మరణమును రోగభంగంబుఁ బొరయునట్టి
కాలమును నరుఁ డెఱుఁగమి మేలుకాదె?

నంద—ఏమి! ఏమి! నన్ను చాణక్యుఁడు చంపఁదలఁచినాఁడా? లేక సింహాసనభ్రష్టుని జేయఁదలఁచినాఁడా? అబ్బ! చెప్పవేమి?

వసం—హరిహరి-తొందరపడకుము-తొందరపడకుము.

గీ. ఆపదలలోన ధైర్యంబు నందునరులు
వినుతవిజ్ఞాను లనిపించుకొనుదు రిలను
చేటగాలిని బొల్లట్లు చెదరిపోక
నిలుచుగిరిజాలె గట్టిపై వెలయుఁగాదె?

అయినను నిన్నింత శీఘ్రముగ సింహాసనభ్రష్టునిఁ జేయఁగలఁడా?

నంద—"ఇంతశీఘ్రముగ" నని యనుచున్నావు, ఎప్పటికైన నాకా యపకృతి యాతఁడు సేయఁగలఁడా?

వసం—నేను దైవజ్ఞుఁడనుగానుగదా! మహాప్రభూ! నన్ను క్షమింతు వలెను. నేను మీయెడల స్వామిద్రోహము ప్రవర్తించితినని మీయభిప్రాయము?

నంద—ఇప్పుడు నిన్నుగుఱించిన స్తోత్రపాఠమెందునకు? చాణక్యుఁ డెట్టివాఁడో శీఘ్రముగఁ జెప్పెదవా లేదా?

వసం—నేను నీయెడల విశ్వాసవిధేయతలు గలవాఁడ ననియేనా నీ యభిప్రాయము?

నంద—విశ్వాసివగుట నిశ్చయమేకాని విధేయతగలవాఁడవనుట సందేహాస్పదము.

వసం—ఎందుచేత?

నంద—విధేయతగలవాఁడవైనయెడలఁ జాణక్యునిగుఱించి శీఘ్రముగఁ జెప్పియేయుందువు.

వసం—చెప్పిన నీకెంతమాత్రమును లాభించునదికాదు. గొప్పవారల పై నేరము జరిగినది కూడఁదీయుట యసాధ్యము. ఏమాత్ర మల్లరిఁ జేసికొనినను మఱింత మర్యాదహాని కావున నోరు మూసికొనక తప్పదు. నీవింతకంటెను ముందు తెలిసికొన నెంచక యగౌరవమును దుఃఖమును మ్రింగి కూరుచుండుము. వారల సంగతి నీకఁ దలపెట్టుకుఁడు.

నంద—"వారలు" అనుచుంటివేల? చాణక్యునితో మఱెవరైనఁగూడి నాకు ద్రోహముఁ జేయుచుండిరా?

[illegible]—మహారాజా! ముకుళముకుళ సేవకుఁడవై నాయెడ విధేయుఁడై

పనిఁజేయునట్లు కనిపెట్టుటకు, నామెకుఁ గావలసినసమస్తవస్తువులను బరిశీలించి యిచ్చుటకు నెవరిపై నధికార మొసఁగితిరి?
నంద—చాణక్యునిపై. ఆతఁడు దానితో నేమైనకుట్రఁ జేయుచున్నాఁడా?
వసం—కుట్రకాదు. అయిన నాతని నాయుద్యోగమునుండి తప్పించిమఱియొకరిని నియమింపరాదా? ఆతఁడే యుండవలెనన్నమాట యేమి?
నంద—(ఉస్సురనుచు) ఎందుచేత? ఎందుచేత?
వసం—ఆసంగతి నన్నడుగకుము.
నంద—నీవు చెప్పకతప్పదు; లేనియెడల నీవాగ్రహపాత్రుఁడవగుదువు.

ఆ. వె. మనసులోనినిప్పు మండఁజేయఁగనీక
యారిపోవనీక యూర కిటులు
రాజఁజేయు భూమ తాజ జీవావళి
యూర్పు నలుప కార్తి నొందునయ్య!

వసం—నీకు బాధగనున్నదని నేనెఱుఁగుదును. నేనాగ్రహపాత్రుఁడనగుదునని మాత్ర మెఱుఁగనా?

గీ. భూపునకు నర్థిపై నున్న పూర్ణకరుణ
ముందుజన్మంబులో ఫలమొందు నేమొ
కాని యాతనిపై స్వల్ప మైనయట్టి
యాగ్రహంబు సద్యఃఫలం బగుట నిజము.

అయినను రాజవిశ్వాసము ప్రేరేప, మనసుండఁబట్టక ప్రమాదములకు భీతినొందక, యన్నిటికిని సాహసించి యింతవఱకుఁ జెప్పితిని; నన్ను క్షమింపుము. నే నిఁకముందు చెప్పను.
నంద—మిత్రమా! నీయెడల నాకుఁ గోపముండునా?

ఆ. వె. పోట్లమొద్దు వచ్చుఁ బోవలె నే నని
భృత్యుచేత విడిచిపెట్టఁబడిన

[illegible]

... వసంతకునికి.

నాకుఁ బ్రాణసముఁడవైన మిత్రుఁడవు. నీవే నాకు రాఁబోవు నాపదయు నవమానమును బాఁపుదువా? నీవు నాయెడ విశ్వాస లేశమైన నున్నవాఁడవైన శీఘ్రముగఁ జెప్పుము.

వసం——మహాప్రభూ! నాకు నోరురాదు; నన్ను క్షమింపుము.

నంద——నోరురానియెడల వ్రాసి తెలియఁజేయుము—తప్పదు.

వసం——నావ్రాఁత బాగుగ నున్న నేనును మహారాజమంత్రులలో నొకఁడనై యుండనా? కానిమ్ము! చాణక్యుఁ డింతకాలమును బ్రహ్మచారిగనుండుటకుఁ గారణమేమో యూహించితిరా?

నంద——అతనికట్టి యగత్యములేదని యాతఁడు నాతో నొకప్పుడు చెప్పినాఁడు.

వసం——అగత్య మేలయుండును? నిత్యమును బ్రాహ్మణార్థభోజనమును సుష్ఠుగననుభవించుబ్రాహ్మణుఁడింటిపొయ్యిలోనిప్పు వేయునా?

నంద——ఆఁ——ఎవతెనైనఁ జేరఁదీసెనా యేమి?

వసం——(కన్నులనీరుపెట్టుకొని) ఎవతెనో చేరఁదీసిన మనకీకడుపురుంటలోఁ బనియేమి?

నంద——ఆ! ఆ! మనమురనాతఁ డుంచుకొనెనా యేమి?

వసం——(ఏడ్చుచు) కాదు. మురయే యాతని నుంచుకొనెను.

నంద——(పెద్దనిట్టూర్పువిడిచి) హా! ఎంతమాటఁ జెప్పితివి. కలలోనైన నిట్లు జరుగునని నేననుకొనలేదుసుమా! ఆహా! మిత్రమా! ఎందు కేడ్చెదవు? నీగండఫలకమున రాజవిశ్వాసమును సూచించు నక్షరపంక్తులనఁ బ్రకాశించుచున్న బాష్పధారలను దుడుచు కొనుము. హా! ప్రాణమిత్రమా!

ఆ. వె. నాయగౌరవంబె నీయవిగా నెంచి
వసరుచుంటి వేక భావయుతుల
మైన మనకు భేద మగుదేహయుగ మేల ?
కౌఁగిలింపు నన్ను గాఢముగను.

వసం—(కౌఁగిలించుకొని తనలో) సమయానుకూలముగఁ గన్నుఁ బొడుచుకొనుటవలనఁ గలిగిన బాష్పములు నన్నుపూర్వ రాజ గౌరవమునకుఁ బాత్రముఁ జేసినవి.

ఆ. వె. దొంగవాని కన్నిహాసము లుండినఁగాని
దొంగతనముఁ జేయ దుర్భర మగు
నింతలోన నవ్వి యంతలో నేడ్వని
చెనఁటినటుఁడు రంగుచేటుకొఱకె.

ఆ. వె. రాజ్యవృద్ధినిచ్చు పూజ్యకార్యములచే
రాజకరుణ సుంత రాదు కొండె
ములను బొల్లియేడుపులు నక్కవినయముల్
చూచి రాజు మిగుల సొక్కిపోవు.

(ప్రకాశముగా) ఈశరీరము మహారాజాశ్లేషముచేఁ బవిత్రమైనది.

నంద—ఓయి వెఱ్ఱివాఁడా! మహారాజాశ్లేషముచేతనే యొకరిదేహము పవిత్రమగునెడల నింతకాలము మురయొక్కదేహ మపవిత్రముగ నుండనేల? అహా! ఎంతదుర్భాగ్యురాలి నెంతకాలమునుండి యెంతయుచ్చదశలోనుంచి పోషించి యెంతయజ్ఞానముగలవాఁడనైతిని. ఆనీచ నీనిర్భాగ్యురాలితో సంబంధించినవారెవరు?

వసం—ఎవరున్నారు—కామదేవుఁడు—

నంద—నలువదేండ్లు దాఁటినముండ—పదునెన్మిదేండ్ల కొడుకునకుఁ దల్లి—దంతములుఁ గాయములుగాఁ జాలమి స్వల్పముగఁ జలించుచున్న

డాని నోకామదేవుఁడా ! నీకైన సిగ్గులేదా ? ఏలచలింపఁజేసి తివి ? ఓ ! అస్ఖలితబ్రహ్మచారీ ! చాణక్యుఁడా !

వసం—మహారాజా ! ప్రశాంతినొందవలెను.

నంద—మనసు కుదురులేక, ముందుది వెనుకను, వెనుకది ముందు నడుగుచుంటినేమో ? ఈసంగతి నీకెటులు దెలిసెను?

వసం—జనులట్లు చెప్పుకొనుచున్నారు.

నంద—గాలి యొకవైపున వీచునా ? జనులవాక్యము లొకతీరున నుండునా ? నీవు స్వయముగఁ జూచితివేమో చెప్పుము ?

వసం—వారునాయెదుటగాఁగిలించుకొనుటకుసిగ్గులేనివారైననుదత్పాప కృత్యమును నేనుగనులారఁ జూచుటకు శక్తిఁగలిగియుందునా?

నంద—కేవలమును జూడ నక్కఱలేదు—తత్తుల్యమైన నిదర్శనము గావలెను.

వసం—నిన్నరాత్రి భోజనమేమో యాపోవకపోవుటచేత నరఁటిపండ్లు కొనఁ కంగడికిఁ బోయితిని. చాణక్యునియింటిప్రక్కనుండి పోవు చుండఁగ మురయొక్క దాసియైన (పాపపుదినములు దాసికి దాసీతన ముండవలసిన యోగము తటస్థించెను)మల్లికయను దానితో చాణక్యుఁ డిట్లనుచుండెను.

నంద—ఎటులు ?

వసం—“ నేనిఁక రెండుగడియలలో వత్తును. నీవుపోయి మురతో జెప్పుము ” అనెను. అంతలో చాణక్యుఁ డిటు తిరిగి నన్నుఁ జూచి “ వసంతా ” అని పిలిచెను.

నంద—నిన్ను నీపేరున నాతఁడు పిలిచెనా? దానితో నాతఁడు మాట లాడిన మాటలు రహస్యమై తననేరమును వెల్లడించునవియే యైన లోనికి వెంటనేపోవునుగాని ధైర్యమున నిలువఁబడి నిన్నుఁ బిలుచునా ?

గీ. తప్పు ప్రకృతిభీరువు దివాంధంబుఁ బోలె
రాత్రిఁ దలసూపునప్పుడైన గాత్రమంత
నిండ్రువలె నక్కుచుఁజూచు నింతవింతఁ
గని పటాపంచలైపాఱు వెనుకఁ జూచు
చెట్టుబట్టను గాంచుకారెద్దువలెను.

వసం—మీరు చెప్పినమాటలు కొంతవఱకు నిజమేకాని భయమన్న నేదో యెఱుఁగని చాణక్యునెడల నవి వర్తింపవు. చాణక్యుఁడు లోనికిఁ బాఱిపోయినయెడల—

నంద—ఆతఁడు ద్రోహియని నిశ్చయముగ నమ్మవచ్చును.

వసం—మహాబుద్ధిమంతుఁడై బంగారపుపిచ్చుక తనగూఁటినెంతయప్రమత్తముగనల్లునో తంత్రములుపన్నుటయందంతకంటె నిపుణుఁడైన చాణక్యుఁడు తాను ద్రోహియని వెంటనే నావంటి మనుజునికిఁ దెలియునట్లు ప్రవర్తించునా? చాకచక్యముగల బుద్ధిగలవాఁడు తప్పొనర్చి యది మిక్కిలి చతురతతోఁ గప్పుకొనును గాని మఱింత తెలివితక్కువపనిఁ జేసి దానిని వెల్లడించి స్థిరపఱచుకొనునా? తాను రాత్రిభాగమున విజనస్థలమున మురయొక్క దాసితో మాటలాడినరహస్యములు నాచెవిని బడె నని తనకు సందేహము గలుగ నది రహస్యమని నే ననుకొనిపోవుదునని యెంచి రహస్యము కాదని నేను దృఢముగ నమ్మునట్లుగ "రావోయి వసంత" అని స్వేచ్ఛగ ధారాళముగ నెంతమాత్రమును టొంకక నడువీథిలోఁ బట్టపగలు దొమ్మరాట జరుగుచుండ నటకుఁ బోయిన యొకనిని దన హితుఁడు పిలుచునట్లు పిలిచెను—మిత్రమా! చాణక్యుఁడు విశ్వాసఘాతుకుఁ డని, వధ్యుఁడని నీకు నమ్మకముఁ గలుగఁ జేయుటకుఁ గంకణముఁగట్టి

కోపిష్ఠనాథుఁడను గాను. మురా మహాపతివ్రతయే కావచ్చును. మీరు సౌఖ్యముగ నుండుటయే నాకుఁగావలసినది. అదిగాక యిట్టి యంశములలో జ్ఞానము కలిగినకొలఁదిని బ్రమాదములు హెచ్చును. అజ్ఞానమో సర్వసౌఖ్యప్రదము. మురా కొక్క చాణక్యుఁడే కాక ప్రపంచమునందుఁ బురుషస్వరూపమును ధరించు నా రండలను సంబంధమున్న నట్టి సంగతి నీకుఁ దెలియక పోయిన యెడల నింద్రుఁడు శచితోడను వసిష్ఠుఁ డరుంధతితోడను భోగించినట్లు నిర్మలమైనమహావిపులానందముతో ననేకశతసహస్రపతివ్రతయైనమురా ననుభవింపఁగలవు.

ఆ. వె. ఈవు త్రావినట్టి యిప్పటి పాలకి
ల్లిడినిఁ జేరి చిలుము దగిలె ననుచుఁ
బలుక వాంతియగుచు బొట్లొంమదువు చెప్ప
కున్నఁ జేటుఁ బొంద కుండఁ గాదె ?

జీవించిన నాలుగురోజులును సుఖముగ జీవింపక ప్రాణాపాయకరమగు జ్ఞానము నేల తెచ్చుకొనవలెను ?

నంద—మిత్రమా ! ఎంతమాటాడితివి ! ఈఁగలోకమూల, చీమలోకమూల, మిగిలినపురుగు లోకమూల, చుంచు లోకమూలఁ బెద్దపళ్లెరములోనున్న పాలను త్రావుచుండఁ బిల్లివలెఁ గన్నులుమూసికొని నేనొకవైపునఁ ద్రావుదునా ? అంతమూఢుఁడనా ? అంతమదాంధుఁడనా ! ఓ పౌరులారా ! మీయందఱికొఱకే దీనినుంచుకొంటిని రండు అందఱు స్వచ్ఛందముగ ననుభవింపుఁ డని కేకలు వేసి వారిని, నాప్రక్కకుఁ దోడుకొనివచ్చునంతటి లజ్జాశూన్యుఁడనా ? నేను దాని ప్రక్క శయనించి గుఱుకపెట్టి నిదురించుచుండగ నల్పుఁడైన నాసేవకుఁ

చాణక్యుఁడు దానికొఱకు నాప్రక్కకుఁ జేరి "ఓసీ! ప్రేయసీ! ఇదిగో గుప్తరాజా! తన ప్రక్కలో నేమిజరుగుచున్నదో యెఱుఁగక తప్పఁద్రాగినవానివలె నొడలు తెలియక పందివలె గుఱ్ఱు పెట్టుచున్నాఁడు. ఈమాత్రపు మగతనపుఁ బ్రయోజకత్వము నకు సానిగూడ నొకతె యుండవలెనా యని యాతుచ్చుఁడు తిట్టుతిట్టకు లోనై యుందునా? నేనాలోచించునదే దనఁ బ్రత్యక్షనిదర్శనము లేకపోవుటచేత జరిగినసంగతు లన్నియును బాగుగఁ దఱచవలె ననికాని యమర్యాదను సహించి యూర కుండవలెనని కాదు.

గీ. వాదముఖమునఁ దఱవంగఁ బడినమాట
చిత్తమందున దృఢముగాఁ జేరుసుమ్ము
భూమిలో లోతుగా దింపఁ బూనుకఱ్ఱ
నలల నాడించి దిగఁ బడవలెను గాదె?

వసం— ఊహఁదీయుటకును గొంత యదియే యుపాయము. పోనిమ్ము నన్నుచూచి చాణక్యుఁడు లోనికిఁ బోకపోవుటచేత నేరముఁ గలవాఁడు కాఁడని యనుకొందము. రాత్రిభాగమున నాతఁడు మురయింటికి వచ్చెదనని చెప్పినమాట నెట్లు సమర్థించుకొం దము.

నంద— ప్రియులు ప్రియురాండ్రకు జేను నాసమయమున మఱి యేపని యుండును.

వసం— దొంగతనమునకు వెళ్ళెదనుకొందమన్న నట్టిసంగతిని ముం దుగఁ బరిచారికచే వార్త బంపునా? అబద్ధము.

నంద— ఓయి వెఱ్ఱివాఁడా! కావలసినంతధన మున్నయాతనికి దొంగ తన మేల? తనకు లేని వస్తువు నాతఁడు దొంగిలించును. బ్రహ్మ చారి కావున—

వసం——నీయెడల విశ్వాసినగుటచే నేనీసంగతి నీకుఁ దప్పక చెప్పెదు నని యెంచి దుష్టదినము లనువంకమీఁద నొకసంవత్సరము పజుకు సెలవుగోరినాఁడు సుమీ.

నంద——నిశ్చయమే——సంవత్సర మనుమితియేమి ? శాశ్వతముగ సెలవుఁ దీసికొనవచ్చును.

వసం——ఈప్రపంచమునుండియేనా ?

నంద——కొన్నికొన్ని స్వప్నములలో జరిగిన వృత్తాంతములు మేలు కొనినవెంటనే జ్ఞప్తికిరాక యాలోచించుకొనిన కొలఁదిని తరు వాత జ్ఞప్తికివచ్చురీతిని జాణక్యుఁడీయుదయమున నాతో మాట లాడిన వైఖరి నాకప్పుడు బాగుగ జ్ఞాపకము లేకపోయినప్పటికి నిప్పుడు బాగుగ జ్ఞాపకము వచ్చుచున్నది.

వసం——(తనలో) క్రమక్రమముగ విష మెక్కుచున్నది.

నంద——వాఁడు వచ్చి "జయము మహారాజ" యనుచు నావెంగ మట్టి పాటుజూచెను. నాకేమైన సంశయము కలిగినదో కని పెట్టుటకేనా ?

వసం——మఱెందునకు ! (తనలో) ఇదివఱకుఁ జెప్పుటలోఁ దలవంచు కొనియే మాటలాడినట్లు జ్ఞాపకము అని చెప్పినాఁడు. ఆహా ! అసూయప్రభావము.

నంద——మిత్రమా ! సెలవిచ్చుటకు నాకు సమ్మతముకాదని చెప్పఁగ నిచ్చినఁగాని వీలు లేదని యెంతయో పట్టుదలగ మాటలాడి నాఁడు. నాకాతనివైఖరిఁ జూడఁగ సెలవీయకపోయిననుఁ బాఱిపోవునని తోఁచుచున్నది.

వసం——ఉండిన శిరచ్ఛేద మని యెఱుఁగఁడా ? నాయపూర్వజ్యోతిషజ్ఞాన మునుగూర్చి యెంమునకు బరిహాసముగఁ బలికెనో తెలిసినదా?

నంద—బాగుగఁ దెలియలేదు.

వసం—జ్యోతిషమందు నాకుఁ బ్రవేశ మింతమాత్రమును లేనిదే యాశాస్త్రమునందుఁ బ్రజ్ఞావంతుఁడ నైనట్లు నేను నటించితినని చెప్పుటలో దెలియని యంశయముల నైనను దెలియునని చెప్పు దుష్టస్వభావము కలవాఁడ నని నీకుఁ దెలియఁజేయవలె నని యాతని యభిప్రాయము.

నంద—ఇప్పుడదికినది. ఈసంగతి నీవు నాతోఁ జెప్పుదువేమో చెప్పినయెడల నేను నమ్మదునేమో అని ముందుకాపునకై చెప్పినట్లేనా?

వసం—సందేహమేమి!

నంద—పోవునపుడు "పోయెదను" అని చెప్పకుండఁ జల్లఁగ జారినాఁడుసుమా!

వసం—(తనలో) అడిగిన సెలవిచ్చుటకు సమ్మతి లేనివాఁడనై యింక నాతఁడేమో మాటలాడుచుండఁగనే వచ్చితినని యాతఁ డిదివఱకు చెప్పినాఁడు. ఇప్పుడు "పోయెదను" అని చెప్పకుండఁ బోయినాఁడని చెప్పుచున్నాఁడు. అట్లు చెప్పుట కవకాశమిచ్చినదేది? (ప్రకాశముగ) అతనికి నీసెలవుతోఁ బనియేమి?

నంద—చెప్పినయెడల నీవు నమ్మవేమో అతఁడు చేసిన దోషమును గురించి లేశమాత్ర మతనితో మాటలాడునప్పటికి నేనెఱుఁగక పోయిన నాతని మొగము చూడఁగ నే నాయసహ్యముగ నున్నట్లతనితో మాటాడ నెంత చేతనో యిష్టము లేకున్నను నాకప్పుడే పొడకట్టినది సుమా!

వసం—(తనలో) అసూయావేశముచేఁ గన్నుఁగ్రాగిన వానికివలె వింతయూహ లుద్భవించుచున్నవి. [illegible] యోచించుచున్నప్పుడు [illegible] యెందుకు

నంద—గీ. ఇతఁడు ద్రోహియనుచు నీవు చెప్పుటచేత
పూర్వసంశయార్థములు దొలంగెఁ
జిక్కువిప్పుబారి చెప్పుటచే దాని
సంధులన్ని వీడుసరణిఁగాఁగ.

వసం—మిత్రమా! క్రొత్తగా నివృత్తము లయిన సందేహార్థము లేవో నేను వినవచ్చునా?

నంద—నీయొద్ద రహస్యమేమున్నది? వెనుకను "చాణక్యా నీవు పెండ్లి కట్టుకొనుచున్నట్లు నీవు నాతోఁ జెప్పకపోయినను మురచెప్పినదిసుమా! చెప్పుటయేకాక నీకుఁ దగు ద్రవ్యసహాయము చేయవలసినదని కూడ ననుకూలముగఁ జెప్పినదిసుమా! అని యాతనితోడ నేను బలుకుసరికి నాతఁడు పెండ్లి కొడుకువలెమురిసి మురిసినవ్వులు నవ్వినాఁడుసుమా!

వసం—నిజముగానే! నిజముగానే! నవ్వెనా? ఎంతనిర్భయముగలవాఁడు!

నంద—ఎందుచేతనవ్వెనో నాకప్పటినుండియు సందేహముగనుండెను. కాని యిప్పుడది నివృత్తిఐయినది. మఱియొకసారిఁ "చాణక్యా! రాజ్యతంత్రమున విశేషశ్రమఁ జేయుచుంటివిగదా!" అని నేననఁగ "కష్టమేమున్నది మహారాజా! కష్టమంతయుమీది- అనుభవమంతయు మాది" యని పరిహాసముగఁ బలికెను. ఇప్పుడా మాటలయర్థము తెలిసి గుండెలు వగులుచున్నవి. ఈసంగతుఁల జరిగి కొంతకాలమైనది. కావున వీరికి సంబంధము నిన్న నేఁటఁ గలిగినదికాదుసుమా!

వసం—చిరకాలమునుండి యని వాడుక-చంద్రగుప్తుని జన్మమునకుఁ బూర్వమే యీతఁడు—

నంద—ఆ! ఇనువది యేండ్లనుండియే అవిచ్ఛిన్నవ్యభిచారము, చంద్రగుప్తుఁడు వాని కేపుట్టెనా యేమో?

వస:——చంద్రగుప్తుఁడిది బ్రాహ్మణముఖమని స్పష్టముగఁ గనఁబడుట లేదా?

నంద——యథార్థమేసుమీ. అదిగాక,

గీ. బ్రహ్మబీజోద్భవుండైనవాఁడె కాన
నట్టియసమానధీశక్తి యలరె నచట
బ్రహ్మజాద్యుద్భవం బైనవజ్రమునకె
ధాళధళ్యోద్ధతులుగల్గుదారిగాఁగ.

వసం——(తనలో) అసూయ యాశ్చర్యస్వభావముఁ గలదికదా!

సీ. పిన్నవస్తువులను బెద్దవస్తువులుగాఁ
గాంచునుదయ్యంపుఁ గన్నుఁబోలె
రుచ్యపదార్థ మరుచ్యంబుగాఁ జూచు
సర్పదష్టునిజిహ్వాసరణి గాఁగ
లఘు వైనవస్తువులను భారముగఁదూఁచు
కుటిలుఁ డౌదొంగకోమటివి బోలె
శిష్టవాక్యములకు దుష్టార్థములఁ జెప్పఁ
దలతిక్కయర్థవిద్వాంసుఁ బోలె

తే. గీ. నన్నియును దనపరముగా నన్వహించు
ధరణియంతయుఁ దనమేలు కోఱకై యున్న
దనుచు నెంచెడుపరమమూర్ఖునివిధాన
నిల నసూయకంటె విచిత్ర మేమికలదు?

(ప్రకాశముగా) మిత్రమా! మాటనుబట్టియు మట్టెలచప్పుడును బట్టియు రాగతాళములను గుర్తించునట్లు మానినిని గనిపెట్ట వచ్చును సుమా!

నంద—— ఇప్పు డా సంగతి యెంచనకు!

వసం—కాలిచప్పుడునుబట్టి మురవచ్చుచున్నట్లు నేననుకొనెదను. అదుగో
ఉఱుముతరువాత మెఱు పగవచుచున్నది. ఆహా! కాలవైపరీత్యము. మహారాజుప్రక్కలో మంత్రియేమి!

నంద—మురవచ్చుచున్నదా? రానీ. దానినిగొప్పపట్టుకొనియడుగనా?

వసం—అయ్యయ్యో! తగదు. దాని నిప్పుడేమియు మాటాడింపనని ప్రమాణము చేయవలెను.

నంద—ఎందుచేత?

వసం—దాని సమయము వచ్చును.

నంద—ఇప్పుడు నే నేమిచేయవలెను?

వసం—ముందు ప్రమాణము చేయుడు.

నంద—సరే చేసితిని. తరువాత?

వసం—మీరు నిదురబోవునట్లు నటింపుడు.

నంద—సరే. అది యిక్కడి కెందులకు వచ్చును?

వసం—మఱెందులకు? నాకీసంగతి తెలిసిన దని తనదాసివలన వినియుండును. కావున నీతోఁ జెప్పవలదని బతిమాలుకొనవచ్చుచున్నది.

నంద—అలాగున నేమి! నేను నిదుర నొందుచున్నట్లుండెదను.

(నిదురను నటించును.)

వసం—సరే. (మురతొందరపాటుతోఁ బ్రవేశించును) కుక్క వెంటాడించిన చెప్పులపిల్లివలె వచ్చితివేమి?

ముర—వసంతా! రాజుగారిసమయమున నిద్రించుచున్నారేమి?

వసం—అహో! రాత్రియందున కానస్యకతయే యవసరము.

ముర—(రహస్యముగ) మాట. మహారాజుగారు నాకిచ్చినగాజులనిచ్చుట నాతో వారెప్పుడు చెప్పకొంటిని. [illegible] లేదు. నీవు చూచితివా?

వసం—([illegible]) రాజుగారు నాకు ప్రాణస్నేహితుడనా [illegible] మాట

లాడిన భయములేదు. కాని నీవు చెప్పినసంగతి రాజుగారితో నేను నిద్రలేచిన వెనుకఁ జెప్పెదను.

మురు—(బిగ్గరగ)నాతండ్రీ! నీకడుపునఁ బుట్టెదను. ఏమాత్రము దెలిసి నను రాజుగారు నాగొంతుఁ గోయుదురు.

వసం—అబ్బా! ఇంత భయభక్తులుగలదాన విటుల చేసితివా?

మురు—ఎమైననేమి! చెప్పకుసుమా!

వసం—సరే! శీఘ్రముగఁబొమ్ము. రాజుగారు లేచెదరేమో!

మురు—ఇప్పుడు వెనుకుటకుసమయముకాదు.కొంతసేపుండి మల్లికను ఇటకుఁ బంపుదును. (నిష్క్రమించెను.)

నంద—ఆహా! ఇఁకనేమున్నది! ఇఁకనేమున్నది! తననోటనే పలికినది.

వసం—ఇఁక మీా రీచింత మానవలెను.

నంద—(ఉస్సురనుచు)

సీ. కట్టఁ బుట్టములేక నట్టాడుదానికి
బంగారుజలతారు బట్టలయ్యె
నలపూస కుతికంటు కలలోనిచాదాని
కొడలెల్ల రతనాల తొడవులయ్యెఁ
జోడియంబలి వింతసూడిదాదానికి
శాల్యన్నదుగ్ధ భోజనములయ్యె
ఈఁతాకు చాపయే యెఱుఁగనిదానికి
బంగారుతొట్టెలే పాన్పులయ్యె
తే. గీ. నంట్లు తోమెడుపెద్దమ్మ యుచ్ఛవంశ
సంభవయగుమహాదేవి సవతియయ్యె
మంగలిపిశాచి మహీనాథమహిషియయ్యె
నింతచేసిన నాకది యింతఁజేసె.

గీ. ఒంటెకును సుందరత, గేదె కొడలిశుభ్ర
త, మునిఁడికిఁ జీపి, కపికిఁ జిత్తస్థిరత, వె
లుతురునకు బర్వు, కవికిఁ గలుములు, గులట
కును గృతజ్ఞత, యాకాశకుసుమమటులె.

వసం——మిత్రమా! అటులుకాదు. విశ్వాసమనునది జనునకు నైసర్గిక గుణముకాదు. అసహజ మైనయట్టిగుణము మరకు లేనందుకు నేను విచారించుచుండుటలేదు. సహజగుణ మగుభయమే పూర్ణానుస్వాధమయ్యెను. నీకింత ప్రాణమిత్రుఁడ నయిన నేను సహిత మబద్ధమూడుటకు గడగడ లాడుచుందును. అటులుండ నింతకాలమునుండి యింతస్వేచ్ఛగ నింతగా సాహసించినదాని గుండె నిబ్బర మెంతని చెప్పవచ్చును. నావెఱ్ఱియేకాని బుద్ధి విభవముచేఁ బ్రపంచము నల్లలనాడింపఁగల చాణక్యుఁడు తన కు ముద్దులమగఁడుగాఁగ నాకు కేమిభయము?

నంద—నిశ్చయమే. నన్ను నపుంసకునిగ నెంచుచున్నారు. రాజ్యమందలి ధనమును హరించుచున్నాఁడని యెందఱెందఱు చాణక్యునిపై జెప్పినను లక్ష్యపెట్టక—

వసం—అంతటితో నూరకుండెనా? ఎంతధన మపహరించినను సంతోష మే. ధనహర్తయైనచోరుని దల వ్రక్కలుచేసియైనను దానిని తిరిగి సంపాదింపవచ్చును, గాని హరింపఁబడిన మర్యాదను దిరిగి తీసికొనివచ్చు టెటులు?

నంద—ఇఁకజన్మావధిగ నాకీయవమానమము తప్పదుగదా!

సీ. చింకిపేలికలతోఁ జెడమండుకడుపుతో
నతిహీనదారిద్ర్య మందవచ్చు
గనగనమండెడు నినుపశలాకతోఁ
గనులను గాల్పించుకొనఁగవచ్చు

దిక్కుఁగన్గొనిచోట మొక్కపోయినకత్తి
చేఁ గొంతుకోతలఁ జెందవచ్చు
కుసుమసన్నిభులైనకొడుకుల నొక్కట
మృత్యువు మ్రింగ సహింపవచ్చు
వంశహానికి నోర్వంగవచ్చుఁగాని
ప్రాణమునకుఁ బ్రాణంబ యాభార్య అంకు
మగని మఱగెను వింటివా మనుజనాథ
యనెడుమాట సహింప నా కలవియగునె?

(ఏడ్చుచున్నాఁడు.)

వసం—హారిహాతీ! ఎందుల కేడ్చెదవు? తెచ్చుకొనినదానిఫల మనుభవింపక తీరునా? ఓచాణక్యా! ఓద్విజరూపపశువా! మేరుసమానధీరులగుమహారాజుగారిని వలవలనేడ్పించుచుంటివి! నీ వెంతవాఁడవు!

నంద——ఆ! ఆ! నాఁ డేడ్పించువాఁడును నే నేడ్చువాఁడనా?

వసం—అంతకన్న నీచమైనమురయేడ్పించుచున్నదన్న మీకు మఱింత కోపము రాదా?

నంద—హింసచేయనని బౌద్ధసన్న్యాసియొద్ద శపథముఁ జేసితిని. దానిని వ్యతిరేకించు టెటులు?

వసం——హింసాదూరుఁడగురాజు దంతశూన్యమైనవారకాంతవలెఁ బరిహాసపాత్రముసుమా!

నంద——(ఉస్సురనుచు) చాణక్యుని, మురను, దూరదేశములకు వెడలఁ గొట్టింతును.

వసం——నీవు తలఁచుకొననప్పటికి వారు దేశాంతరగమనమును దలఁచుకొనియే యున్నారు.

నంద—ఈ స్వేచ్ఛ చాలదుకాఁబోలును!

వసంత—మిత్రమా! ఇద్దఱను వదలుకొందువా? తలలోఁ బేనుఁబట్టిన దని తల గొరిగించుకొందురా?

నంద—సిగ్గులేక మురతో నింకనుగలుకుచుందుమని నీయభిప్రాయమా? ఛీ! ఎంతకక్కురితిమాటఁ జెప్పితివి! ఎంగిలికూడుదినుమంటివా?

వసం—సీ. దూడఁ ద్రావగ నున్నదుగ్ధంబు లెంగిలి
యనితోఁ ద్రియువాఁ డెవ్వ డవనియందు
ఈఁగలు భక్షింప నెగరఁగొట్టుచు వాని
మిగిలినయన్నంబు మెసవలేదె?
తేనెటీగలు ద్రావి తిరుగఁగక్కిన దాని
నమృతాభ మని ప్రీతి నానలేదె?
జలజంతువితతి యాస్వాదించి యుమిసిన
నీళు లాసక్తితోఁ గ్రోలలేదె?
ఇన్ని యేలయ్య! జీవాళి యెన్నిపట్టులో
పీల్చి వెడిదార్చుపవనంబు పీల్చలేదె?
ఎంగిలిని ద్రోసి జీవింప నెవరితరము?
తనను దప్పించుకొని తాను జనఁదరంబె?

అదిగాక—

తే. గీ. నామునతికి నే నొక్కఁడ కాదు వనుచు
మిడిసిపడువాఁడు నాల్గవమిండ డగును;
మురకు నీ విప్పు డైదవపురుషుఁ డగుదు
వంతలో నేమి మునిగినదయ్య చెపుము.

నంద—ఛీ! మిత్రమా! నీయసందర్భప్రలాపములు విని నా కేమ్పు పోయి నవ్వువచ్చుచున్నది.

వసం—సిగ్గుపోయిన వాని కాధార మ్మే యుపి కాదా!

నంద—అయ్యయ్యో! కడుపులో నేమో యావేదనయుగ నున్నది. నే నిచ్చినయాభరణముల నుంచుకొని మురచాణక్యునియొద్దనే శయనింపనిమ్ము. గృహదానఫలముతోఁ బాత్రునికి భార్యాదానఫలముకూడఁ దక్కినది.

వసం—పండ్లు వేనిపాని తననోటినుండి తమలపాకులచిలుక జారి నేల బడఁగ నది భూదేవి కని పలికెనఁట-మిత్రమా!

గీ. కవిశిఖామణికి నసత్యకల్పనంబు
వలనఁ బాపములే దదె బ్రతుకగుటను
గులట కట్టుల వ్యభిచారకలనవలనఁ
బాప ముండదు దానసే బ్రదుకుగాన.

నంద—ఎందునకీమాటలు! ముంగురులుదువ్వుచు నేనొకపర్యాయము చెంప ముద్దుపెట్టుకొనుచుఁ జాణక్యుఁడొకప్రక్కఁ గూర్చుండియుండ బ్రాంతమగని మొగము రోఁత యని యది వానివైపు తిరిగి కనుఁ గీఁట, నేను మూతిముడివెట్ట, వాఁడు కిలకిలనవ్వ, నీవార్త యింత నడువీధి కెక్కిన నీపీడ వదలినదికాదని యది రుసరుస లాడ నేను బ్రాఁకులాడ, వాఁడు కెవ్వుమని నకిలింప శీతజ్వరి తునివలె నేనిగిలింప, వాఁడును నేను నేకకులటాలోలతనుండి కాటులాడుచుందుమని నీయభిప్రాయమా? ఛీ! ఛీ! ఇఁక దాని మాట తలపెట్టకుము.

వసం—మురను వదలినందువలన నొక లౌకికబాధయున్నది.

నంద—ఏది?

వసం—మురాచాణక్యులు దోషసహితులు గావున వారినిఁ ద్యజించుచు న్నారుసరే. నిర్దోషుఁడైన చంద్రగుప్తుఁడు తల్లినిఁ దండ్రినిఁ గూడ విడిచి యిచ్చట నుండ గలఁడా?

నంద—ఆహా ! పోటు బ్రహ్మరంధ్రము మంటుచున్నది. ఎంతకాలమునుండి మోట్టి దుర్భ్రమలో నుంటిని. ఆతనితండ్రితోడనే యాతఁడు పోవును.

[తెరలో]

తే. గీ. దుర్భరాపన్నత్యగతుఁడైన ద్యుమణి వ్రాల్మొ
గముపడసెఁ గాలిక్రింద రూపముదొఱంగు
నీడ వృద్ధ్యున్ముఖంబయ్యె కాలగమన
మహరిమిత వైపరీత్యమా ననెనుమాడ్కి.

నంద—వసంతా ! సేవకుఁడు సమయానుగుణముగనే చెప్పినాఁడు సుమా ! మహారాజునైన నే నల్పుఁడనై హాస్యాస్పదుఁడను గాఁగ నల్పుఁడైన నాసేవకుఁ డధికుఁడై త్రుల్లిపడుచున్నాఁడు గదా !

[తెరలో]

మహాప్రభూ ! మధ్యాహ్నస్నాన సంధ్యానుష్ఠానములకు వేళ దాఁటవచ్చినది. దయచేయఁ బ్రార్థితులు.

వసం—మిత్రమా ! లెమ్ము. పోవుదము.

నంద—లేవలేను. చేయివట్టుకొని లేవఁదీయుము.

వసం—(లేవఁదీయుచు తనలో) పుస్తకముఁజూచి వల్లించిన తద్దినప్రు మంత్ర మేకరువు పెట్టినట్లు, రాక్షసుఁడు నాచేతికిచ్చిన యుత్తరములోని సంగతులననుసరించి యిదివఱకుఁ జర్యజరిగించినాను. అయిన నేమి? మిడిమిడిలౌకికజ్ఞానమగుటచేఁ జాణక్యుఁడు చంద్రగుప్తునికిఁ దగుకాలమందు పట్టాభిషేకము చేయించెద నని మురకు వాగ్దానము చేసియున్నాఁడని చెప్పుట మఱచిపోయినాను. ఈసంగతి రాక్షసునిచేఁ జెప్పించెదను. అర్థలోక్తి

కము నూతనవైద్యమువలెనే ప్రాణసంకటముకొఱకే. శాక్షసుం
డిచ్చిన భూర్జపత్రపుటము నక్కడ భద్రపఱచినాను.

నంద—మిత్రమా ! ఏమియాలోచించుచున్నావు ?

వసం—ఇంతసేపు కూర్చుండియుండుటచేత కాలు తిమ్మిరెక్కినది. నడు
వంగొంకుచున్నాను.

నంద—భోజనపుంగక్కుఱితి యెటులో తీర్చి యీదినమున నలవాటుప్రకా
కారము మధ్యాహ్నము నిదురింపక వెంటనే సభకువత్తును.
నీవుకూడ శీఘ్రముగరమ్ము.

వసం—చిత్తము. (ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# ప్రచండచాణక్యము.

## ద్వితీయాంకము.

### పాటలీపురము.

[నందుఁడు ప్రవేశించుచున్నాఁడు]

నంద—గీ. వటుఁడు నాసతివిటుఁ డౌచు నిటులు హానిఁ
జేయఁ జిత్తవేగము వశించెమును గట్ట!
కాలమా! నీదు వేగంపులీల గూడఁ
జెడెను నీ కెవ్వ రేకీడుఁ జేసినారు?

గీ. తిన్న వెంటనె ప్రక్కకు నన్నుఁ జార్చు
నిద్రికును శత్రు వైతివి నిద్ర! ముసలి
నగుటచే ముఱ వన్నొల్ల దకట! నీవు
నాదరిని జేర వేకారణంబుచేత?

గీ. ఎంతవాఁ డెన్నిగతులఁ బోషించుచున్నఁ
గులట నీచుఁ డిచ్చెడుగవ్వ కెలిమిఁ జెందు;
మథుఁ డఖిల మొసంగఁగఁ దోఁటమాలి యిచ్చు
పెంటచేఁ దుష్టిఁగనుతీవవిధము గాఁగ.

ఆ. వె. చంపుటకునుగూడ సర్వాధికారినై
పొలుచునన్నె కులట మోసపుచ్చె

శక్తిహీనులైన జంతువులు వీరిచేఁ
బడెడు పాట్లుఁ దలఁప బ్రహ్మవశమె ?

ఆ. వె. కల్పలతికఁబోలు కంజాక్షి సతియుండఁ
బండ్లరీతిఁజూచి బమ్మ జెవుడు
కంప యింట నిడితిఁగా దానికై తుట్టె
పురుగు చేరియుంట యసదుగాదు.

(ఉస్సురనుచు) కూర్చుండుటకుఁ దోఁచదు. పండియుండుటకుఁ దోఁచదు.

ఆ. వె. చింత నాదుమనసుఁ జేరి శక్తిహరింపఁ
జిత్తమిట్టు లటులు తత్తరపడు
లోన భృంగి చేరి తేనెను గ్రహియింప
నంబుజాత మూఁగులాడునటులు.

(ఉస్సురనుచు) ఎవరక్కడ ?

(నేపథ్యమందు) మహాప్రభూ ! యేమిసెలవు ?

నంద—దేవి రాకకై యెదురుచూచుచుంటినని చెప్పుము.

(నేపథ్యమందు) చిత్తము.

నంద—ఏమియుఁ దోఁచకపోవుటచేతఁ గాలక్షేపమునకు దేవికి వార్త నంపితినిగాని యామె వచ్చునేమో యని కొంకుచున్నాను.

ఆ. వె. మొదట మురను గూడునదనున దేవి నీ
క్షింప నాకు మొగము చెల్లదయ్యె
నదియె కాకయున్న నట్టియవస్థయే
సరగ నిపుడు నాకు సంభవించె.

ఆ. వె. కులట నుంచుకొంటి లలన నీవు సహించు
కొనవలెనని చెప్పుకొనఁగ దైన్య
మంతకంటె దైన్య మయ్యది నానోట

సునం—(ప్రవేశించి) జరిగినసంగతులు వసంతునివలన వింటిని. ఇంత వఱకు బాగుగనే యున్నది.

(సమీపించి) ప్రాణనాథా ! నమస్కారము.

నంద—దేవీ ! నీకు నమస్కారార్హుండైనవాఁడు నీకంటె సుగుణసంపన్నుఁడు కావలెనుగదా ! నందాహ్వయుఁడ నేను. సునందాహ్వయవు నీవు. ఎవరి యోగ్యతలో పేరులే చెప్పుచున్నవి. దుర్గుణభూయిష్ఠుఁడనైన నాకు నీవు నమస్కరించెద వేల ? నేనే నీకు నమస్కరింతును. (కాళ్ళపైఁ బడుచున్నాఁడు.)

సునం—ప్రాణనాథా ! నీవామపాదపరాగలేశతుల్యయైన యీసేవకురాలికెందుల కిట్టివిపరీతగౌరవమువలనఁ బాపముఁ గట్టఁదలఁచితివి. అయ్యో ! నీ కీపని తగునా ?

నంద—ఈపని తగినపనియె; వెనుకఁ దగనిపనులు చేసినందుకే క్షమియింపుమని ప్రణమిల్లినాఁడను.

సునం—చాలు ! చాలు ! నేను నిన్ను క్షమించునంతటిదాననా ? అనవసరముగ నీతో్రటుపాటు నీ కిప్పు డెందులకు ?

నంద—గీ. కులట నెప్పుడు నమ్మంగఁగూడ దనుచు
నీవు చెప్పినమాటలు నిక్కమయ్యె
నట్టిమాటలఁ బెడచెవిఁ బెట్టియుంట
కిపుడు తగుశిక్ష యయ్యె నా కిందువదన !

సునం—ఇప్పుడు కలిగిన ప్రమాద మేమి ?

నంద—ప్రమాదము కాదు. బుద్ధిపూర్వకముగఁ జేయఁబడినదె. నీసవతి నాద్వితీయమంత్రి నుంచుకొనెనఁట.

సునం—ఏమి ! ఏమి ! ఎంతమాట ! ఎవరు చెప్పినారు ?

నంద—వసంతుఁడు.

సునం—కొండెములు చెప్పుటయే జీవన మైనవసంతునిమాటలవలన మోసపోవచ్చునా? వసంతుఁ డొకనిపై మంచిమాట చెప్పునా? ఆతఁ డిప్పుడే యావద్వృత్తాంతమును జెప్పెను. మొగము వాఁచునట్లు చీవాట్లుపెట్టి వచ్చితిని.

నంద—నిర్దోషుఁ డైనయాతనికిఁ జీవా ట్లెందులకు ? మురతనంతతానే యొప్పుకొనఁగ వింటిని.

సునం—అది వసంతుఁడు చేసిన యేతంత్రమో! అది యేసంగతియొప్పుకొనిన మీ రేదనుకొంటిరో. ఆఁడుదానిమర్యాద స్వచ్ఛమైన యద్దమువంటిది.ఎవఁడేమాత్రముదానిపైనూపిరివిడిచిననది యస్వచ్ఛమగును. అజాగ్రత్తతో వాడిన నది భిన్నమగును.తనకిది యెట్టిమర్యాద యనుకొనెను!నిర్దోషయగుమురపై నన్నివార్తలు చెప్పి సంసారఘాతము సేయవచ్చునా ? తానాఁడుతోడునఁ బుట్టినవాఁడుకాఁడా?ఒకవేళ నట్టిసంబంధమున్నదనుకొందము. కులసతులకు గతిలేదుగాని యిఁక వెలసతులకా!తనవారలందఱు రుంధతులైయుండిరా? ఇట్టిప్రాణాపాయకరమగుమాటలు చెప్పవచ్చునా? మీరింత వెఱ్ఱిపడితి రేల? ఇట్టియంశములందుఁజూచి చూడనట్లుండవలెనుగాని యల్లరిఁ జేసికొందురా ? వారకాంతలనుంచుకొన్నవారి కెవ్వరికైన నీక్షోభము తప్పినదా ?

నంద—అబ్బా ! అదినిర్దోషయని యూరకుండవలసినదనియా ? లేక, సదోషమైనను సహింపవలసిన దనియా ?

సునం—దోషము చేసినప్పుడే సహనముగాని మఱెప్పుడు ?

నంద—అంతసహనమునకు నాకు శక్తి లేదు.

సునం—లేనియెడల దానిదోషమును గుఱించి నిశ్చయమైన నిదర్శనము కలుగునంతవఱకును నది సదోషయని యెంచకుము.

నంద—అట్లైన నే నిప్పు డేమిఁ జేయవలయును ?

సునం—వసంతుఁడు చెప్పినమాటలు యథార్థములగునో కావో మఱి
        యొకరి నడిగి తెలిసికొనవలెను.

నంద—ఎవరి నడుగను ?

సునం—సత్యవాది యైనరాక్షసు నడిగినచో ?

నంద—అతనికిని జాణక్యునకును వైరమేగదా !

సునం—చాణక్యునియెడల నాతనికిఁ గోప మున్నను నాయందలిప్రీతి విశ్వాసములకంటె మురయందలి ప్రీతి విశ్వాసము లాతనికి హెచ్చని నే నెఱుఁగుదును.

నంద—సరే. రాక్షసునిఁ బిలిపించి యడిగెదను. ఆతఁడు విదూషకుని మాటలు స్థిరపఱచినయెడల మురద్రోహిణియని నమ్మవచ్చునా?

సునం—ఆ! కొంతభాగము నమ్మవచ్చును. కాని దానిని శిక్షించుటకు మాత్రమా నమ్మకము చాలదు. అయినను రాక్షసుఁడేల యామూర్ఖుఁడు చెప్పినట్లు చెప్పును ?

నంద—సేవకా !

(నేపథ్యమందు) చిత్తము.

నంద—రాక్షసుని శీఘ్రముగఁ దీసికొనిరమ్ము.

(నేపథ్యమందు) చిత్తము.

(తనలో) తనకుఁ జిరకాలశత్రువైన ముర నీను దెబ్బవెనుక నైచుకొని వచ్చుచున్నది! ఆహా ! ఈమె సౌజన్యము !

(ప్రకాశముగా) దేవి ! మురయందు నీ కీవిపరీతనమ్మక మేల ?

సునం—మురయట్టిగుణవంతురాలని నేనెఱుఁగుదును. వసంతుఁడు దుష్టస్వభావుఁడని ప్రపంచ మెఱుఁగును. రాక్షసుఁడు వచ్చుచున్నట్లున్నది. నేనిక్కడనుండిన నీతో ధారాళముగ మాటలాడఁజాలరేమో, లోనికిఁ బోదునా ?

నంద—నీ వుండినసేమి ?

[రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాక్ష—జయము జయము మహారాజేంద్ర !

నంద—రాక్షసా ! అత్యవసరమైనమంత్రాలోచనకు నిన్నుఁబిలిపించితిని.

రాక్ష—మహాప్రభూ ! సెలవైనయెడల మహాబుద్ధిమంతుఁడైనచాణక్యునిఁ బిలిపించెదను. ఆతఁడు లేని మంత్రాలోచన మాసమంజసముగదా !

సునం—(అపవారించి)ప్రాణనాథా! చూచితిరా? రాక్షసుఁడెంతనిష్పక్షపాతబుద్ధిగలవాఁడో! ఇట్టివాఁడుచాణక్యునిపైనిందమోపునా ?

నంద—చాణక్యునితోఁ దరువాతఁ బ్రత్యేకముగ నాలోచింతును. కాని యిప్పుడు నీతోమాత్రమే యాలోచింపవలయును.

రాక్ష—మహాప్రభూ ! చిత్తము.

నంద—(అపవారించి) దేవీ ! యెట్లు లారంభింపవలెనో నాకుఁ దోఁచకున్నది. నీవు కొంతవడి కదుగుము.

సునం—సరి ! సరి ! నావలన నేమగును ?

నంద—(అపవారించి)

గీ. తెలియవలె ననునాసక్తి తీవరింపఁ
బరిభవాలాప మని సిగ్గు వారణంబు
సేయ నుత్సాహ మైన్యము ల్పొంది చిత్త
ములుకుఁ జెందు నూసరవెల్లితలను బోలి.

(ప్రకాశముగా) రాక్షసా!నీకును జాణక్యునకును విరోధమేనా?

రాక్ష—గీ. కలసి నిర్వహింతుము రాజ్యకార్యములను
వేఱుగానుందు మితరమావిషయములను
దలను బరువున్న రెండుచేతులును గలియు
లేనినో భేదగమనంబు లౌనుగాదె ?

నంద—మీకీశత్రుత్వ మేలగలిగెనో నాకుఁ దెలిసికొనవలెనని యున్నది.

రాక్ష—మహాప్రభూ ! క్షమింపుము.

నంద—క్షమించితిని—చెప్పుము.

రాక్ష—రాజేంద్ర! మీరు తెలియఁదగని యంశ మదియొకటి.

నంద—ఏమి! తెలియఁదగనా?

రాక్ష—చిత్తము.

నంద—ఎందుచేత?

సునం—(తనలో) రాక్షసుఁడు రాజుగారిమనస్సునకుఁ బురి బాగుగ వెక్కించుచున్నాఁడు.

రాక్ష—కారణమును దెలియ నేఁచకుఁడు.

గీ. కనులఁ దేజ మైనను మాపుకొనెద, స్వేచ్ఛ
నైన విడిచెదఁ నుద్యోగమైన వదలు
కొనెదఁ గాని యట్టిరహస్యమును విడువఁగ
నేర క్షమియింపు చెప్పని నేరమిపుడు.

సునం—రాక్షసుఁడా! నీ కింతపట్టేల?

రాక్ష—నే నడుగవలసినప్రశ్న మీ రడుగుచున్నారు.

నంద—రాక్షసా! నీ వీరహస్యమును మాకుఁ జెప్పవా?

రాక్ష—రాజవిశ్వాసమూలక మగువీయవిధేయతను సహింపలేఁడు చున్నాను.

నంద—తిరుగ నడుగుచుంటిని. చెప్పవా?

రాక్ష—ఇప్పుడు చెప్పను. క్షమింపవలెను.

నంద—ఎప్పుడు చెప్పెదవు?

రాక్ష—చాణక్యునికంటె ముందుగా నాకు మరణము తటస్థించునెడల నాయవసానకాలమునఁ జెప్పెదను.

సునం—చాణక్యుఁడే ముందుగాఁ గాలధర్మము నొందు నెడల—

రాక్ష—చెప్పవలసిన యావశ్యకతయే లేదు.

నంద—దేవీ! వింటివా? చాణక్యుఁడేదో ద్రోహము నాయెడలఁ దలఁచియున్నట్లితని మాటలవలన స్పష్టపడుచున్నది. ఆద్రోహ మేదో యీతఁ డెఱుఁగును. అట్టి యపాయము నాకు జరుగకుండఁ దాను నన్నుఁ గాచెదననియుఁ దనయవసానము చాణక్యుని మరణముకంటె ముందుగఁ దటస్థించు నెడల "నీకున్న యాపద యిది. ఇఁక నీవు నిన్నుఁ గాచుకొనుము." అని యీతఁడు చెప్పఁదలఁచుకొన్నాఁడు.

సునం—రాక్షసా! నీయభిప్రాయ మదియేకద?

రాక్ష—అమ్మా! యేదైన నిప్పు డీతర్జనభర్జన మెందునకు?

నంద—మంత్రీ! నీవు భిన్నాభిప్రాయపడుచున్నావు. నీవుబుద్ధిమంతుఁడవే. ఐననీవు నన్నెప్పుడును కనిపెట్టుకొనియుండువా? ద్రోహశుగమే వేళవచ్చి నన్నుఁదాఁకునో! ఆద్రోహ మేదో నాకుఁగూడఁ దెలిసినమంచిది కాదా? నేను జాగరూకతతో నుందును. అందువలన నపాయము రానేరదు.

గీ. ఎన్నఁగా జల్లెడకుఁ దూటు లెన్నొ యన్ని
దారులను ద్రోహము నరునిఁ జేరి పనినిఁ
జేయుఁగాన నన్నికనులచేతఁ దానిఁ
గాంచఁ గర్తవ్యమది దాఁచ నెంచఁ జనదు.

కావున, నీవు నాతోఁ జెప్పక తప్పదు.

రాక్ష—(రాజు కాళ్ళపైఁబడి) మహాప్రభూ! క్షమింపుము. ఏపనిని జేయుమనిన సంతోషముగఁ జేసెదను. ఇదిమాత్రము—

నంద—దేవీ! చూచితివా? వీనిమాహాత్మ్యము!

సునం—(చెవిలో రహస్యమును జెప్పుట నటించును.)

నంద—(తలయూఁచి) ఇదితప్ప మఱేది సేయుమన్నఁ జేసెదవుగా?

రాక్ష—చిత్తము.

నంద—ఆకత్తి నిటు దీసికొనిరమ్ము.

రాక్ష—రాజేంద్రా! ఎందునకు? ఇది న్యాయమేనా?

నంద—ఎందునకని యేలయడిగెదవు? తత్క్షణమిటులుతీసికొనిరమ్ము.

రాక్ష—(తీసికొనివచ్చుచు) చిత్తము. తీసికొనివచ్చితిని.

నంద—ఆకత్తిచే నాతల నఱుకుము.

రాక్ష—(మోకారించి)మహారాజా! ఈమంత్రియంతదుర్మార్గుఁడుకాఁడు.

నంద—అయ్యో! కత్తిని విడుచుచున్నావేమి? విడువకు, లే.

రాక్ష—మహాప్రభూ! నన్ను వంచించితిరిగదా!

నంద—నీవు మమ్ము వంచింపకుండ జాగ్రత్తపడుచుకొని యుంటిమి.
రాక్షసా! ఒక్కమాట చెప్పుచున్నాను. విను.

సీ. ఆచంద్రతారకం బాయశంబును బొంద
సుగుణజాలము నాకు సున్నయయ్యె
నెటులైన నేఁగీర్తి నెనయఁగోరితిఁ గత్తి
యంచుచే నన్ను ఖండించితేని
మొదటు రాజులో యేలిరీభువి కాని
సచివునిచేతను జంపఁబడిన
భూనాథుఁ డొకనందభూపాలుఁడే యని
దేశచరిత్రలోఁ దెలుపఁబడును

తే. గీ. కవి యొకఁడు దీని నొక నాటకముగ వ్రాసి
వేలవత్సరములు దాఁటువెనుక నైన
దానిని బ్రదర్శనముఁ జేయ నేను జనుల
తపనపడను నీవు నన్నుఁ జంపి రాజ పడెదవు.

రాక్ష—హరిహరీ! ఏమి మహారాజా! ఇట్టి యపకృతిని నేనుఁ జేయఁ గలనా?

నంద—చాణక్యుఁడు సేయఁగలఁడుగద! ఎవఁడైననేమి? నీచేతనున్న కత్తి నాకంఠమున విడుతువా? నీ మనస్సున నున్నరహస్యము నా చెవిని విడుతువా?

రాక్ష—రహస్యమును విడుతును.

నంద—కానిమ్ము.

రాక్ష—మీపుత్రుఁడైన చంద్రగుప్తునియెడల——

నంద—చంద్రగుప్తుడు నాపుత్రుఁ డని నీ కేమి నమ్మకము? చాణక్యుని పుత్రుఁ డేల కాఁగూడదు?

రాక్ష—మహాప్రభూ! బ్రహ్మచారి కాతఁ డెట్లు పుత్రుఁడగును?

నంద—వ్యభిచారిణికిఁ బుట్టిన వాఁడు నాకొడు కెటులు కాఁగలఁడు?

రాక్ష—రాజేంద్రా! మీరు దానికిఁ బతులుఁగదా!

నంద—యథార్థమే-మేము దానికిఁ బతులమే! నేనొకవైపున చాణక్యుఁ డొకవైపున——

రాక్ష—సమస్త మెఱిఁగియుండియు నన్నేల యడిగెదరు?

నంద—ఇది యంతయు యథార్థమేకద!

రాక్ష—యథార్థమని నే నెటుల చెప్పగలను? నేను జూడలేదు.

సునం—వసంతుఁడు చూచి చెప్పినాఁడు.

రాక్ష—ఎవరిని జూచినాఁడు?

నంద—ఇంటికి వచ్చెదనని మురతోఁ జెప్పుమని దాని దాసియైనమల్లిక తోఁ జాణక్యుఁ డర్ధరాత్రిభాగమునఁ జెప్పుచుండఁగ విదూషకుఁడు చూచినాఁడు.

రాక్ష—ఇంతమాత్రమునకే ఇంత రాద్ధాంతము చేసినాఁడా? మురతోఁ

నొంటరి పాటున రాత్రిభాగమున గదిలోఁ దలుపోరవేసికొని చాణక్యుఁడు గుసగుసలాడుచుండఁగ నే ననేకపర్యాయములు వినియుంటిని.

నంద — అది చాలదా? అంతకంటెబలవత్తర నిదర్శనము లభించునా? ప్రత్యక్షముగఁ జూచు వాడుందురా?

గీ. వాఁడు బ్రహ్మచారి, వ్యభిచారపర యిది,
కలయువేళ రాత్రి, స్థలము గదియె,
యునికి యొంటరితన, ముంచునాతఁడు గుప్తి
కంటి పంద కొంప లంటుకొనవె?

రాక్ష - మొదటియిందుకొఱకే యతనికి నాకును వైరమారంభమయ్యెను.

నంద — ఎందుకొఱకు? నీవుకూడ దాని నపేక్షించితివా?

రాక్ష — హరి హరీ!

నంద — తప్పేమున్నది?

గీ. నాధనంబె మీది, నావస్త్రములె మీవి,
నాగృహములె మీవిగా గణింపఁ
బడినయపుడు, నామగుడిస్త్రీయును మీకుఁ
గులటకాఁగ నేల దలఁపరాదు?

సునం — నాథా! రాక్షసుఁడు చెప్పఁదలఁచిన దేదో చెప్పనియ్యరేమి?

నంద — మఱిప్పవచ్చినది — యేమిచెప్పనుంటివి?

సునం — రాక్షసా! చాణక్యునకును నీకును గలిగిన వైరకారణమును గుఱించి చెప్పుము.

నంద — ఆలోచనీయాంశ మదియేకదా!

రాక్ష — [illegible] చాణక్యుఁడు మురతో నెక్కువచనవుగ నుండఁగ —

నంద — ఎక్కువ [illegible] నేమి?

రాక్ష—ఇదివఱకు చెప్పలేదా ? ఆమెతోఁ బరిహాసము సేయుటయు సంజ్ఞలచేఁ బిలుచుటయు నేకాంతమాడుటయు మొదలైన పను లాతఁడు సేయుచుండఁగఁ జూచి నేను సహింపక యాతనితో నిట్లంటిని.

నంద—ఎటులు ?

రాక్ష—గీ. "రాజు లేనియపుడు రాజకాంతలతోడ
మంతనంబులాడ మనకుఁగూడ
దతఁడు విన్న హానియగు వినకున్నను
మనకు నీతిగాదు మంత్రిచంద్ర ! "

అని యంటిని.

నంద—అతఁ డేమనెను ?

రాక్ష—రాజు నెదుటనే మంతనము లాడవలె నని నీయభిప్రాయమా ? నాకు బుద్ధులఁ గఱప నీ వెవఁడవు ?

గీ. శ్రీయుతుండు దరిద్రత శ్రేష్ఠ మనును ;
బూరితో దగుఁ డుపవాసమును నుతించు ;
భార్యకును దాసుఁ డగువాఁడు వటుని కబల
తోలుబొమ్మంచు మెట్టనీతులను జెప్పు.

అనియొకసకెక్కెముగఁ బలికెను.

నంద—అప్పుడు నీ వేమంటివి ?

రాక్ష—అటులైన నీసంగతి, రాజుగారితోఁ దెలియఁజేయవలసియున్నది, యని పలికితిని. అందుపై నాతఁ డేమనె ననఁగ రాజునకు లేని మత్సరము నీ కేల ? అతనియంగీకారము చేతనే జరుగుచున్న దని చెప్పెను. కాఁబోలునని—

నంద—నే నందున కంగీకరించితిననియే చెప్పెనా? ఆహాహా! బ్రాహ్మణ

చండాలుడు ! నేనే తాళ్ళితినని కూడఁ జెప్పినాఁడా?

సునం—వాని పేరే యది.

రాక్ష—ఎంతటవారికి మాటమాత్రమైన భయముకాని, లక్ష్యముకాని లేనివాఁ డేమియనుచుండును? మా శత్రుత్వమున కాదికారణ మిది. తరువాత మఱియొక ప్రబలకారణముచే వృద్ధినొందెను.

నంద—ఇంతకంటెఁ బ్రబలతర మైనది యుండునా ?

రాక్ష—చంద్రగుప్తునకు నీసింహాసనమునఁ బట్టాభిషేకమును జేయఁ దలఁచి యున్నాఁడు !

నంద—(నవ్వుచు) ఆహా ! ఈ బ్రాహ్మణునికి మతి పోయెనా యేమి ; నేను జీవించియుండఁగనా ? నాయనంతరము దా ?

రాక్ష—మిమ్ము వధించినపిదప నాతనికి—

నంద—(నవ్వుచు) ఆహా ! రాజవధను గూడ సంకల్పించుకొనెనా ?

సునం—రాజేంద్రా! మీరేమో నవ్వుచు నతని సంకల్ప మలక్ష్యముగ భావించుచున్నారు. అతఁడు తలఁచుకొనినంత చేయువాఁడేమో!

నంద—సరే యతనిని దూరదేశమునకు వెడలఁగొట్టింతును. కాని మురయొక్క నేర మిప్పటికైన స్థిరపడినట్లు కద! భోజనమైన వెంటనే వచ్చెద నని చెప్పి వసంతుఁ డింకను రాకున్నాఁ డేమో ?

సునం—ఇంతవఱకు భోజన మగుచునే యుండును.

నంద—వసంతుఁడు దుష్టుఁడని యతనిని దిట్టితివిగదా !

(తెర వెనుక) తిట్లు తిట్టుటయేకాక కొట్టుచున్నది. అయ్యయ్యో ! రా. బానిసకూఁతురా ! రా.

సునం—(సంభ్రమముతో) ఏమది ? ఏమది ?

నంద—ఆజ వసంతునిరసము వలె నున్నది.

సునం—అయ్యయ్యో ! ఏని కేమి చేయుకొనుటమో ! కుమ్మిరినుఁ గోపమ్మ

బట్టుకొని బలవంతముగ సభ కీడ్చుకొని వచ్చుచున్నాఁడు.

నంద—రాక్షసా! ఎందున కైయుండును?

రాక్ష—అతఁడు భోజనప్రియుఁ డని తిట్టినదేమో!

[పూర్వోక్తప్రకారముగ మల్లిక వసంతుఁడు ప్రవేశించుచున్నారు]

వసం--మహాప్రభూ! మహాప్రభూ! ఇది చేసిన నేరమును గుఱించి తరువాత నాలోచింతురుగాని యిది నన్ను దారిలో గాడిద వలెఁదన్ని, కుక్కవలెఁబీకి, పిల్లివలె అక్కి, నాదేహమంతయు రక్తమయముఁ జేసిన యీనేరమును గుఱించి మీ రిప్పుడే యాలోచింపవలెను.

రాక్ష.--(అపవారించి) దాసీసంశ్లేషమువలన దంతక్షత నఖక్షతము లాచారమే కాని నీయదృష్టమువలన నీకుఁ దన్నులు గూడ నధికముగ సందర్భ మైనవి.

సునం--(కోపములో) వసంతా! దాని నేరమేదియో యాలోచింపవచ్చును గాని, నీవీయాఁడుదాని నేల దాఁకితివి? మీఁదుమిక్కిలి యీ తెలివితక్కువదాసిని గొప్పఁబట్టుకొని, సభకు నిశ్శంకముగ నీడ్చుకొని వచ్చెదవా? ఇందులకు నీవేమి చెప్పెదవో? నాథా! ముందుగ వీనిని విచారింపవలయును. ఇంకను దాన్నిని వదలవేమి? ఆ! ఆ! భయభక్తులు లేని ప్రవర్తనమైపోయెను. రాజునకు వేమకచెలికాఁడవని కన్నులు--

మల్లి--అమ్మా! అమ్మా! నేను-నేను-బెల్లము--

నంద--అదియేమి? అట్లు మాటలాడుచున్నది?

మల్లి--అమ్మా! నేను బెల్లమువనియుఁ దాను చీమ ననియు వసంతుఁడు నా యెడమ చేతిని-కాదు కుడిచేతి నని జ్ఞాపకము-గట్టిగఁ బట్టుకొని, అమ్మా! చెప్పుట మఱచితిని. ఈనడుమనే

గాజులు తొడిగించుకొంటిని. ఆమహారాజు చచ్చి స్వర్గమున నున్నాఁడు. ఆయన యిచ్చినగాజులు కట్లపాములవలె నెంతో శృంగారముగా నుండెను. ప్చ్ !

వసం--జట్టిపోతుయొక్క దెబ్బవలె నీదెబ్బ యెంతో కరుణరసప్రధాన ముగనుండెనహహా ! (కొట్టుచున్నాఁడు)

నంద--అది యట్లులు కాజులు పేర్కొనుచున్నదేమి ?

సునం--తెలివితక్కువదాని సకూఁతు రని చెప్పలేదా ?

రాక్ష——దానిపై విదూషకునివలన మోపఁబడిన నేర మేదో పరిశీ లింపకుండ ననవసర మగుకాలక్షేప మేల ?

నంద——గీ. ఎగచి తెగవ్రేయఁ దగు నపకృతులు నాకుఁ
జేసినట్టిదుష్టుల నేమి చేసినాఁడ ?
నిఁక నిది వసంతునెడ నాచరించినట్టి
తప్పరసి శిక్షణముఁ జేయఁ దప్పు దొక్క ?

వసం——మహాప్రభూ ! ఈదాసి యెవతెయో యెఱుగుదురా ?

సునం——మురయొక్క దాసియని యెఱుఁగరా ?

నంద——ఎఱుఁగ కేమి ? నీపే రేమి?

మల్లి——పుట్టినకొన్నాళ్లవఱకు పేరే లేదు. తరువాత మామునలస్టు— ఆహా ! చల్లనివేళ జ్ఞాపకమువచ్చినది. ఎన్నిరోగములతోఁ దీసికొన్నను నూతేండ్లవరకు——

రాక్ష——(ఉస్సురనుచు) ఛీ ! ఛీ ! తెలివితక్కువదానా ! నిన్నడిగిన ప్రశ్నమునకు సరియైన యుత్తరమును జెప్పుము.

వసం——నీపేరు మల్లికకాదా ? చెప్పవేమి ?

మల్లి——నేను బెద్దదాననైనతరువాత నాపంతులుగారు పెట్టిన పేరు మల్లిక. జన్నుమవరుసపచ్చడము కప్పుకొని యున్నీటుకాఁడు పీఠినిరాఁగాఁ——

నంద—వసంతా! దాని నోరునొక్కుము.

వసం—(కొట్టుచు) సరియైన సమాధానము చెప్పుము.

నంద—మల్లికా! నిన్నరాత్రి నీవు మాద్వితీయమంత్రి యింటికిఁ బోయితివా?

మల్లి—చాణక్యుఁడు బాబుగారియింటి కేనా? మేనల్లుఁడు విస్తళ్లుకుట్టుచుండఁగా—

నంద—చాణక్యుఁడు నీకు బాబుగారగునురా! నీతల్లిని వాఁడుంచుకొనెనా?

మల్లి—మాముత్తవతల్లిని జాణక్యుఁడుబాబుగారి తండ్రియుంచుకొనెను. మొదటినుండియు సంస్థానమంత్రులతో సంబంధమున్న కోవమాది. ఆమె కాతఁడిచ్చిన తీగెయే యిది. ఇప్పుడు చాణక్యుఁడు పెద్దపెద్ద చూపులచేత మాపేరు తలపెట్టఁడు.

వసం—పెద్దపెద్ద చూపు లనఁగ మీకు విశద మైనదా?

నంద—(ఉస్సురనుచు) తెలియ కేమి? రాక్షసా! వింటివా?

రాక్ష—వసంతా! అది యిప్పుడు చేసిన నేరమేమి?

వసం—దొంగతనము—

రాక్ష—ఏమి! ఏమి! యిదివరకు చెప్పక యూరకుంటి వేమి?

వసం—చెప్పనిచ్చినవా రెవరు?

నంద—మొదట వ్యభిచారిణి తరువాతఁ దార్పుడుకత్తె. ఇఁక దానికి దొంగతన మాశ్చర్య మేమి?

గీ. నిర్ధనత కసత్యమువలె, నిపుణగాన
మునకుఁ గచ్చవదలుతనమువలె, సంప
దకు దురాశలాగున, జంకుతనమునకుఁ ద
ఱచుగ దొంగతనంబు, వఱలును గాదె?

వసం——అంతఃపురములోని దొంగతనము ప్రబలమైన నేరము.

నంద——మురాచాణక్యుల సంబంధముకూడను నంతఃపురములోని దొంగతనమేకద! మల్లికా! నీ వంతఃపురములో నేమి హరించితివి?

వసం——నమస్కరించినదో పైంట చెఱంగును బరీక్షించినఁ దెలియును ఇదిగో మూట.

మల్లి--ఆవస్తువు నీకంటకుము. అది మాదేవిగారిది.

రాక్ష--మీ దేవిగారి వస్తు వెక్కడనుండి తీసికొని వెళ్ళుచున్నావు?

సునం--ఆవస్తువును నిన్ను నీదేవి తెమ్మనినదా?

మల్లి--చెప్పుటకుముందు మఱియొక సంగతిఁ జెప్పినది. అప్పుడు వాకుఁ బూనలలోని త్రాడు తెగుటచేత--

వసం--ఇప్పుడుకూడ నది సిద్ధముగానే యున్నది.

సునం--ఆవస్తువు నిన్ను మురా తెమ్మని చెప్పినదా?

రాక్ష--అమ్మా! ఉండుము. మల్లికా! మఱియొకసంగతిఁ జెప్పిన దని చెప్పితి వదియేమి?

మల్లి—చాణక్యుని యింటికిఁబోయి కొన్నికొన్ని రహస్యముల నడిగిర మ్మని చెప్పినది. నేను బోవుచుండగఁ బిల్లియెదురుగ వచ్చుటచేత--

నంద--ఆరహస్యము లేవియో చెప్పెదవా లేదా?

మల్లి--చెప్పవీలులేదు. చెప్పవద్దని దేవి నాతోఁ జెప్పినది. పూర్వమందుఁగూడనిట్టి--

రాక్ష--వానిస్వభావమైన చెప్పెదవా? లేదా?

మల్లి--ముందుజరుగఁబోవునట్టి సంగతులు.

సునం--(అపవారించి) భట్టనాథుఁడు చాణక్యునింటిలోనుండెనా?

రాక్ష--(అపవారించి) అవును. ఇదిభట్టనాథునివలనఁ దనభవిష్యద్గ్రంథమును దెలిసికొనఁ బోయెను.

నంద--తలనొప్పియెత్తుచున్నది. మల్లికా! నీచెంగున నేమి ముడిచితివో యిటఁబెట్టుము.

మల్లి--అది యెవ్వరికైనఁ జూపించిన దేవి నాతలఁ బగులఁగొట్టును. అదియేదో యెవరికిని జూపవలదు. ఎవరితోడను జెప్పవలదని దేవి నాతో నూఱుమాఱులు చెప్పి పంచినది.

రాక్ష——అది చాణక్యుఁడు నీచేతి కిచ్చినాఁడా?

మల్లి——ఆసంగతి నన్నడుగవలదు. నేను జెప్పఁజాలను. చెప్పఁగూడదు.

నంద——వసంతా! దానిని నెత్తివాయఁగొట్టి యావస్తువును దీసికొనుము.

వసం——(బలవంతముగఁ దీసి రాజునకిచ్చుచున్నాఁడు)

మల్లి——(ఏడ్చుచు) నేనింటికిఁ బోయి యీసంగతి మాయమ్మగారితోఁ జెప్పెదను. (పోవయత్నించుచున్నది)

రాక్ష——(అపవారించి) వసంతా! దానిని బోనీయకుము. అది పోయినయెడల నీవృత్తాంతము వెల్లడియగును. చాణక్యున కేమాత్రము దెలిసిన నింతతంత్రము నాతఁడు విఘాతము చేయఁగలఁడు. అతఁడిక్కడికి వచ్చువఱకు నాతని కీసంగతిఁ దెలియనీఁగూడదు.

వసం——మల్లికా! నీవు పోఁగూడదు. (ఆపుచున్నాఁడు.) (మల్లిక యేడ్చుచున్నది.)

రాక్ష——(తనలో) ఆయుత్తరము నేను సృష్టించినది. చాణక్యుని పెట్టెను మారుతాళముచేఁదీసి యాతనిముద్రికను దానిక్రింద వ్రాలుగనుఁ బ్రతినిధిగ వేసితిని.

సునం—వసంతా! సమయ మెఱుఁగకుండ మాటలాడెద వేల? రాక్షసా! చదువుము.

రాక్ష—(చదువుచు) నీ కుపపతియైన చాణక్యుఁ డాశీర్వచనపూర్వకముగ వ్రాసినది.

నంద—ఆహా! ముర కుపపతియయ్యెనా?

గీ. తనను బ్రాహ్మణుం డని పిల్చుకొనుట సిగ్గు;
తను సచివవరుఁడని పిల్చుకొనుట లజ్జ;
ముర కుపపతియనెడు పేరఁబరగఁదనకు
నిహపరోత్తారకం బని యెంచినాఁడు.

వసం—ముర కుపపతియని బిరుదువహించుట తన గౌరవార్థము కాదు. ముర నుంచుకొన్న మీ కగౌరవమునకు.

రాక్ష—మహాప్రభూ!

గీ. మదనసమరూపుఁడవు, రాజమౌళి, వసమ
భాగ్యశాలి వనుచు నెన్నఁబడిననిన్ను,
మోసపుచ్చి, నీచునిఁ బొందుమురకుఁ గన్న
లేదొ, మనసుకుదురులేదొ లేదొ సిగ్గు.

సునం—భయము లేదు.

వసం—రాక్షసా! నీవు బుద్ధిమంతుఁడవే కాని యీయంశమునందుఁ బొరఁబాటు నొందితివి. స్త్రీలవలపున కొక కారణ మగపడదు. పురుషునిరూపరాజ్యధనాదు లందులకుఁ గారణములు గావు. అది యకారణముగఁగూడ నుద్భవించును.

సీ. అందువైఖరిఁ జూచి యాసించు నొక్కతె
కోరమీసముఁజూచి కులుకు నొకతె
నడకతీవినిజూచి తడఁబడు నొక్కతె
మందహాసముఁజూచి మరగునొకతె

కేరడంబులఁ జూచి కిచ కిచ మనునొక్క
బొట్టువెఖరిఁ జూచి మురియునొక తె
సిగపువ్వులను జూచి యుగిలించు నొక్కతె
చూచువైఖరిఁ జూచి సోలునొకతె

తే. గీ. నరుని యైశ్వర్యమునకు, నున్మత్తు నవ్వు
నకును, గాంతల మోహంబునకు నెవండు
కారణముఁ జెప్ప నేర్చు నెవ్వారికైనఁ
దెలియ దని నేను దృఢముగాఁ దెలుపఁగలను.

నంద--రాక్షసా! తరువాతఁ జదువుము.

రాక్ష--మహాప్రభూ! క్షమింప వేఁడుచున్నాను.

నంద--చదువుము. నీవు వ్రాసినట్లే భయపడుచుంటి వేమి?

వసం--వ్రాసినవానికి భయమెక్కడిది? (అపవారించి) రాక్షసా! నందు
డటు లనుచుండె నేల?

రాక్ష--(అపవారించి) నిజము చెప్పుట కుద్దేశింపఁబడిన జిహ్వా ప్రమా
దము చేత నొక్కసారియైన నిజము పలుకఁగూడదా?

(చదువుచున్నాఁడు)

గీ. అనుభవింపలేఁడు, త్యజియింపగను జాలఁ
డితరుఁ డనుభవింప నేడ్చుచుండు,
నెంత పాపకర్మ మీ రాజభూతఁబు
విడుచుదారి గానఁబడకయుండె.

వసం--హరిహరీ! హరిహరీ! ఏమి యీనాటి క్రొవ్వుతనము!

నంద--ఆహా చాణక్యుడా! క్రిందను మీఁదనుఁ దెలియక యుంటివా?
నేను నీకంటికి రాజభూతము నైతినా?

సీ. దానిని జూడ నుత్సాహమొందిన నీదు
కన్నులు కొఱవిచేఁ గాల్ప లేము;

దానితో మాటాడఁ దవిలిననీనాల్కఁ
గోడవలిచేతను గోయలేదు;
దానియింటికి నీవ్రుఁ జారినందున నీదు
పాదముల్గదచేత మోఁదలేదు;
దానికౌఁగిలిచేత ధన్యుఁడవౌనీదు
కరములు కత్తిచే నఱుకలే దిఁ
తే. గీ. కేమి చేసితి నని యిట్లు లేడ్చుచుంటి
వెంతో ధన మిచ్చి, మంత్రిత్వ మిచ్చి, సతిని
గూడ నిచ్చి, నోటినిమూసికొనిన నైన
చెనఁటి నీ చేతఁ దిట్లు తప్పినవి కావె!

వసం—(అపవారించి) నూతనబాద్ధమతముచే వచ్చిన నపుంసకత్వ మిదిఁ. తీవ్ర మగుకోపమే రాదేమి? వారిని జంపునని తోఁచదు.

రాక్ష—(అపవారించి)నిశ్చయమే.

వసం—(అపవారించి) ఇది వృథాప్రయాసమేనా?

రాక్ష—(అపవారించి) ఇంకఁ గొంచ మాశ యన్నది. తరువాత నీకే తెలియు. (ప్రకాశముగా) తరువాతఁ జదువనా?

నంద—సరే.

రాక్ష—(చదువుచున్నాఁడు)

గీ. "నిన్న రాతిరి మల్లిచే నీకుఁ బంపి
నట్టి వార్త విదూషకుఁ డట్టె వినియెఁ
దుచ్ఛు డగువాఁడు భూనాథుతోఁడఁ జెప్ప
కుండునే యింక మనమిట నుండరాదు".

వసం—రాక్షేంద్రా! వింటివా? నేను మీ కీసంగతిఁ జెప్పినందునకుఁ
[illegible] వచనక్షమాలు నాకుఁ బడినవి.

రాక్ష—(చదువుచున్నాఁడు.)

గీ. ఉదయమున రాజసభ కేగి యుర్వీపతిని
గాంచి రామేశ్వరముపోవ సెంచినాఁడు;
వత్సరము నాకు సెల వీయవలె నఁటన్న
నతఁ డనిష్టతఁ దనతల నట్టెయూఁచె.

వసం—(అపవారించి)రాక్షసా! నీవునాకీయుత్తర ముదయముననిచ్చి చెప్పి
లినపిమ్మటరాజువచ్చి, చాణక్యుఁడు రామేశ్వరయాత్ర కిప్పుడే
సెలవడిగివెళ్ళినాఁడని చెప్పెను. నీవు నా కీయుత్తర మిచ్చుటకు
ముందే యాతని కట్టియాత్రాభిప్రాయ మున్నదని యెటుల కని
పెట్టి వ్రాసితివి?

రాక్ష—(అపవారించి) నే నీయుత్తరమును వ్రాయుచుండఁగనె చాణ
క్యుఁడు రాజుతో సెలవును గుఱించి పట్టుదలఁగ మాటలాడుట
గోడచాటునుండి వింటిని. వెంటనే యాసంగతినిగూడ నిం
దుదాహరించితిని (ప్రకాశముగఁ జదువుచున్నాఁడు)

గీ. సకియ ! హిమగిరిప్రాంతదేశమున కేను
ముందుగాఁ బోదు, నొకమాసము గడచిన పి
దప మనసుతునితో నాదుదరిని జేర
వలెను నీవు, నే నినుఁ బాయఁగలన ? లలన !

నంద—హిమాలయప్రాంతమున కేగుట యతిశైత్యావశ్యకగాఢపరిరంభ
సౌఖ్యానుభవమునకా ?

వసం—ఇక్కడికి రామేశ్వరయాత్ర నామమాత్రమేనా ? రాక్షసా !
ఈయుత్తరమును బద్యములతో వ్రాసెనుగదా ! చాణక్యుని
కిఁ గవితాశక్తి యున్నదా !

నంద—కాంతానురాగము కవిత్వప్రోత్సాహకముగదా !

వసం—అన్నియు గీతములే చెప్పినేమి? ఇతరవృత్తలక్షణము లెఱుఁగ నట్లున్నది? ఇట్టికవిత్వము నేనుమాత్రము చెప్పలేనా?

నంద—వసంతా! నోరుమూసికొని యూరకుండుము. రాక్షసా! తరువాతఁ జదువుము.

రాక్ష—(అపహారించి) వసంతా! నీ వడిగిన మతిమాలిన ప్రశ్నము నకు రాజుగారు దివ్యమైన సమాధానము చెప్పినారు సుమా!

(చదువుచున్నాఁడు.)

గీ. చంద్రగుప్తుని మగధరాజ్యంబునందుఁ,
బట్టమును గట్టనెంచితి, నెట్టులైన ;

నంద—ఆగు. ఆగు. ఎట్టులైన నననేమి?

వసం—నానాలుక నైనఁగోయించుకొందునుగాని యమాంగళ్యములు నేనుఁ బలుకఁగలనా?

నంద—నన్నుఁ జంపి నావంశనాశనమును జేసియైన నని యతని యభిప్రాయము.

వసం—హరి హరీ!

నంద—తరువాత చదువుము.

రాక్ష—(చదువుచున్నాఁడు)

మహితమూర్ధాభిషిక్తుని మాత వగుదు
నీకుఁ బెనిమిటి నగుటయే నాకు ఘనత.

నంద—ఛీ! ఛీ! నిన్నుఁ జిత్రవధ సేసినను బాపములేదురా!

సునం—నాథా! ఈమాటలు విన్నప్పటినుండియు నాకు గుండెలు తల్లడిల్లుచున్నవి. వారకాంత లెన్నఁటికైనఁ బతివ్రతలగుదురా? మంత్రులందఱును రాజవిశ్వాసవంతులై యుందురా? అందు లకు విచారింపవలసినపని లేదు. కాని, సర్వసమిద్ధలక్షణధురం

ధర్మపత్నియైన తొమ్మండ్రు కొడుకులు నీకుండఁగ దాసీపుత్రుఁ డగు చంద్రగుప్తుఁడు పట్టాభిషిక్తుఁడగుట యసందర్భము. అసహజము. అట్టియుపద్రవమును నివారించుట కెంతయైనఁ జేయఁ దగును. నిరంకుశప్రతిజ్ఞుఁ డగు చాణక్యుఁడు—

నంద—దేవీ! ఏలతొందరపడెదవు? చాణక్యునకుఁ దగుశిక్షఁ జేయుంతును. రాక్షసా! ఇఁక నాయుత్తర మటుంచి మురాచాణక్యులను బిలిపింపుము.

రాక్ష—మహాప్రభూ! సంపూర్తి కావచ్చినది. (చదువుచున్నాఁడు.)

గీ. “ విక్రయింప వచ్చువెలతోడ గ్రహశాంతిఁ
జేసికొమ్మటంచుఁ జిత్రరత్న
ఖచితము లగునీదుగాజులు పంపితి
వందుకొంటి, ముదముఁ జెందియుంటి.

గ్రహింపవలెను. చాణక్యుఁడు. ”

నంద—ఆహా! దీనిసాహసము! నిన్న నీపరికి నింకను బేరమాఁడుచున్న యమూల్యమణిసహితము లగుగాజు లప్పుడే యాతని కిచ్చినదా? విక్రయించుకొనివచ్చినసొమ్ముచే గోచారరీతిని దన కానుకూల్యరహితములుగ నున్నగ్రహములకు శాంతులు చేయించు కొమ్మనెనా! హా! దీని కండకావరము.

సునం—ఏమి! నిన్నను కొనినవేనా? నాకుఁ గనఁబఱచిన యెడల నేను గొనిపెట్టు మందునేమో యని నాకుఁ జూపకుండవానికిఁ గొనియిచ్చితిరి. దాని కిచ్చినందులకుఁ జింత లేదు. కాని యది యిట్లు చేయుట వింతగనున్నది.

వసం—ఆ. పేరికొఱకు మగఁడు విస్తారధనయుతుఁ
డిచ్చుధనము నంత నెవఁడో తుచ్ఛుఁ

హైనముద్దమగని కర్పించి వెలసతి
గ్రుడ్లు మిడుకరించుకొనునుగాదె ?

నంద — రాక్షసా! ఇంకను జాణక్యునకును మురమును వార్త పంపవేమి?

రాక్ష — మహాప్రభూ ! క్షమింపవలెను.

నంద — ఇంకను జెప్పవలసిన దేమున్నది ?

రాక్ష — నే నొకసంగతి మనవిఁ జేసికొందును, క్షమింపవలెను.

నం — క్షమించితిని.

రాక్ష — చాణక్యుఁడు పరమద్రోహి యని స్పష్టపడినదికదా! ఇఁక వానికే శిక్ష విధింతురో స్థిరపఱచినతరువాత నాతనిని బిలిపించెదను. శిక్షయే విధించుట కిష్టము లేనియెడల వారినిటకు రప్పింపకుంటయే శ్రేష్ఠము. మఱింత లోకువ యగును.

గీ. ద్రోహి యనుచు నెఱిఁగి తుద శిక్షఁజేయని
రాజదృష్టిబొమ్మ, ప్రజలు వాని
వెక్కిరించి కీడు వేఁ జేయుదురు దాని
కాకులెక్కి తన్ని పీఁకునటులె.

నంద — ఆ ! ఆ ! ఆతనిని శిక్షింపక యుపేక్షించువాఁ డెవఁడు?దూరదూరమునకుఁ బంపుదును. మరణశిక్షనే విధింపవలసినదికాని.

రాక్ష — రాజేంద్ర !

గీ. ద్రోహి యగుప్రతిభావంతు ద్రోహ మాపఁ
గంటికడనె యుంపఁగవలెఁ గాక స్వేచ్ఛ
నిడిన సంపదలకును హాని వడిగఁ జేయు
బోనునుండి విడువఁబడుపులిని బోలి.

నంద — అట్లయిన నీ వేమందువు ?

రాక్ష — ఏమనుట కే మున్నది? అతనిఁ జంపుటశపథహాని. ఆతని

నిక్కడనే యుంచుట మీకిష్టములేదు. అతనిని మఱియొక దూరదేశమునకుఁ బంపి యక్కడ కారాగృహబద్ధుని జేయించినను మన కేతీరుననైన మహాబుద్ధిశాలియైన యాతనిచే సంఘమరణము తప్పదు. ఏమిచేయఁదగునో మీరే సెలవీయవలెను.

వసం——ఇతనిని నపుంసకునిఁ జేసిన సర్వోత్తమమని నాయభిప్రాయము.

సునం——నిన్ను మూగవానిగఁ జేయుట సర్వోత్కృష్టము.

రాక్ష——పశ్చిమపాంచాలదేశాధిపతి యగుయాదవసేనుఁడు నీకత్యంత ప్రియుఁడు విధేయుఁడే కదా!

నంద——సందేహమేమి? అతఁడు నాయాజ్ఞను శిరమునధరించువాఁడు; సత్యవాది.

రాక్ష——ఆరాజున కొకయుత్తరము వ్రాసి చాణక్యునతనియొద్దకుఁబంపవలెను.

నంద—లేఖ యేమని వ్రాయవలసినది?

రాక్ష—"నాయెడల భక్తివిశ్వాసములు గలవాఁడవగునీవు నావిరోధి యగుచాణక్యుని శిరచ్ఛేదము చేయింపవలెను" అని వ్రాయవలెను.

నంద—ఆయుత్తరమును నేను వ్రాయుట నాకిష్టముకాదు.

రాక్ష—లేనియెడల మీసెలవైనదని నేను వ్రాయుదును. అందున కంగీకరింపవలెను.

సునం—ప్రాణనాథా! ఎంతమాత్రమును సందేహింపవలదు.

నంద—మురాచాణక్యులను వినినతరువాతఁ జెప్పెదను.

వసం—దీపమాఱిపోయిన దీపస్తంభమువలె మల్లిక ముఖకాంతిశూన్యయై యక్కడనే యున్నది.

నంద—మల్లికా! నీవుపోయి మురను దీసికొనిరమ్ము——సేవకా!

(నేపథ్యమందు) అయ్యా!

నంద—నీవుపోయి చాణక్యునిఁ దీసికొనిరమ్ము.

(నేపథ్యమందు) చిత్తము!

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! చాణక్యుఁ డింటియొద్ద లేఁడు.

నంద-ఛీ! ఇంటియొద్దలేఁడని తిరిగివచ్చితివా? వసంతా! వానినిదన్నుము.

వసం—(కొట్టుచున్నాఁడు.)

మల్లి—(ప్రవేశించి) అయ్యా! మురకొంచెము సేపు తాళివచ్చెదనని చెప్పినది.

నంద-వసంతా! దీనిని గొప్పుపట్టుకొని యిటు తీసుకొనిరమ్ము.

వసం—(రాజువొద్ద కీడ్చుకొనివచ్చును.)

రాక్ష—చాణక్యుఁ డింటియొద్ద లేఁ డనుటవలనను మురయిప్పుడు రావని చెప్పుటవలనను జాణక్యుఁడు మురయింటియొద్దనున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. ఈమల్లికను మీఁదు బెదరించినయెడల యథార్థము తెలియఁగలదు.

నంద—ఆ! ఆ! పట్టపగలే యంతఃపురమును దూరినాఁడా? మల్లికా! చాణక్యుఁడు మురయొద్దనుండెనా లేదా? యథార్థమును జెప్పుము; లేనియెడల నీతలఁ బగులఁగొట్టెదను.

మల్లి—నేను వెళ్లుసరికిఁ గుక్క గొలుసు విప్పుకొని కుడితిగోలెములో—

నంద—(నోటిపైఁగొట్టి) నోటికివచ్చినట్లు ప్రేలకు. అడిగినదానికి సమాధానమును జెప్పుము.

మల్లి—గోపీచందనముతో ముక్కుమీఁదనుండి ముఖముమీఁది కట్లకట్టినవలె—

నంద—ఛీ! ఛీ! పేలరి! (కొట్టుచున్నాఁడు.)

రాక్ష—రాజేంద్ర! కొట్టవలదు. అది యథార్థమే చెప్పెడిని. మల్లికా! చెప్పు.

మల్లి--పొడుగుగా రెండుపాయలుగా బొట్టు పెట్టుకొని చెవులకుఁ బెద్ద పోఁగులుపెట్టుకొని కూర్చున్న బాపనయ్యతోఁ మాటలాడుచుఁ జాణక్యుఁడు బాబుగా రేదో భుజపత్రమును జూచుచున్నాఁడు.

శాక్ష--చంద్రగుప్తునికిఁ బట్టాభిషేకయోగ మున్నదని మోహరిజోస్యుని చేత మురకుఁ జెప్పించుచున్నట్లున్నది.

నంద--అప్పుడు ముర యేమిచేయుచున్నది?

మల్లి--మంచమునకు నల్లులుపట్టినవని--

నంద--ఛీ! ఛీ! నోరుమూయుము. ముర వానియొద్ద నున్నదో లేదో చెప్పుము.

మల్లి--మిక్కిలి దగ్గరగ లేదు. కొంచెముదూరముగ నిలువఁబడి తమలపాకులచిలుకలు చుట్టుచు సున్నమునకు వడితగ్గినదని--

నంద--(మల్లికనువిడిచి) పతిభక్తిఁ గనఁబఱచుటకై నిలువఁబడి యుండెనుగాఁబోలు!

వసం--తమలపాకులు తనకొఱకే చుట్టుకొనుచుండెనని తోఁచుచున్నది.

నంద--తన కేమైనయెడలఁ జుట్టుటకు సేవపరిచారికలున్నారు. చాణక్యుని కొఱకేకావునఁ జాణక్య దాసియగుతాను జుట్టుచున్నది. ఓరి సేవకా! ఓసీమల్లికా! మీరిద్దఱును పనిగట్టి వారిద్దఱిని దీసికొనిరండు. రామనినయెడలజుట్టుమెలఁతవేసియీడ్చుకొనిరండు.

(మల్లికయు సేవకుఁడుఁ బోవుచున్నారు.)

నంద--ఆ. ద్విజులు మోసకాండ్రు; విగతబుద్ధుల మోస
పుచ్చుటకు కుశాస్త్రమును రచించి,
అందువలన జనులు హానిఁ జెందుదురుగా
వలను దగులఁబడ్డ పక్షులట్లు.

శాక్ష--(తనలో) బౌద్ధమతాభిమాన మిట్టి బ్రాహ్మణనిందను జేయించుచున్నది.

వసం—అట్టి గ్రిహశాస్త్ర మభ్యసించి యభాగ్యుల కధిక రాజయో
గము లవలీలఁ జెప్పుచున్న భట్టనాథుఁడు శిక్షాపాత్రుఁడు.

నంద—ఆసుగతి యే నేమగూడ నాలోచించు చున్నాను. రాక్షసా !
ఆజ్యోతిషికునిగూడఁ బిలిపింపుము.

రాక్ష—చిత్తము—సేవకా !

(నేపథ్యమందు) అయ్యా !

రాక్ష—మహారాజుగారిద్వితీయభార్యాంతఃపురమునకుఁ బోయి—

నంద—మహారాజుగారి ద్వితీయభార్య కాదు. ద్వితీయమంత్రిభార్య
యని చెప్పవలెను.

రాక్ష—చిత్తము సేవకా ! మురయింటికిఁ బోయి భట్టనాథుని దీసి
కొనిరమ్ము.

(నేపథ్యమందు) చిత్తము.

నంద—హా ! చాణక్యుఁడా !

గీ. పడుచుతనమునఁ బిక్కటిల్లెడుమదేభ
గమనలగు చెలచెలు లుండఁగా వలువకి
యేండ్లతోకన్ను కై కక్కుర్తి యేల నను న
గవులపా ల్సేయ నీపట్టు కాకయున్న.

హా ! చాణక్యుఁడా ! హా ! చాణక్యుఁడా ! (నేపథ్యమందు) మహా
ప్రభూ ! వచ్చుచుంటిని.

వసం—రాజేంద్ర ! మంత్రివచ్చుచున్నాఁడు. (తనలో)

గీ. దొంగయూబినిఁ బడనున్న నున్న వలెను,
వలఁదగులొకొని మొకనూరఁబందిపోలె,
నుచ్చునను బడు పెడుకొండముచ్చువలెను,
వచ్చునాతఁడు నిటఁజిక్కి పడుట కహాహా !

[చాణక్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చాణ—జయము—జయము—మహారాజా!

నంద—అటు లనఁగూడదు. "జయము—జయము—మహారాజభూతమా!" అనవలెను.

వసం—(తనలో) ఇదివఱకుఁ బంచభూతము లనుకొంటిని. ఇంక వేదాంతశాస్త్రమందు షడ్భూతము లని దిద్దవలసి యున్నది.

చాణ—(తనలో) గీ. రాజవదనంబు కోపతీవ్రతను జెప్ప
మిగులువారలు మొగముల దిగులవైచి
యున్నకుండిరి, వీరు నామీఁదఁగొండె
ములను జెప్పినవైఖరిఁ దెలుపుచుండె.

కానిమ్ము.

నంద—చాణక్యా! ఇప్పుడు నీ వెక్కడినుండి వచ్చుచున్నావు?

చాణ—మనమురయింటనుండి—

నంద—"మనముర" యేమి? మురయొకల నీవు నాతో భాగస్వామి వైతివా?

చాణ—(తనలో) నాకు మురతో సంబంధ మున్నదని రాక్షసుఁడు చెప్పిన ట్లున్నది. కానిమ్ము. (ప్రకాశముగా) తొందరపడక యాలోచింపుఁడు.

నంద—నీ కిప్పుడు మురతో మంతనము లేమి?

చాణ—ఇదివఱ కిరువదిసంవత్సరముల నుండి యున్న మంతనము లే; ఇప్పుడు క్రొత్త యేమున్నది?

వసం—(అపవారించి) రాజేంద్ర! ఒప్పుకొనుచున్నాఁడు—చూచితిరా?

నంద—ఛీ! రాజద్రోహీ! సిగ్గుమాలినవాఁడా!

ఆ. ఇరువదేండ్లనుండి యిట్టివైఖరి ముర
ననుభవించుచుంటి ననుచునంట

రాజు లేఁ డటంచు యోజించితివొ నీవు
మృతియె లేదటంచు నెంచినావొ?

చాణ—ఆ. నీవు లేవటంచు నే ననుకొన నాకు
మృతియె లేదటంచు నెంచఁగాని,
నన్నుఁ దెలియ బుద్ధియున్నదయా నీకని
యెంచవలసివచ్చె నిప్పటికిని.

నంద—ఛీ! ద్విజరూపపశువా! ఏమియఱచుచున్నావు! మాకు బుద్ధి లేదనుచుంటివా? దొంగగడ్డిఁదిను నీ కున్నమాత్రపుబుద్ధికూడ మాకు లేదా? ఛీ! నోరుమూయుము.

ఆ. బ్రహ్మచారినంచు రజ్జులుగొట్టుచు
సందెవేళఁ గులట నొందుచుంట
జ్ఞానమయ్యెనేమి గాడిదా-మానరా
యన్నుఁ దెలివిలేమియగును నాకు.

రాక్ష—మంత్రిశిఖామణీ! సోదరుఁడా!

గీ. ప్రజ్వలించునగ్నిని నేయి పడినయటులు
రాజు లీంక్రోధించె నీయుత్తరమున నింక
బాష్పధారలచే నైన వానికోప
మార్పఁదగు నేఁటిసాహసమతనితోడ?

చాణ—రాక్షసుఁడా! నీవుచేసినద్రోహమిది—నేనెఱుఁగుదును—శీఘ్రకాలములో ననుభవింతువుగాక!—బాష్పధారలు విడుచుట కంత చేఁతకానివాఁడనుగాను. నేను ద్రోహినిగానపు డెవని కోపము వానినే మండఁజేయును.

వసం—(అపవారించి) మహాప్రభూ! లోకేయీమాటలుసహించుటకుఁగష్టముగనున్నవి. ఇంక మీ రెటులనున్నదోయని నేనేడ్చుచున్నాను.

చాణ--గీ. ఒక్కరాత్రి యబ్రాహ్మణుఁ డున్నయిల్లు
ద్విజుఁడు సొరఁడు, మంగలి దది, విటుఁడ వీవె
పుడు తగులుచాని నే నెట్లు ముట్టుదునని
యెంచినాఁడ వీమాత్రమే యెఱుఁగవొక్కొ!

నంద--అబ్బ! అబ్బ! ఏమి. శ్రీరంగనీతులు--బ్రాహ్మణనీతి పరోప
దేశమునకే కాని స్వాచరణమునకుఁ గాదు.

ఆ. యాయజూకులేమి యాపనిషదులేమి
బ్రహ్మచారులేమి రాత్రిపడెడు
వఱకె నిష్ఠ నుంట తరువాత లంజెల
కొంపలందు రోఁతకొలువుకాదె?

చాణ--కులక్షయకరమైన యీబ్రాహ్మణనింద మీకుఁగూడదు.

నంద--ఛీ! చండాలుఁడా! ఛీ! నరఘాతుకుఁడా! నాకులక్షయము
నీవే చేయఁదలఁచితివికాదా!

ఆ. నాదుగొంతుకోసి, నాపుత్త్రనవకంబు
శమనుపురికిఁ బంపి, చంద్రగుప్త
బాలిశునికి నిటనె పట్టాభిషేకంబు
సేయ నెంచితౌర ఛీ! కృతఘ్న!

చాణ--(తనలో) నే నిదివఱకు నీ కీయాపత్తును సంకల్పించుకొనలేదు.
కాని నిర్దోషుడనై నవన్నుఁబరాభవించుటచేత నీవంశచ్ఛేదమును
జేయుటకు నేను బ్రతిజ్ఞచేసినాను.

(ప్రకాశముగ)నిదర్శనములేనిమాటలతో నేమి ప్రయోజనము?

నంద--ఆ! నిదర్శనమే లేదా? ఇదిగో చూడుము. ఇది యేచండాలుఁ డే
తుచ్ఛురాలికి వ్రాసినదో కన్నులు తెఱచికొనిచూడుము. రాగిరా
సైన వ్యయము లేకుండ చేయుంబగళ్ళు ప్రక్కలోని కమరినదని

కులుకుచున్నావు. గ్రుడ్లుమిటకించెదనుజూడు. వసంతా! మురి యింక నేల రాలేదు?

వసం--గ్రామదేవతయాలయమునకు మేకె తనంత తావచ్చునా?

నంద--చాణక్యా! వార్త నంపినను మురి రాకయున్నది. నీవుపోయి దానిని బైటచెఱఁగుఁబట్టుకొని తీసికొనిరా.

చాణ--నేను మీకుమంత్రి నని యెఱుఁగరా?

నంద- వష్టకుఁడవుకూడను. మురి కుపపతివి. అబ్బబ్బా! యెంతఖ్యాతి గలపేరు నొందితివి! నీకు ముందును వెనుకను బదునాల్గు జన్మము లింకఁ దరించినవి. పో. పో.

చాణ—(పోఁబోవుచున్నాఁడు.)

నంద—ఛీ! ఛీ! రా! చూచెదవేమి? ఇంకనురావేమి? జుట్టుపట్టుకొని యీడ్చుకొనిరావలెనా?

(నేపథ్యమందు) వచ్చుచునేయున్నాను.

ఈమాత్రమాలస్యమున కేకొప్పుఁబట్టుకొనియీడ్చుకొని రావలెనా?

రాక—మహాప్రభూ! మురివచ్చుచున్నది.

[మురి ప్రవేశించుచున్నది]

మురి—(తనలో) రాజుగారేమో కోపదీప్తులై యున్నారు. (అపవారించి) వసంతా! గాజులసంగతి ప్రభువువారికిఁదెలియఁజేయవలదని బతి మాలుకొనినను వినకపోతివిగదా! (ప్రకాశముగ) ప్రాణనాథా! నమస్కారము.

వసం—(బిగ్గరగ) ఆసంగతినేను రాజుగారితోఁ జెప్పలేదు; నీయొద్దనున్న తెలివితక్కువ—పరిచారిక యింతకొంపతీసినది. మాడకుముగ్గురు బానిసలు దొరకుసుభిక్షపురోజులలోనంతఘాండ్రసపుదానినుంచ నేల? పశువులసంతకుఁ దీసికొనిపోయి దానిని విక్రయింపుము.

సునం—చెల్లెలా! ఇటురమ్ము (కౌఁగిలించుకొని) రాజున కేమో యారో
జున వెఱ్ఱిపట్టిన ట్లున్నది.

ముర—ప్రాణనాథా! పొరఁబాటును క్షమింపవలెను.

నంద—ఇరువదేండ్లనుండి జరుగుచున్న నిరంకుశమైన ఱంకుతనముప్రమాదమేమి?

ముర—ప్రాణనాథా! అటులనుచుంటి రేమి?

నంద—అదుగో నీప్రాణనాథుఁడు—ప్రాణప్రియుఁడు—నీ కుపపతి. అతనికి నమస్కరింపవేమి?

ముర—నాకతఁ డేల ప్రాణనాథుఁ డగును?

నంద—ఏలయా! ఏలనే?

గీ. రూపరహితుఁ డభాగ్యుఁడు పాపచిత్తుఁ
డజ్ఞుఁ డవమతి యగునన్ను నవలఁ ద్రోసి
మదనసముని భాగ్యయుతుని మహితశౌర్య
కలితు నవనీశు నాతనిఁ గలసి తహాహా!

ముర—మహాప్రభూ! నీకంటెనాకు దైవము లేఁడని నమ్మియుంటిని. సమస్తము నాకు మీరే. త్రికరణశుద్ధిగ మిమ్ము నెన్నిసంవత్సరముల నుండియో యాశ్రయించి పాదసేవఁ జేయుచుంటిని.

నంద—(మురనోరు మూసి) చాణక్యునివైపునకుఁ దిరుగుము. ఇప్పుడు నాతోఁజెప్పినమాటలాతనితోఁజెప్పుము‘ప్రాణనాథా! మీకంటె నాకు దైవము లేఁడు. త్రికరణశుద్ధిగ మిమ్మునమ్మితిని. మీవలన సంతానముగూడ గాంచితి” నని చెప్పవేమి చెప్పవేమి? కులటా! పాంసులా! బ్రహ్మచారిప్రియా! (అనికొట్టుచున్నాఁడు.)

సునం—నాథా! ఏమిపని? ఆఁడుదానిని జేయిచేసికొందురా? చాలు చాలు. ఒకవేళ దోషమున్నను కాచిచూడన ట్లుండవలెను.

సంసారులకు గతి లేదుగాని యిఁక సానులకా!

ముర—(ఏడ్చుచు) నీపాదములతోడు నేను నిర్దోషను.

సునం—(ప్రకాశముగ) చెల్లెలా! నేనెఱుఁగనా? నిన్ను గుఱించి రాజుతో నిదివఱ కెంతో పోరాడితిని. (తనలో) చంద్రగుప్త పట్టాభిషేకమహోత్సవ మీతీరునఁ బరిణమించుచున్నది.

నంద—చాణక్యా! ఉత్తరము చూచితివా? అముద్రనీదేనా?

చాణ—(తనలో) భట్టనాథుఁడు చంద్రగుప్తునికి రాజయోగమున్నదని చెప్పుటవలనఁ గలిగినతంత్రమిది. (ప్రకాశముగ) ఈయుత్తర మే—చండాలుఁడో సృష్టించినాఁడు. రాక్షసా! నీకు గోపమక్కఱ లేదు. ఈతంత్రమొక దుష్టగ్రహప్రోత్సాహము చేఁ జేయఁబడెను. అమ్మా! నీ కులు కక్కఱలేదు; ఈవ్రాఁతనాది కాదు. నాముద్రికను హరించికాని యట్టిది చేయించికాని దీనికీదుష్టుఁడే వేసినాఁడు. ఒకరిచేత నేనిది వ్రాయించితి ననుట యసందర్భము. ఇట్టియుత్తరము స్వలిఖితమై యుండవలెను. నిన్నరాత్రి నేను మల్లికతో మాటలాడఁగ విదూషకుఁడు నన్నుఁజూచినసంగతి మురకుఁ దెలియఁజేయ నీయుత్తరము వ్రాయఁబడినట్లు కనఁబడుచున్నది. నేను మల్లికతో మాటలాడుట యథార్థమైయుండినయెడల నట్టివార్తను మల్లికచేతనే మురకుఁబంపియుందును. ఉత్తరమవసరము లేదు. ఒకసంగతి యాలోచింపుము. ఉత్తర మెప్పుడు వ్రాయుదుము? స్వయముగా వెళ్ళి మాటలాడుట కవకాశము లేనపుడేకదా! ఈయుత్తరమును నేనే వ్రాసితినని నిశ్చయపఱపుము. మురతో నేను వ్యభిచరించుచున్న సంగతి విదూషకుని వలనఁ దమకుఁ దెలియుటచేత నేను బగలుగాని రాత్రిగాని మురయింటికి వెళ్ళుట కవకాశ ముండదని యీ

యుత్తరము వ్రాసినట్లు నిశ్చయపడుచున్నది. ఇప్పుడు నేను మురయింటినుండి వచ్చుచున్నాను. ఉత్తరము నేనే వ్రాసియుండిన యెడల దానియింటికిఁ బగలు నేను బోయియుందునా? అదిగాక నేను మీయొద్ద నుదయమున సెలవుఁదీసికొని వెళ్ళుసరికి జాము ప్రొద్దెక్కినది. అటుతరువాత నుత్తరము వ్రాసి పంపితిననియుత్తరమువలననే స్పష్టమగుచున్నది. రెండుయామములకు మురయింటికిఁ బోఁదలఁచి పోయిన నేను జామున్నరమైనపిమ్మట నీయుత్తరము నేలపంపియుందును ? అసందర్భమనుట స్పష్టముగఁ దోఁచుటలేదా? కావున నేను మురయింటికిఁ బోయిన మాటయైన నసత్యముకావలెను. లేక యీయుత్తరమైన సృష్టికావలెను. ఆమెయింటనుండి వచ్చుచున్నట్లు నాకొఱకు వచ్చిన మీసేవకులే సాక్షులు. కావున నీ యుత్తరము కల్పితము.

నంద—నీమహాబుద్ధి నాసొమ్మును హరించుటయందు, నిట్టియంశములకువిపరీతార్థములను జెప్పుటయందు నుపయోగించినది. కాని, గాజులమాట కేల్లుబొంకెదవు?

చాణ—ఉత్తరమసత్యమైనపుడు తదంశములన్నియు మిథ్యలే. గ్రహశాంతులకు నాయొద్ద ధనములేదనుకొంటిరా? మురతనగాజులనిందుకొఱకు నా కీయవలసినపని యేమున్నది?

నంద—ముద్దులమగఁడవుకాదా ? మనుకారముచేత వలపు బుఱుపుచేత నిచ్చినది. గోచారదుష్టగ్రహశాంతి నీవుసేయ నెంచ వ్యభిచారదుష్టగ్రహశాంతి యది చేసినది. ఏవి? అది నీకిచ్చినగాజులఁ గనఁ బఱపుము.

చాణ—నాకీయ లేదు.

నంద—ఓసీతుచ్ఛ రాలా! నిన్ననిచ్చినగాజు లాతని కీయ లేదా ?

మురా—లేదు.

నంద—నీయొద్దనున్నవా ?

మురా—లేవు.

నంద—ఇంటియొద్ద నున్నవా ?

మురా—లేవు—ఎచ్చటనో పోయినవి.

నంద—గాజులకు రెక్కలువచ్చి చాణక్యుని చేతిలోనికెగిరిపోయెనా ? ఛీ! ఛీ! తుచ్ఛురాలా! నేనిచ్చినసొమ్మంత తేరమగనికిఁగొల్ల పెట్టుచుంటివా? ఓరీయధమా ! ముండ యిచ్చునీవిచేతఁ గడుపు నిండించుకొనుచుంటివా? ఛీ! రాజద్రోహీ ! ఛీ! కులటా! నీవే యీతనిని వరించితివి! నీవే యీతనిని ధన మిచ్చిపోషించుచుంటివి! నీవే యీపెద్దమ్మకు భర్తవు! గాజులు తొడిగించితివికదా! ఇఁక మంగళసూత్రమును గూడఁగట్టుము. (మెడలో పుస్తెలను ద్రెంపును) ఓరాక్షసా ! ఓవసంతా ! ఇక్కడనిపుడు జరుగఁబోవు విచిత్రవివాహమునకు మీరు సదస్యులు. సంతానము కలిగిన యెనిమిదిసంవత్సరము లయిన పిమ్మట సుద్రాలకునికి వివాహమైనది. కుమారుఁడగు చంద్రగుప్తుఁడు కలిగిన పదునెన్మిదేండ్లకు చాణక్యునికి మురతో నిప్పుడు వివాహమగుచున్నది. ఓసీ! నీచేయి చాఁపుము. ఓరీ ! నీవు దీనినిబాణిగ్రహణము చేయవలెను. ఓసీ ! యవిధేయురాలా ! నీచేతి నతనివైపు చాఁప వేమి ?

(కొట్టుచున్నాఁడు.)

మురా—(ఏడ్చుచు) మహాప్రభూ ! నే నేపాప మెఱుఁగను, చాణక్యుఁడు నాకు సోదరుఁడు.

నంద—వగ్గఱను రానంతవఱకు—

ముర—హరిహరీ! (రాజుకాళ్ళపైఁబడి) మహాప్రభూ! నిర్దోషనైననన్నుఁ గటాక్షింపుము.

రాజు—(తన్నుచున్నాఁడు.)

చాణ—రాజా! నీకుమతిలేదా? సిగ్గులేదా? నిర్దోష నేల కొట్టెదవు?

నంద—దానిని గొట్టగ నీకొడలునొప్పు లెత్తుచున్నదా? (చాణక్యుని తలపైనున్నపాగఁ గ్రిందకుఁ బడఁగొట్టి జుట్టుఁబట్టుకొని)ఏదికత్తి ఏదికత్తి!

చాణ—ఛీ! శూద్రుఁడవైనయెడల నాగొంతుకోయుము. ఇదిగోకత్తి (తనచేతికత్తి నిచ్చుచున్నాఁడు.)

రాక్ష—సేవకులారా! సేవకులారా! రండు; ప్రమాదము సంభవించును. చాణక్యునిఁ బట్టుకొనుఁడు; (ఇద్దఱుసేవకులుచాణక్యుని చేతులు పట్టుకొనుచున్నారు.)

నంద—చాణక్యా! నిన్నుఁ జిత్రవధము సేయవలసియున్నది. కాని (చాణక్యుని జుట్టుఁబట్టుకొని యీడ్చి వదలుచున్నాఁడు.)

చాణ—(తనలో) (వీడినముడి చేతఁబట్టుకొని)

ఆ. వె. నందవంశ మేను నాశముచేసెను
వఱకు జుట్టుముడిని వైవ వేగ
దహన మొందు నున్న తక్షకవంశంబు
సకును ధూమశిఖయె నాదుజుట్టు.

ముర—నాథా! నేను మాటలునేర్చినదానను గాను. నిర్దోషను.ఏడ్పుటకైయున నెఱుఁగను. రక్షింపుము.

నంద—ఏడుచుటకైతే ఖరి యింతటినుండి యవిచ్ఛిన్నముగ నేర్చుకొని యాపనియందు విద్వాంసురాల వగుదువుగాక!

ముర—హా! చంద్రగుప్తా! చంద్రగుప్తా! రాజు నన్నుఁ ద్యజించునేకటా

నీ బ్రతుకు కేమి కావలసినదిరా ? తండ్రీ—(ఏడ్చుచున్నది.)

సునం—ఏమియగుట కేమున్నది ? మగధరాజ్యమున నాతఁడు పట్టాభిషిక్తుఁడగును.

ముర—హా ! చంద్రగుప్తా ! (చంద్రగుప్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చంద్ర—అమ్మా ! ఎందుల కేడ్చెదవు ?

ముర—నాకును జాణక్యునకును సంబంధమున్నదని యెవఁడో తుచ్ఛుఁడు సెప్పినమాటలను విని రాజు నన్నుఁ ద్యజియింపఁద లచి యున్నాఁడు. నీవైన నాతనికాళ్లమీఁదఁబడి ప్రార్థింపుము నాయనా !

చంద్ర—అమ్మా ! ఎవ్వరేమనిన నేమి ? ఇందులకై దుఃఖ మొందెదవా?

గీ. అతఁడు నావంటివాఁడు నే నతనివంటి
వాఁడ నౌదు, నాతనికాళ్లపైనఁ బడెడు
నంతదైన్యము నా కేల ? నదియుఁగాక,
మ్రొక్కుటయె చేఁతగా దమ్మ మొదటినుండి.

చాణ—(తనలో) సెబాసు. ఈసింహాసనమున రాజ్యముఁ జేయఁదగిన వాఁడవు నీవు. నేను జీవించియుండినయెడల నిన్ను మగధరాజ్యాధిపతిఁగఁ జేయుట నిశ్చయము.

సునం—(అపవారించి) వసంతా ! చంద్రగుప్తునినోటిలోఁ జేటుఁడు నివ్వలను జోయుము. వానికప్పుడే రాజలక్షణము లగపడు చున్నట్లున్నది.

నంద—ఓరీ ! కులటాసుతా ! నీవు నావంటివాఁడవై నా సింహాసనము నధిష్ఠింపఁదలచినవాఁడవు, నాకు మ్రొక్కుదువఁటరా ! నీతల్లి వంటి స్వభావముకలవాఁడవే నీవుఁ గూడ నగుదువు. ఇంతకా లమునుండి పోషించిన నన్ను విడిచి బ్రాహ్మణునిఁ జేరుటయుం

దెంత విశ్వాసము నీతల్లి నాయెడలఁ గనఁబఱిచినదో నాకు మొత్కుటయందు నీ వంతభక్తిఁ గనఁబఱచుచున్నావు. ఛీ! తుచ్ఛుఁడా! నీమోముఁ జూడరాదు.

చంద్ర—గీ. సదసదూహారహితధరాజాని విడిచి
విప్రవరుఁ జేరు వేశ్య పవిత్రశీల;
దోషరహిత యాతల్లిని దోఁచినట్టి
తండ్రి కెఱఁగని సుతుఁడు నింద్యుండు కాఁడు.

చాణ—(తనలో) భళి చంద్రగుప్తా!

నంద—రాక్షసా! నాకు వీరిమొగములు చూడ నసహ్యముగ నున్నది. శీఘ్రముగ వెడలఁగొట్టుము.

రాక్ష—(అపవారించి) మురాచంద్రగుప్తులనుగూడ చాణక్యునిఁ బంప దలఁచుకొన్న పశ్చిమపాంచాలదేశాధిపతియొద్దకే పంపినయెడల నాతఁడు వీరిని కారాగృహమందుంచుటగాని లేక వధించుటగాని తమయాజ్ఞానుసారముగఁ జేయును. అక్కడకుఁ బంపు మని సెలవా?

నంద—(అపవారించి) సరే కాని వారు గమ్యస్థలమును జేరవలయును వారి కక్కడ విధింపఁబడు శిక్షమాత్ర మిచట వెల్లడిచేయకు.

రాక్ష—(అపవారించి) మహాప్రభూ! చాణక్యునిఁ జంపుమని యుత్తరము వ్రాయుమని సెలవా?

నంద—రాజులసంగతి తెలియనిమ్ము. ఆహా! చాణక్యా!

ఆ. ఇంతవాని నన్నె యిట్టి మోసం బిది
చేసినపుడు నిన్నుఁ జేయ కున్నె?
ఈవుగూడ ననుభవింతువుగాక వి
శ్వాసహైన్యమునను వచ్చు బాధ.

వసం—(తనలో) అపూర్వశాపము ! అబ్బ ! అపూర్వశాపము.

రాక్ష—రాజేంద్రా ! చాణక్యుని పెట్టెలో నే మేమి రాజకీయవ్యవహార మునుగుఱించినతాళపత్రము లున్నవో యవి యాతని పెట్టె నుండి యాతనియెదుటనే తీయించిచూచిన క్షేమముకాదా ?

నంద—సరే.

చాణ—ఇదిగో తాళము.

(రాక్షసుఁడు పెట్టెఁ దీయుచున్నాఁడు.)

(నేపథ్యమందు) (జ్యోతిషికుఁడు వచ్చుచున్నాఁడు.)

వసం—రాజేంద్రా ! మీకుఁ గోపమునిలిచియుండఁగ నే నెవరి నైన పురుషునిఁ గొట్టుటకు ముచ్చటగ నున్నది.

నంద—ఎవరిని గొట్టుదువు ?

వసం—ఇదిగో ! ఈభట్టనాథుని—

(భట్టనాథుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నంద—భట్టనాథా ! నీవుకూడ మురయింటికి చాణక్యునితో నెందుకుఁ బోయితివి.

భట్ట—ముర కొకప్రశ్నముఁ జెప్పఁబోయితిని.

నంద—చంద్రగుప్తునిపట్టాభిషేకమునుగుఱించిన ప్రశ్నమేనా ?

భట్ట—అది యుదయమున నైనది.

నంద—ఇప్పుడు తిరిగిప్రశ్న మేమి ?

భట్ట—పోఁగొట్టుకొనిన గాజు లెక్కడ నున్నవోయని—

వసం—రాజేంద్రా ! వీఁడుగూడ దొంగలజట్టులోనివాఁడే.

(భట్టనాథుని రెండుచెవులను బట్టుకొని) చిడుముపట్టినవాని వలెఁ బసపుమానె యొడలికి రాచికొనుచు నాగు లెలుకవలె "ఒఒఒఒ" యని యఱచుచు జగన్నాథ దేవస్థాన మహానస

ము చు గనిపెట్టుకొనియుండక యిక్కడి కేలవచ్చితివి ? (నెత్తి మీఁదగొట్టుచుఁ ద్రోసివేయుచున్నాఁడు.)

రాక్ష—ఇవియన్నియుఁ దీసి యిచ్చుటనుంచినాను. ఇవి తాళపత్రము లు. ఇది భూర్జపత్రపుటము.

నంద—ఈపొట్లమున నేమున్నది ?

రాక్ష—ఎఱుఁగను.

నంద——తనువుగనున్నదే (విప్పుచు) ఆహాహా ! ఇవిగో ! మురయొక్క గాజులు. ఓరీచండాలుఁడా ! నీగొంతుఁ గోయఁదగినదే. గాజు లసంగతి యెఱుఁగ నని చెప్పితివికాదా ? నీపెట్టెలోని కెటుల వచ్చినవి ? ఓసీపాపీ ! అంకుమునకిని గాజులిచ్చి పంచపక్షి నిఁ ప్రశ్న లడుగుచుంటివా ?

రాక్ష—(తనలో) చాణక్యునిపెట్టె మూఁఱుతాళమునఁ దీసి య్యీగాజుల నే నందులో నుంచినాను.

(ప్రకాశముగా) మహాప్రభూ శాంతింపవలెను.

నంద—(అపవారించి) చాణక్యునిఁజంపవలసినదనియే నీవు చెప్పినవైఖ రిని పాంచాలాధిపతి కుత్తరము వ్రాయుము.

రాక్ష——(అపవారించి) చిత్తము.

సునం—(అపవారించి రాక్షసునితో) చంద్రగుప్త [illegible]ఁ జంపునటుల వ్రాయరాదా ?

రాక్ష—(అపవారించి సునందతో) చాణక్యుఁడ [illegible] నాతఁడు చచ్చి నట్లే (ఉత్తరము వ్రాయుట నభినయించి [illegible] కాశముగ) ఓస్వా దయుఁడా ! మంత్రిశిఖామణీ ! ఓమురా ! [illegible] రములు స్థిరపడి నవి. మీకు దేశత్యాగశిక్షను రాజుగా[illegible] చినారు. పాం చాలదేశాధిపతి యొద్దకుఁబోయి యక్క[illegible]ఁడు. చంద్రగు

ష్టునిఁగూడ మీరు తీసికొనిపొండు. సేవకులారా! మీరు సేనాధిపతి నడిగి యేఁబదిమంది భటులను మీతోఁగూడ సాహాయ్యముకొఱకు దీసికొని వెళ్లవలెను. మీరు వీరితో నాదేశమునకుఁ బోయి వారినక్కడ చేర్చి యీయుత్తరము నా రాజునకుఁ గనఁబఱచి, యతని స్వహస్తలిఖితమైన ప్రత్యుత్తరమును దీసికొనిరండు. సోదరుఁడా! నమస్కారము. మీరు రాజసేవయు, నాకు మీసేవయు, నేటితో ఋణము తీఱినవి.

ముర—నాథా! (తనలో) ఇఁక నాకెక్కడి నాథుఁడు! (ప్రకాశము) అయ్యా! నమస్కారము. అక్కా! నీసవతినైన నేను నీపరిచారికవలెనే యింతకాలమును గాలక్షేపము చేసితిని; దయయుంచుము.

సునం—విచారవిహ్వలతచే మూఁగనైయున్నాను.

ముర—మహారాజా! నన్నుఁ జాణక్యునితోఁ బంపక, వేరొకస్థలమునకుఁ బంప వేఁడుచున్నాను.

నంద—రాక్షసా! దానిని నోరుమూసికొనుమని చెప్పుము.

చాణ—రాజా!

గీ. ఏను దూరమునకు నేగుచుంటిని, నీను
రాజ్యవృద్ధిఁ గాంచఁ బ్రాప్తిలేదు,
నీవు బాగుపడుట నేఁజూడ నిటుమీఁద,
నీదువంశవృద్ధి నేను జూడ.

(మురాచంద్రగుప్తచాణక్యులతో సేవకులు నిష్క్రమించుచున్నారు.)

నంద—రాక్షసా! చాణక్యుని మనమిత్రుఁడు వధించునుగద!

రాక్ష—ఎంతమాత్రమును సందేహము లేదు.

నంద—అబ్బ! ఉదయముననుండి యొక్క టెయాందోళనము. ఇప్పటికిఁ గడితేఱినది. దేవీ! లోనికిఁ బోవుదము రమ్ము.

(ఇద్దఱును పోవుచున్నారు.)

వసం—యజ్ఞపశువులను బట్టినట్లు పట్టి గొంతుకలు కోసినాము.

(హా హా హా నవ్వుచున్నాఁడు.)

రాక్ష—చాణక్యుఁ డింత శీఘ్రముగఁ బరిభవింపఁబడి వెడలఁగొట్టఁబడు నని నే ననుకొనలేదు. చాణక్యుఁడు జీవించియుండిన యెడల చంద్రగుప్తునకుఁ బట్టాభిషేక మగుట నిశ్చయముసుమా! ఏమైన నేమి యనుకూలముగనే జరిగినది.

వసం—(గుండెలుకొట్టుకొని)ఇంతహానిసాహాయ్యము సేయఁగలిగినప్పుడు కొదవయేమి?

రాక్ష—ఇంటికిఁబోయి సావకాశముగ మాటలాడుకొందము రమ్ము.

వసం—ఇదిగో వచ్చుచున్నాను.

(నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయాంకము ముగిసెను.



భృం—తల్లికి సోదరుఁడని యెఱుఁగుదును. ఆయన పేరేమి?

ఇం—'తల్లికి' అని చెప్పఁగా 'ఆయన' అనెద రేమి? మాతల్లి 'స్త్రీ'.

భృం—మీ తల్లిమాట యడుగుట లేదు. మీ మేనమామ మాట యడిగితిని.

ఇం—(ఏడ్చుచు) నాయనా! యిఁకనతనిమాట యేమున్నది? చచ్చియే పోయినాఁడు.

భృం—అబ్బా! అతనిపే రేదయ్యా?

ఇం—(ఏడ్చుచు) పేరు మాసిపోయిన దని యేడ్చుచున్నాను.

భృం—ఛీ! నీయేడుపున కేమిఁగాని నీవు నాప్రాణము విసిగించుటచేత నా కేడుపు వచ్చుచున్నది. చచ్చిన యతనిని చావకముం దే పేరునఁ బిలిచితిరో చెప్పుము.

ఇం—చావ లేదు నాయనా! చచ్చినయెడల నాకింత యేడు పెందునకు? (ఏడ్చుచున్నాఁడు.)

భృం—ఇప్పుడు చచ్చెనని చెప్పితివికాదా ?

ఇం—ఇప్పుడుగాదు. నెలక్రిందట జరిగినసంగతిని జెప్పినాను.

భృం—నెలక్రిందటనైన నాతఁడు చచ్చెనా?

ఇం—లేదు—లేదు—చంపఁబడినాఁడు. (ఏడ్చుచున్నాఁడు.)

భృం—ఎవరిచేత?

ఇం—పశ్చిమపాంచాలదేశాధిపతి యగుయాదవసేనునిచేత.

భృం—మీ మేనమామ యక్కడి కెందులకుఁ బోయెను?

ఇం—మురాచంద్రగుప్తులతోడ నాతఁడుకూడ నచటికిఁ బంపఁబడెను.

భృం—అట్లైన మీ మేనమామ చాణక్యుఁడా?

ఇం—కాదన్నవా రెవ్వరు?

భృం—ఈమరణవార్త నీ కెట్లు తెలిసినది?

ఇం.—వారి నటకుఁ దీసికొని వెళ్లినరాజభటు లారాజుగారియొద్దనుండి నందరాజుగారికొక లేఖను దీసికొనివచ్చిరి. నాకొకయుత్తరముఁ గూడ నిచ్చిరి.

భృం.—నీయుత్తర మెవరియొద్దనుండి?

ఇం.—మా మేనమామ యొద్దనుండి.

భృం.—అతఁ డేమని వ్రాసెను?

ఇం.—ఏమున్నది? యాదవసేనుఁడు నన్ను మండలము దినముల క్రిందట ఖండించినాఁ డని.

భృం.—ఛీ! అటులేల వ్రాయును? నీ చేతిలోనిది యుత్తరమే నా?

ఇం.—అవును.

భృం.—ఏది చదువుము.

ఇం.—కన్నీళ్ళచేతఁజూపానుట లేదు. (ఏడ్చుచున్నాఁడు.)

భృం.—అంత యేడ్చిన లాభమేమి? కన్నులు తుడిచికొని చదువుము.

ఇం.—తుడుచుకొన్న లాభము లేదు.

భృం.—ఎందుచేత?

ఇం.—చిన్నతనముననే తల్లిదండ్రులు స్వర్గస్థులైనయదృష్టహీనునకక్షర జ్ఞానముండునా?

భృం.—అంత ప్రయోజకుఁడవా? ఆయుత్తరము నాచేతిలో నెత్తి పడవేయుము.

(పడవేయుచున్నాఁడు.) (చదువుచున్నాఁడు.)

గీ. "ఉరిని బడయు నున్నాఁడ నీపురమునందు
కొడుక వైనను నీవె యల్లుఁడవు నైన
నీవె నినుఁబెంచునాకొఱకీవు సేయ
వలయు నది యేదో యయ్యది సలుపు మయ్య!

ఇం—అది చేయుచునేయున్నాను. (అనివచ్చుచున్నాఁడు.)

భృం—ఏమి? వృషుని యతనియభిప్రాయము కాదు. అతని పుణ్యాగతికి సమ్మతక్రియ నాచరించువాని యాతనియభిప్రాయము. చాణా క్యునిగతి యెట్లయ్యెనో? పాపము!

ఆ. అవనినాథుదయ యాకస్మికముగాఁగ
నరుని నుద్ధతగతికి రమ్యముగను
లేవనెత్తి యచట వేసెడుచును సుడి
గాలి లఘుపదార్థకమునువలెను.

ఇం—సుడిగాలిచేఁబైనుండి విడువఁబడినలఘుపదార్థ మాలస్యపతన మొందును. రాజచే విడువఁబడినవాఁడుల్కవలె శీఘ్రపతనము నొందును.

భృం—పాపము! మురయొక్కగతి యేమయ్యెను?

ఇం—గొప్పవాఁడు యౌవనానుభవము తీఱినపిమ్మట విడిచిపెట్టినవెల యాలి బ్రతుకుకంటె నీచమైనగతికి వచ్చినది.

భృం—అనఁగా.

ఇం—వార్ధకమున నట్లుత్యజియింపఁబడినవారకాంత పూర్వసంపాదితా భరణముల నమ్ముకొని తినును. అట్లైన జీవనోపాధిని జేసికొననీయక మురయొక్క యాభరణముల నన్నియు నొలిచి యాదవసేనుఁడీరాజునొద్దకుఁ బంపెను. చంద్రగుప్తునిమెడలోని పతకమును, చాణక్యునిచేతికత్తియుఁ గూడ బంపెను. చంద్రగుప్తుని శాశ్వతముగఁ గారాగృహబద్ధునిఁ జేసెను.

భృం—కారాగృహనివాసమునకు మితియుండవలెనే. శాశ్వతముగ నన నేమి? ఎన్నఁటి కాతనికి విడుదలయే లేదా?

ఇం—ఉన్నది.

భృం—ఎప్పుడు?

ఇం—అతనియాత్మ దేహమునుండి విడుదల యైనప్పుడు.

భృం--ఈసంగతులన్ని నీ కెట్లు తెలిసినవి ?

ఇం--రాజభటులు తెచ్చిన యాదవసేనవిరచిత మగు నుత్తరమును బిగ్గరగ సభలోఁ బరమానందభరితుఁడై మనరాజు చదివెను. నేనప్పు డక్కడనే యుంటిని.

భృం--బ్రాహ్మణహత్య యని సంకోచింపక యాదవసేనుఁ డెంతపని చేసెను !

ఇం--చేసినందున కిప్పుడు బాగుగ ననుభవించు చున్నాఁడు.

భృం--ఎటులు?

ఇం--బ్రహ్మహత్యాదోష మతని కన్నులఁ బట్టుకొనినది.

భృం--కన్నులు పోయినవా ?

ఇం--పోయిన యెడల నదృష్టవంతుఁడే. పోటు, సలుపు, మంట, తగ్గి యుండును.

భృం--అలాగుననా? కన్నులు జబ్బుగ నున్నవా?

ఇం--కాకేమి! బ్రాహ్మణాధిక్య మంగీకరింపని బౌద్ధమతవాదమున కీతని నేత్రరోగము ప్రబలమైన యాక్షేపణమునుసుమా!

భృం--ఔషధసేవఁ జేయుచున్నాఁడా ?

ఇం--జగన్నాథసేవఁ జేయఁబోవుచున్నాఁడు.

భృం--స్వామిసన్నిధానమువలనఁ బాపనివృత్తియై కన్నులునిలుచు నని కాఁబోలు నేమి ?

ఇం--ఏమో! అయినను జగన్నాథస్వామికిఁ గన్నులఁ బోఁగొట్టుటయం దున్నమహిమ యిచ్చుటయందుఁగూడ నున్నట్లు వ్యాఁడుక లేదు.

భృం--స్వామిని వేదితాన్నదూషణముఁ జేసినవారి కట్టికేషు తటస్థించు

నని చెప్పినారు. కాని యాదవసేనుఁ డప్పుడే యాత్రాపరుఁ
డై బయలుదేరెనా?

ఇం—అతఁ డెల్లుండి యుదయపురమునకు వచ్చును. కన్నులుండఁగ నేమన
నందమహారాజుగారినిఁ జూడవలెనని యున్నది. కావున నక్కడ
కాతని రమ్మని వేఁడుకొనుచు వ్రాసికొనెను.

భృం—నందుఁ డాతనినిఁ జూడఁబోవునా?

ఇం—ఇంతకు ముందే వసంతునితోడ నొకఁడిద్దఱు పరిచారకులతో
డను బయలుదేరినాఁడు. చాణక్యునిఁ జంపి విశ్వాసమునుగనఁ
బఱచినవానిని జూడకుండునా?

భృం—రాక్షసుఁ డింటియొద్దనే యున్నాఁడు కాఁబోలును!

ఇం—అవును. అయ్యా! నిన్ను నేనింతకుముందు చూచియుండను. నీ
వెవఁడవు?

భృం—రాక్షసహోమిత్యాహము చేత రాజ్యాభిషిక్తుని వారణమునకు గ్రహ
శాంతులు సేయునిమిత్తము రాజుచేఁ బిలుపింపఁబడిన బ్రాహ్మ
ణులలో నొకశిష్యుఁడను.

ఇం—నీ పేరు?

భృం—భృంగారకుఁడు.

ఇం—అంగారకునికి నీకు నొక్కవర్ణభేదమేనా? అయ్యా! ఈమూర్తి నిమి
త్తము లాశ్చర్యకరముగ నున్నవికావా?

భృం—అవును.

సీ. నీరదంబులనుండి తోరనీరముజాఱుఁ
గమశానిమిషమునకరములతోడ
నగ్గితేజమునణగి నంబుజవరిపంక్తి
తేజమున్ గ్రహాగ్రస్తభానుఁ డవ్వేళ నై

ధూమకేతుయుగంబు వ్యోమవీథిఁ గనుపట్టె
కొఱవిదయ్యంబులు దిరిగెఁ దఱచు
నాకాశమున నద్భుతాగ్నేయకీలలు
గ్రాలఁగఁ జుక్కలు రాలుచుండె
తే. గీ. కుక్కలేడ్చెను నక్కలు గూయఁ బలుఁగు
లిండ్లనెక్కి ఉ ఊ యని యెలుఁగు లెత్తి
కూయుఁ గలక్రంపపక్షులు మేయుటకును
బయల రెపరెపలాడును బట్టపగలె.

(నేపథ్యమందు) భృంగారకా! నవధాన్యములు తెచ్చెదనని చెప్పి యింకను రాకున్నాఁడవని గురువుగారు నీయెడలఁ గోపముఁ జేయుచున్నారు.

భృం—ఇదిగో వచ్చుచున్నాను. అయ్యా! నేనుఁ బోయెదను.

(భృంగారకుఁడు పోవుచున్నాఁడు.)

శిం—మేనమామ కాలముచేసినాఁడు. ఇఁక నాకు పెండ్లిచేయువా రెవరు? ఈదుర్నిమిత్తములు భయంకరములుగనున్నవి. ఏనిముష మునందు మరణింతునో! దేహ మశాశ్వతము. అనుభవింపఁ దగిన దన్నియు మఱుక్షణమునాఁటికి చేయుండఁగనే యనుభవింప వలెను. చచ్చిన తరువాత నిఁకేమున్నది? కావున, నిఁక నాకు సానివీథియేగతి. ఇంకను స్నానమవశిష్టముగనున్నది. పోయెదను.

(ఇది విష్కంభము.)

ఉదయపురమునందలి యుద్యానవనము.

[నందుఁడు, వసంతుఁడు ప్రవేశించుచున్నారు.]

వసం—యముని చేతిలోనే జనులకు మరణ మున్న యెడల నేఁడు మనము మరణమునకు మిక్కిలి సమీపముగ నున్నారము సుమా!

నంద—ఏమి? అటు లనుచుంటివి.

వసం—ఉదయపురము పాటలీపురమునకు దక్షిణముగనున్నది కాదా! అందుచేత మనము యముని కిదివఱ కున్నప్పటికంటె నెక్కువ దగ్గఱగనున్నారము. అందువలనఁ దదీయహస్తగతమరణదేవత కును మిక్కిలిదగ్గఱగనే యున్నారము. మహారాజా! రాక్షసుఁడు మనకంటె నదృష్టమంతుఁడు సుమా!

నంద—ఎందుచేత?

వసం—మనతోఁ గూడ రాకపోవుటచేత! మనము రెండురోజులనుండి వృథగఁ బాంచాలాధిపతి కొఱ కీయూరఁ గనిపెట్టుకొనియుం డుటవలనఁ బొందుచున్నశ్రమ మాతనికిఁ దప్పినది కదా!

నంద—ఈమాత్రపుదేహశ్రమమున కేమికాని యనిర్వచనీయమైన యొక మనోవికారము నన్ను వేధించుచున్నది.

ఆ. వె. మురకు శిక్ష యయ్యె, మరి నెందెఁ జాణక్యుఁ
డతనిసుతుఁడు బద్ధుఁ డయ్యెఁ బ్రబల
మోదహేతుమధ్యమున నైన నాచిత్త
ముత్తలపడుఁ గృపణుచిత్తమటులె.

వసం—చాణక్యుఁడు తలఁదెగినవాఁ డయ్యెనుఁ దాఁ బేలువలె జీవించి యుండఁడుకదా!

నంద—మాధవసేనుఁడు నాకెంతయుపకార మొనర్చినాఁడు.

వసం—చాణక్యవధచే నాతనికిఁ గన్నులు రుజాపీడితములు కాకుండిన యెడల—

నంద—నీయభిప్రాయమేమోకాని బ్రాహ్మణహత్యచే నతనికా నేత్ర
రోగము రాలేదని నాయభిప్రాయము.

వస—విశ్వాస మెఱుంగనివానియెడల నుపకారమాతఁడు సేసినందుకు
వచ్చియుండునా?

నంద—ఛీ! నీబుద్ధిహీనత నాకువిశ్వాసహీనత నారోపించుచున్నది. నా
మిత్రుని యక్షిపీడకు బ్రాహ్మణహత్యయే కారణమగునెడల
నట్టిహత్యకుఁ గారణభూతుల మైన మన కేబాధయు నేల
కలుగలేదు?

వసం—కలుగనివేళయయినదా? నాకుఁ బ్రాణము లఱచేతిలోనున్నవి.
చాణక్యుఁడు నానీడవలె నన్ను వెంటాడించుచున్నట్లున్నది.
ఎవరిమాట వినినను నాకుఁ జాణక్యునిమాటవలెనే యున్నది.
కన్ను లిట్టె మూసికొనినఁ జాణక్యుఁ డెట్టయెదుట భయంకరా
కారముతో నిలువఁబడియుండును. కర్మముచాలక రాత్రినిదుర
పట్టెఁగఁ జాణక్యుఁడువచ్చి హుమ్మని నాయెదుఱొమ్ముపై కెక్కి—
నేను నీతోడఁ జెప్పినయసత్యవార్తలకు-(నోరుమూసికొని తెల్లి
బోవుచున్నాఁడు.)

నంద—ఏమి! నాతో నీవుచెప్పినవి మిథ్యావార్తలేనా?

వసం—మహాప్రభూ! రాక్షసప్రోత్సాహముచే నతనిపై యసత్యవా
ర్తలు కల్పించి నీతోఁ జెప్పితి నని యాతఁడు నాపై నేరము
మోపి నానాలుకఁ గోసినట్లు—

నంద—నీకు స్వప్నము వచ్చినదా?

వసం—ఔను మిత్రమా! చాణక్యుఁడు బ్రహ్మరాక్షసుండైనట్లు నాకు
నమ్మకము.

నంద—ఛీ!

వసం—బౌద్ధమత మందు కంగీకరింపదా మేమి? మిత్రమా! యాదవ సేయునితోడ నేనుఁగూడ జగన్నాథయాత్రకుఁబోదునా?

నంద—జగన్నాథసేవ నీకులభించుట మరణించిన తరువాతనే.

వసం—అప్పుడైనను మీకు లభింపదుకాఁబోలును! మిత్రమా! కొండ చిలువవాతఁ బడనున్నకప్పలవలె మనము గ్రామమునకు విశేష దూర మగునీయరణ్యమున నుండనేల? ఇంటికిఁ బోదమురమ్ము.

నంద—మిత్రునిఁ జూడకుండనే?

వసం—కాదు—మృతిని జూడకుండనే.

నంద—ఇప్పు డంత భయకారణ మేమి వచ్చినది?

వసం—అదిగో! చాణక్యుఁడు---

నంద—గీ. పిఱికివానికి నెదలోన దిరుగుతలఁపు
లన్నిరూపవంతంబు లై యక్షిగోచ
ర మగుభయముచేఁ గల్పనాద్రఢిమచేత
గాఢశేముషీయుతమహాకవికివలెను.

వసం—(కన్నులు మూసికొని) అయ్యయ్యో! అదిగో చాణక్యుఁడు!
[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నంద—నీవెవడవు?

సేవ—నేను పాంచాలాధిపతిసేవకుఁడను.

నంద—అతఁడు వచ్చుచున్నాఁడా?

సేవ—చిత్తము. మారాజేంద్రుఁడు నేత్రరోగియగుటవలన దీపికాంతిని సహింపలేఁడు. దీపములనుఁ దగ్గింపవలసినదని నన్నుఁ బంపినాఁడు.

నంద—ఒకటి తప్ప మిగిలినదీపము లార్పవేసవచ్చును.

(సేవకుఁడార్పుచున్నాఁడు.)

వసం—మహాప్రభూ! నామనోరోగము చీకటిని సహింపలేదు.

సేవ—అదికాక—

నంద—ఇంకమఱియేమి?

సేవ—మారాజునకు బాధచే మనస్స్థిమితతచాలదు. కావున, మీ యొద్దనున్న పరిజనులనందరను బంపివేసి వేడుకచెలికాడు, మంత్రి మొదలగునొక కిద్దఱితో మాత్రమే మీరుండవలెనని ప్రార్థనా పూర్వకముగ నాతఁడు మనవిచేసికొను చున్నాఁడు.

నంద—ఇంతమాత్రమునకే ప్రార్థనయేల? మామంత్రిరాలేదు. మే మిద్దరమే వచ్చితిమి. మిగిలినపరిచారకులను గ్రామములోనే యుంచినారము.

సేవ—చిత్తము. నేను సెలవుఁ దీసికొందును.

నంద—సరే. (పోవుచున్నాఁడు)

వసం—తీతువుకూఁత వినినరోగిచిత్తమెటులుండునో పీని మాటల వినిన నాచిత్త మారీతిగనున్నది.

నంద—మరేమియు భయములేదు. (వీపుపైఁ జఱచుచు.)

వసం—అయ్యయ్యో! నన్నెవరో చంపు చున్నారు.

నంద—మరెవరును లేరు; నేనే.

వసం—మహాప్రభూ! నన్నుఁగొట్టుటకు నేను నీ యెడల నేమి ద్రోహ మొనర్చితి నని నీయభిప్రాయము?

[తెరలో బిగ్గరగ]

ఆఁ! ఆఁ! ఇంకను నందరాజు నెడల ద్రోహ మొనర్చువాఁడెవఁడు? పరమనీచుఁడును ద్రోహియు నైనచాణక్యుఁడు మారాజుగారిచేఁ జిత్రవధ సేయఁబడఁగ మఱెవ్వఁడందునకు సాహసించెను?

నంద—చూచితివా! వాఁడు పాంచాలాధిపతియొక్క సేవకుఁడని తోఁచు చున్నది.

గీ. ద్విజుఁడు సచివుఁడు నాసొమ్ముఁ దిన్నవాఁడు,
కుటిలశత్రుఁడై నాగొంతు గోయ నెంచె,
నీచుఁ డితరరాజభటుఁడు నే నెఱుఁగని
వాఁడు నామేలు గోరెను గాలమహిమ.

వసం—ఓం. ఓ. ఓ యని యఱచుచు నీనక్కలు నాపైకి వచ్చుచున్నవి. నేను జీవించియుండఁగనే పీఁకివేయునా?

[తెరలో ఓ. ఓ. ఓ. యని పెద్దధ్వని యగుచు]

నంద—యాదవసేనుఁ డాందోళికా రూఢుఁ డయి వచ్చుచున్నట్లున్నది!

వసం—మృత్యుదేవత నన్ను పిలుచు చున్నట్లున్నది.

[తెరలో]

అఁపు. సవారియాపు! ఇచ్చటనే దిగిపాదచారినై నందచక్రవర్తిని సేవింప వలెనని మారాజుగారు నాతోఁ జెప్పినారు.

నంద--ఆహా! విశ్వాసముయొక్క మహిమ!

వసం--ఆహా! ప్రాణముయొక్క తీపి.

[తెరలో]

గీ. పశ్చిమోత్తరపాంచాలపతికి, నంద
జనవరేణ్యహితునికి, సౌజన్యఖనికి,
దుష్టచాణక్యకరిమృగేంద్రునికి, బద్ధ
చంద్రగుప్తునికి జయము జయము జయము.

వసం--హరిహరీ!

నంద--నందహితుఁడని, చాణక్యహరుఁడని బద్ధచంద్రగుప్తుఁడని పిలిపించుకొనుచున్నాఁడు. కాని, యాదవసేనుఁడని పిలిపించుకొనుటయే మానివేసినాఁడు.

వసం--యాదవసేనుఁడే కాకయుండినఁ జాలుఁగదా? హరి!హరీ!

నంద--ఏమి. అట్లు అనుచున్నావు?

వసం--"బద్ధచంద్రగుప్తునికి జయము జయము జయము" అనివినఁబడెను.
ఈమాట మన కమంగళకరము కాదా??

[తెరలో]

ఓభటులారా! మీరందరును దూరముగఁ బొండు; నేనుబిలిచి
నప్పుడు రావచ్చును. నేత్రబాధ నొందుచున్న రాజుగారుమిమ్ములఁ
గాంచిఅనుఁజూచి చీకాకుపడును. పొండు. వెంటనే పొండు.

వసం--ఇది యంతయు మాయవలె నా కేమోకాని తోఁచుచున్నది.
మహాప్రభూ! ఇప్పు డైన పోదమురమ్ము.

నంద--ఓయి పిచ్చికివాఁడా! భయపడకుము. పారిపోకు. నేను నీ చేయి
పట్టుకొందును. (చేయిపట్టుకొనుచున్నాఁడు)

[తెరలో]

మహాప్రభూ! మీ చేతిని నేనుఁబట్టుకొని మెల్లఁగ నడిపింతును.

నంద—వసంతా ! చూడు ! అదిగో ! యాదవసేనుఁడు భటసాహా
య్యముచే వచ్చుచున్నాఁడు,

గీ. కన్ను చాలనివాఁ డెంతగాత్రదార్ఢ్య
యుతుఁడయినఁ బరాధీనుఁడై వెతను జెందు
బుద్ధి చాలనియతఁడు శ్రీపూర్ణచక్ర
వర్తి యైనను సేవకువాతఁ బడును.

[తెరలో]

అలాగుననే ! అలాగుననే !

వసం—మన కీప్రాణసంకటమైన యుపశ్రుతి యెచ్చటిది ?

నంద—యాదవసేనునికి సేవకుఁడు "అలాగుననే 'అలాగుననే" అని
దారిని దెలుపుచున్నాఁడు. మిత్రమా ! పాంచాలాధిపతీ !
యాదవసేనా ! (చాణక్యుఁడు రాజవేషధరుఁడై ప్రవేశించు
చున్నాఁడు.) ఆహా ! మిత్రమా !

గీ. అక్షిరోగి వగుట నాకుపచ్చని వస్త్ర
మునను ముసుఁగు వైచుకొనివ నీదు
వదనమండలంబు వఱలెను శైవలా
నీకపిహితపుండరీకమటులె.

చాణ—(ఉస్సురనుచున్నాఁడు.)

వక్షం-(తనలో) గీ. పౌరకనుల నాక్రమింపఁగఁ బుట్టవెడలి
మూషికంబుల నీక్షించి బుస్సుమనెకు
ప్రబలకాకోదరములీల వాఁడెవండొ
ముసుఁగులోనుండి మముఁజూచి బుస్సునునుం.

చాణ—(ఉస్సురనుచున్నాఁడు.)

నంద—రాజసఖా! నమస్కారము.

చాణ—(ఉస్సురని తల వంచుచున్నాఁడు.)

నంద—గీ. నరపశువు క్రోధచిత్తుఁడు పరమనీచు
డైన చాణక్యచండాలు నట్టెచంపి
ననుఁ గృతార్థుఁ జేసితి వజ్ఞతను హరించి
ఘనినిఁ బ్రోచిన శ్రీబుద్ధమూర్తివలెను.

యాదవసేనా! మిత్రుని నన్ను బిగ్గఁ గౌఁగిలించుకొనుము.
(కౌఁగిలించుకొనుచున్నాఁడు.)

చాణ—(కౌఁగిలించుకొని)

గీ. బ్రాహ్మణుని జంపఁదలఁచిన పాపమునకు
దురితశూన్యాత్మకా సతిఁద్రోయు దోషమునకు
బాలు గుణజాలు శిక్షించుపాతకమున
కిదిగో మూఁడింటి కొక్కటే యిదిగొపోటు.
(గుండెలలోఁ బొడుచుచున్నాఁడు.)

నంద—హా! యాదవసేనా! హా! హా!

(నేల వ్రాలుచున్నాఁడు.)

చాణ—సేవకా! యీతుచ్ఛుని పట్టుకొని యటకుఁ దీసికొనిపోయి నీయొద్దనున్న కత్తితో వీని కన్నుల నూడఁదీసి యిటు తీసికొనిరమ్ము.

వసం—అయ్యయ్యో! అయ్యయ్యో! రక్షించు. రక్షించు. నేను దుర్మార్గుఁడను. నీచుఁడను. నీయెడలద్రోహ మొనర్చినవాఁడను. రక్షించు.

చాణ—(తన్నుచు) పొమ్ము.

(సేవకుఁడు తీసికొనిపోవుచున్నాఁడు.)

నంద—హా! మిత్రమా! యాదవసేనా! నన్నుఁ బొడిచిన యీబాకు మొనయంతవిశ్వాస మైన నీహృదయమున లేకపోయెనా!

చాణ—నేను నీమిత్రుఁడనుగాను. కన్నులు లేని యాదవసేనుఁడను గాను. (మోమున ముసుఁగు తీసి)

గీ. కుటిలుఁ డౌరా త్ముఁడు పల్కు కొండెములను
గనులు గానక వినుచు నెవ్వనిని నీవు
నాఁడు సభలోఁ బరిభవించినాఁడ వట్టి
ద్విజుఁడు చాణక్యసచివుఁడు వీఁడె ఖేఁడె.

(గుండె చఱచుకొనుచున్నాఁడు.)

గీ. గాడిదా! యని తిట్టితి జ్ఞప్తి యిపుడు
చేసికోర ఛీ! వాచాట! శ్రీమదాంధ్ర
చిత్త మూర్ధాభిషిక్తుల శిరము నిటులె
తన్ను గాడిదెదయే మైనఁ దప్పఁగలదె?

(శిరముపైఁ దన్నుచున్నాఁడు.)

నంద--(కన్నులు తెఱచి) ఛీ ! చాణక్యా ! ఛీ ! వెనుక మురను దొం గతనముగ ననుభవించితివి. ఇప్పుడు నన్ను దొంగతనమునఁ బొడిచితివి. ఛీ ! నీపౌరుషము. నీమొగముఁ జూడఁగూడదు.
(కన్నులు మూసికొనుచు.)

చాణ--సీ. ననుఁ దఱుగు మంచుఁ బాంచాలనాథునకును
దొంగవార్తను బంపుట దుష్టబుద్ధి
పౌరుషంబయ్యె నేమి ! ఛీ ! పాపి ! నేను
గలియఁబడి నిన్నుఁ జంపఁగఁగాక యున్నె ?

ఆ. వె. అంతుతనపునాఁటి రచ్చలోపలదోష
మెఱుఁగనట్టి నన్నుఁదరిసి నాదు
జుట్టు చేతఁబట్టి యీడ్చి లీడ్చితివిగా
రాత్రిపోవఁ బగలు రాకయున్నె ?
(జుట్టు పట్టుకొని యీడ్చుచు.)

నంద--రోమరోమకూపమున కొక బాఁకుఁ దీసికొని నీవు నన్నుఁ బొడిచినను మురయెడల నీవు నాకుఁ జేసినద్రోహమునకంటె నెక్కువఁ జేయఁజాలవు.

వసం--(ప్రవేశించి ఏడ్చుచు) మహాప్రభూ ! నిర్దోషయైన మురయెడల నసత్యవార్తను గల్పించిన నాకుఁ బ్రాయశ్చిత్తమైనది. కన్నులు పోయినవి.

నంద--(కన్నులు తెఱచి) ఆ ! ఆ ! మురదోషరహిత యేనా ?

చాణ--తృటికాలములోఁ జచ్చుచున్నావు. ఇప్పుడైన జ్ఞానవంతుఁడవు గమ్ము. విను. విను.

వసం--చంద్రగుప్తునికిఁ బట్టాభిషేకయోగమున్న దని భట్టనాథుఁడు చెప్పుటచేత సునంద కసూయకలిగి రాక్షసునిచేత నాచేత నీకృత్యమును జేయించినది. శాస్త్రము--

నంద—తెలిసినది. ఇఁక జెప్పకుము. చాణక్యుఁడా! నమస్కరించు చున్నాను. క్షమింపుము. నాకుఁ దగు శిక్షఁ జేసితివి.

చాణ—ఛీ! కులపాంసనుఁడా! ఈశిక్ష నీకుఁ జాలదు. నేను నీపై నెట్లు పగఁ దీర్చికొందునో చెప్పెదను వినుము.

ఆ. వె. నీవుచచ్చువెనుక నీవంశనాశనం
బేను చేయువాఁడ నింతనిజము
క్షత్రియాన్వయంబు కడతేర్చి యశ మొందు
రాజర్షిరూపపరశురామునట్లె.

నంద—హా! హా! హా! ప్రాణములు పోవుచున్నవి. వేగఁ గత్తిని దీయుము.

చాణ—'హా' యన్నవాఁడవు 'హరి' యనలేవా! హరి నీకు లేఁడు కాఁబోలును. లేఁడని నీవనుకొన్న చాణక్యుఁడేయుండఁగా జగత్కర్తయు నున్నాఁడనుకొన్న హరి నీకు లేకపోయెనా? ఛీ! బౌద్ధపిశాచమా! (తన్నుచున్నాఁడు.)

నంద—(హా హా యనుచున్నాఁడు.)

చాణ—ఓరీవసంతా! పతివ్రతయైన మురయెడల దోషారోపణము చేసినందున కేకాదా నీకన్నులు పోయినవి?

వసం—చిత్తము. (కాళ్ళపైఁబడుచున్నాఁడు.)

చాణ—బ్రహ్మచారిపై వ్యభిచారదోషమారోపించినందుకు నీ కేశిక్ష కావలసియున్నది?

వసం—అయ్యా! అయ్యా! రక్షింపుము. రక్షింపుము. దేవి ప్రోద్బలముచే నే నట్లు చేసితిని. నేను నిర్దోషుఁడను.

చాణ—సేవకా! అతఁడు నిర్దోషుఁడగును. అతనిని ఖండింపవలదు. దోషము చేసిన దాని జిహ్వాగ్రానినే ఖండింపుము.

వసం—అయ్యయ్యో! నాలుక కోసిన యెడల మరణింతునేమో!

చాణ--ముల్లాడఁదీసిన కందిరీఁగవలెనా? సేవకా! వీనినిఁదీసికొనిపొమ్ము.

(తన్నుచున్నాఁడు)

వసం--వైదికునినూతనలౌకిక మధికారిగొంటునకోతకును, తననాలుక కోతకును దప్ప మఱియొందునకును వినియోగింపఁబడని నేననుకొనినయుక్తి యయినది. అయ్యయ్యో! అయ్యయ్యో!

(ఏడ్చుచు సేవకునితోఁ బోవుచున్నాఁడు.)

చాణ--ఓరీ! నందపశువా! కటికవానిచేతఁబడకుండ బ్రాహ్మణునిచేతులలో నీకు వధ కలిగినది. నీది పుణ్యజన్మము. ఇకఁజావుము.

(కత్తి తీయుచున్నాఁడు.)

నంద——హాహా!

చాణ--హా! నేత్రోత్సవముగ రక్తము స్రవించుచున్నది.

గీ. నీకు దహనసంస్కారమే లేకయుండుఁ
గాతఁ గాకులు నక్కలు గ్రద్దలైన
నిన్నుఁ దాఁక కుంజెదుఁగాత! నీకు నీళ్ళ
నొసఁగువాఁ డొక్కఁడును లేకయుండుఁ గాత!

గీ. దిశకు నొక్కనిగా దశదిశల కేను
బలి నిడఁగ నెంచితిని నీదువంతు దీఱ
నింక నీసుతనవకంబు నిట్టులే వ
ధించి మంత్రోక్తధశక్తినిఁ దృప్తిపఱతు.

[తెరలో] హా! హా!

చాణ——విదూషకుఁడు చచ్చుచున్నట్లున్నది.

ఆ. వె. అర్కుఁ డస్తమించునదనూన సంజకెం
జాయ యెటులు కనులఁ జల్లఁబఱచు
నటులె వీఁడు చావ నస్రపూరచ్ఛాయ
నేత్రపర్వమయ్యె నేఁడు నాకు.

సేన—(ప్రవేశించి)శిదూషకుఁడు కాలధర్మమునొందినాఁడు.

చాణ—ఆ. వె. మరణవార్త లిట్లు సరససంగీతమై
నాదుచెవుల సోఁకి మోదమిచ్చె
నిట్టి మృదులగాన మే విననెంచితి
నందకులము నాశ మొందువఱకు.

సేవకా! నందవధనాటకమున మనయంక మైనది. ఇఁక మనము నిష్క్రమింపవలెను. పల్లకిలో నేను గూర్చుండి తలుపు వేసికొన్నతరువాత సేవకుల నందఱినిఁ బిలువుము.

సేన—చిత్తము. మహాప్రభూ! బహుజాగరూకతగ వచ్చితిమి; అటులనే పోవలెను. మీరు జీవించియున్నట్లు యాదవసేనుభార్యయైన నెఱుఁగదు.

చాణ—(తనలో)యాదవసేనుఁడే నందునిఁజంపినట్లు లోకమంత వెల్లడియగును.యాదవసేనుని ఖండించుటకాతనిపై రాక్షసుఁడొకగొప్ప సైన్యమునుబంపకతప్పదు.నందరాజు సేన లపరిమితములు.సేనాధిపతు లసాధ్యులు. యాదవసేనుఁడు స్వల్పసేనలతో వారినిగెల్చుట దుర్లభము. కాన నుపాయముచేత వారిని ఖండింపవలెను. పాటలీపురమునకు నామిత్రు నొకని నొకకార్యమునకై పంపవలసియున్నది.

గీ. బ్రాహ్మణ పరాభవము సేయు రాచపండ
కెప్పు డిట్టిగతియె సంభవించుచుండు
నుత్కృష్టౌన్నత్యమును బొంద నున్నమాన
వుండు నావలెఁ జచ్చినట్లుండవలెను.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# ప్రచండచాణక్యము.

## చతుర్థాంకము.

పాటలీపురము--వేశ్యావాటిక.

[మైత్రేయుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మై—చాణక్యహితుఁడనైన నేనాతనిచే నిక్కడికిఁ బంపఁబడితిని.

గీ. బాలికాగీతసాధన ధ్వనియు శబ్ద
ములకొలుపు చిప్పతాళపు గిలుకురవము
కత్తిమద్దెల బొబ్బలఁ గలిసి యుద్ది
వేశ్యవాటిక యని నాకు వెల్లడించు.

ఆ. కుచ్చుతలలవారు కోరచూపులవారు
వెకిలినవ్వువారు వెఱ్ఱిపిసు
వారు కప్పుపండ్లవా రెండలోని తూ
నీఁగలట్లటు నిటు నూఁగుచుండ్రు.

అదిగో! ఎవ్వఁడో యిటకు వచ్చుచున్నాఁడు.

[ఇందుశర్మ ప్రవేశించుచున్నాఁడు.]

ఇం—;"హో. హో. హీ" అనినవ్వుచు) పల్లెటూరి వెఱ్ఱిమొగమువలె నున్నది. వేశ్యవాటికలో రుద్రాక్షదామము లమ్మవచ్చితివా?

మై—(తనలో) శుంఠ కధిక్షేపణమ్ము మెండుగదా!

గీ. పిటుఁలు పీరంచుఁ గొందఱువెఱ్ఱిమొగము
లందె వ్రాయఁబడును వీరి కనుభవంబు
సున్న యల్లరియెక్కువ సొమ్ముపోక
యపయశము రాక యట్టి సన్యాసియితఁడు.

గీ. కిక్కురన కన్నికొంపలఁ జక్కఁబెట్టి
రొక్క మెక్కువపోసిక చెక్కుచెదర
కడఁగి మడఁగి బైరాగిలా గన్నియుడిగి
నట్లుగా గొందరుంద్రు నే నట్టివాఁడ.

ఇం—నోరుమూసికొని యూరకుంటివేమి?

మై—వాఁగక నోరుమూసికొనుము.

[తెరలో]

ఇందుశర్మా! నన్ను నోరుమూసికొనుమంటివా? పట్టెడ యిచ్చెద నని చెప్పి ఛీ! సిగ్గులేదా?

మై—(తనలో) "ఇందుశర్మ" అని పిలుచుచున్నది. వీఁడే కాఁబోలును జాణక్యుని మేనల్లుఁడు. లేక మఱియొకరో తెలిసికొనెదను. ఈతని తో స్నేహమునకై వచ్చిన నాకీతనితో వైరమెందునకు? (ప్రకాశముగా) అయ్యా! నిన్నుఁ దిట్టుచున్నట్లున్న వా రెవరు?

ఇం—చెప్పెదను విను. ఈనాగికి—

[తెరలో]

ఇంతవఱకు నాగమణి. ఇప్పుడు నాగియయ్యెనా! జోగినైతిని గాపున నీయ శక్తి లేదని చెప్పలేకపోతివా?

ఇం—మొదట దీనికిఁ బట్టెడ యిచ్చెదనని చెప్పి పదునాల్గురోజులు సహవాసము చేసితిని. ఐదారుద్దారములపట్టెడ కావలయునని చెప్పినది.

మై—ఇప్పటికి నీయలేకపోతివా?

ఇం—ఇచ్చితిని. బను నేను దారములుగల పను నాఱు మూళ్ళపట్టెడ నిచ్చితిని.

మై—(నవ్వుచు) అన్ని మూళ్ళపట్టెడ యుండునా?

ఇం—నవారుపట్టెడ.

మై—అది యెందులకు?

ఇం—ఇంట నున్న పదిమందికి గొంతుక కురిపోసికొనుటకుఁ జాలపలదా?
ఏమి చేయుమంటివి?

[తెరలో]

నీ మేనమామ గొంతుక కురిపోయుటచేత నతని వంశనాశనమై
నది చాలదా?

మై—(తనలో) ఇతని మేనమామ చాణక్యుఁడని మఱింత నమ్మకము
కలుగుచున్నది.

ఇం—ఆ. గడియకొక్కసానిగా నాఱు నెల లిట
గడపినాఁడ విలువ నుడువరాని
భూవసతులు సతులముద్దుకాళ్ళకు డిగఁ
దుడిచివైచి పాఱఁద్రోచినాఁడ.

ఆ. గన్వతేను బూటకములఁ గాలక్షేప
మింతదనుక నయ్యె నింక నేమి
గతి వెలసతిలేనియతఁడు భూభర మాల
పొత్తులేని కారుగిత్తవలెను.

మై—మీ తల్లిదండ్రులు జీవించియున్నారా?

ఇం—ఉండినయెడల నిప్పుడు నావైఖరిఁజూచి యాత్మహత్యఁ జేసికొన
కుందురా?

మై—నీవు వారకాంతావినియోగము చేసినదంతయుఁ బిత్రార్జితధనమే నా?

ఇం—కాదు. రాజమంత్రియగు మేనమామ సంపాదించినది.

మై.—నీమామ చాణక్యుఁడేనా?

ఇం.—జీవించియుండినప్పుడు.

మై.—అమితధనసంపాదకుండును విశేష బుద్ధిమంతుఁడు నైన నీ మేన మామయొక్క పోలిక నీ కెక్కడను గనఁబడదేమి?

ఇం.—వీపుమీఁదనున్న దెదుట కెట్లు కనఁబడును?

మై.—అదియేమి?

ఇం.—తామర.

మై.—తామరసోద్భవుని రాణి యగుసరస్వతితోఁ బ్రమాణముఁ జేసిన యెడల నీకు శుభకర మగునొకరహస్యమును జెప్పెదను.

ఇం.—ప్రమాణము చేయవలెనా? మాలతియింటిలోనికి శాస్త్రమును దీసికొనివత్తునా?

మై.—వేశ్యాకాంతలగృహము సమీపముననే యున్నది. కావున నిమ్మళ ముగ మాటలాడుము. భగవద్గీత యిదిగో దీనిని దలపైఁ బెట్టు కొని ప్రమాణము చేయుము.

ఇం.—సరే. కాని, మాలపల్లెలోనికి సాలగ్రామము నేల తెచ్చితివి?

మై.—వారవనితాదాసుఁడనైననే నీగీతాకాలక్షేపము చేతనే పవిత్రుఁడ ననిపించుకొనుచున్నాను.

గీ. వేలు కుసుమములు గల్గి సంపెంగమాను
నున్న సానికీర్తంటు విటోపభోగ్య
మానటులె దుష్టచిత్తము హరికథోప
రివచనసహితమై జనప్రీతిఁ జెందు.

ఇం.—అట్టిదిక్కుమాలిన వెలయాలు నీ కెక్కడ లభించెను?

మై.—అదిగాక.

గీ. శ్రీవరుఁడు స్నిగ్ధచర్మంబుచేత మనల
యందలియసహ్యతలఁగప్పె నటులె మనసు

గందలిపిశాచిని వరరుద్రాక్షమాల
లను విభూతిరేఖలఁ గప్ప మనకుఁ దగదె?

ఢుం--(గీత నెత్తిపై నుంచికొని) గీతాశాస్త్రవేద్యుఁ డైనశ్రీకృష్ణుని పాదారవిందములతోడు నేను రహస్యమును వెల్లడిచేయను.

మై--చాణక్యుఁడు జీవించియున్నాఁడు.

ఢుం--సంతోషకర మైనరహస్యముచు జెప్పెదనంటివే !

మై--హరిహరీ! నీ కీవార్త దుఃఖకరమా?

ఢుం--అతనిధన మంతయు నాశనముఁ జేసినందునకు నాకతనిచే నెంత శిక్షతటస్థించునో!

మై--ఏబాధలేకుండ సేవ జేసెదను లెమ్ము.

ఢుం--పోనీనాయనా! గూఢమములో నున్న శ్లేషకవిత్వము చెప్పుమాదేవ వాఁడు చాణక్యుఁడు జీవించియున్నసంగతి నాతో నిదివఱకే చెప్పినాఁడుసుమా!

మై--అయ్యయ్యో! వానికెట్లు తెలిసెను?

ఢుం--చెప్పెదను వినుము. కీరనాసికమేనత్త కీమధ్యమునఁ గీళ్ళన్నియు ఊళ్ళవలె వాచినవి.

మై--పాపము!

ఢుం--దానిదికాదు. నాది. కుంటివైద్యుఁడు దానికీళ్ళకు దూదికట్టవలసినదని చెప్పినాఁడు. దూధి తెమ్మని కీరనాస నన్ను రోజురోజును వేధించుకొని తిన్నది. ఏమిరాభగవంతుఁడా! అని యోజించితిని. మామేనమామ తలగడ యొకటిమాత్రమె యింటిలో నిలిచియుండెను. ఇల్లంతయుఁ జేనుకొరికినవాని తలవలె నుండెను.

మై--ఆతలగడ నేకించుటకు దూదేకులకవినిఁ బిలిపించితివా?

ఢుం--వట్టికవి కాదు. శ్లేషకవి. తలగడపైఁగుప్పించుచు దాని రంధ్రమ్ము

లోనున్న చిన్నయుత్తరమును దీసి చదివెను.

మై--అదియెవరు వ్రాసినది?

ఇం--మామేనమామ. "ఉరినిఁబడయుచున్నాఁడ నీపురమునందు" అని చదివి "ఉరినిఁ బడయుచు" అక్కడకొక్కయే కేకినాఁడు. ఉన్నాఁడనీపురమునందు' అని వేఱుచేసిఅక్కడ వేఱుగ నేకినాఁడు. "ఉరినిఁబడయనున్నాఁడ నీపురమునందు" అని తిరుగఁదొడియేకి మీమేనమామ జీవించియున్నట్లేయుత్తరమే చెప్పుచున్నదనెను.

మై--(నవ్వుచు) ఇంతేగద!

ఇం--మామేనమామ యురినెట్లు తప్పించుకొనెను?

మై--అతఁడు మురాచంద్రగుప్తులతోఁ బశ్చిమపాంచాలమునకు నందరాజభటానీకసహితుఁడై పోయి యాదవసేనరాజును గాంచి యాతనితో నేమిమాటలాడెనో తెలియదు కాని యారాజు చాణక్య దాసుఁడయ్యెను.

ఇం--అతనియొద్ద పురుషవశ్యమంత్ర మున్నది.

మై--నీయొద్ద స్త్రీవశ్యముఁగూడనున్నది.

ఇం--అట్లైన నాకీవిచార మేమునకు?

మై-- గీ. అతనివాక్యలహరి వితతకోపునినైన
శాంతమూర్తిఁ జేయఁ జాలునయ్య
నాగసారపుమృదులనాదము భీషణా
శీవిషమును గునుకఁ జేయునట్టులె.

గీ. ఎట్టిసద్బుధునైన నిట్టె ద్వేషోద్ధతుఁ
గానొనర్చు వచనకలన నతఁడు
చల్లనైనరాతిస్వామయూఖతతి భగ్గు
మనుచు మండఁజేయు నర్కునట్టులె.

ఇం—ఈపనిని నేను జేయఁగలను. అందున కీవాడసాను లందఱును సాక్షులు. ఒక్కమాటఁ జెప్పుచున్నాను వినుము. ఆశచేతఁగాని యెవ్వరును స్వాధీనులుకారు. కొలఁదికాలముక్రిందట నేనొకవేశ్య కుఁ గంకణములిచ్చెదనని చెప్పి కొన్నిరోజులు వెఱ్ఱియాసపెట్టితిని.

మై—తుదకీయలేకపోతివా?

ఇం—ఒక్కటిచ్చితిని.

మై—కంకణములు రెండుండునుగదా!

ఇం—ఒక్కదానితోడనే నేత్రములఁ గావలసినన్ని కంకణములుపూర్తి యయ్యెను.

మై—దాడ విఱుగఁగొట్టి యేడ్పించితివా?

ఇం—ఆ. అఱఁగడియక్రిందటికంటె నిప్పుడు నీముఖమం దెక్కువ తెలివి గనఁబడుచున్నది. సానివీథిలోనున్న మాహాత్మ్యమే యిది.

మై—ఇందుశర్మా! ధనములేనప్పుడు నీకు వారకాంతలపై నీతయాశ యేల?

ఇం—ఓయి వెఱ్ఱివాఁడా! ఆశలేనియెడల సృష్టియే లేదుకదా!

గీ. ఆశ ప్రబలము భువిలోన నందుపైని
స్త్రీలపైనాశ యింతని చెప్పఁ దరమె?
ఆశ లేకున్న జగతియే యనవసరము
సర్వమాశామయం బాట సత్యమగును.

మై—నీవు సానికిఁ గల్పించినట్లే నీ మేనమామయును యాదవసేనునికి గొప్ప యాశకల్పించినట్లు తోఁచును. అయినను నాకీవిషయమున నిశ్చయము తెలియలేదు.

ఇం—ఆయాశ యేదో నాకుఁ జెప్ప నక్కఱలేదు.

గీ. నిజధరణిఁ బాలనముసేయ నేర్పులేని
రాజు పరరాజ్యలక్ష్మికై భ్రాంతిఁ జెందు

గృహవనిత నేలఁజాలని రేవణ పర
కీయఁగసి గుట్టుగుటుకు గ్రుక్కిళ్ళు మ్రింగు.

మై.--నందవంశచ్ఛేదముఁ జాణక్యుఁడు సేయఁగఁ దన్మగధరాజ్యమునందు యాదవసేనుఁడధిష్ఠింపవచ్చు ననునాశ యాతనికిఁ గలుగఁగ నే—

గీ. మిత్రిమరి యయ్యె, నరి ప్రాణమిత్రుఁ డయ్యె,
గనకకాంతావిలోలితమ్మాధవునకు
ఘ్ష యదుజాన్వితునకు మాక్షికం బసహ్య
మగుచు, జింతకాయ హితపదార్థ మగును.

అట్టి దురవిణాశచే యాదవసేనుఁడు నందవధకార్యంబునఁ జాణక్యుని కుట్రలోనికిఁ జేరి యాతనిసిఁ జంపితిననియుఁ చంద్రగుప్తుని గారాగృహమందుంచితిననియు బ్రహ్మహత్యాఘము దనకు నేత్ర పీడాకరమయ్యెననియు జగన్నాథసేవకుఁ బోవుచున్నత న్నుదయ పురమునఁ గలిసికొనవలెననియు నందరాజున కసత్యవార్తాసహిత లేఖనుజాణక్యునిప్రోత్సాహము చేనాతఁడునందుని పేరవ్రాసెను.

ఇం——చాణక్యుఁడు నాకుఁగూడఁ దనమరణమునుగుఱించిన యుత్తర మును వ్రాసెనే?

మై.--నీ వక్షరజ్ఞానశూన్యుఁడవగుటచేత నదిపలువురకుఁ గనఁబఱతువని యు, మైలపట్టుదువనియు, నుత్తరక్రియలాచరింతువనియుఁదన్మూలకముగఁ తనమరణవార్త యథార్థమని మఱింతస్థిరపడుననియును నీకట్టి యుత్తరమును వ్రాసినాఁడు.

ఇం.--ఉత్తరక్రియలనినజ్ఞాపకమువచ్చినది. మరణమునొందనివానికొఱకు నేనుత్తరక్రియ లాచరించితి నే! ఏమికావలసినది?

మై.--మతసంబంధ మైనప్రాయశ్చిత్త మున్నదనియాలోచించుచుంటివా?

ఇం.--ఏమతప్రాయశ్చిత్తమైనను వారవనితలు నాకుఁజేసిన ప్రాయశ్చి

త్తమున కుంజాలను. అందుకొఱకు నేనాలోచించుచుండుట లేదు. కాని జ్ఞానదృష్టి నామలందు నేను బ్రహ్మకిచ్చినసొమ్మును తిరిగి రాఁబట్టుకొనవచ్చునా లేదా అనియూహించుచున్నాను. కాని, మిత్రమా! చాణక్యుఁ డురిదీయఁబడుచుండఁగఁ దామి చూచితి మని రాజభటులే [illegible] రెట్లు మోసపుచ్చఁబడిరి?

మై.--మగధరాజ్యమంత్రియగు చాణక్యుఁ డీ రాజద్రోహియగుట చేనురిఁ దీయింపఁబడుననగ చూచువారలందఱును రావచ్చునని తన రాజ్యమందంతటను యాదవసేనుఁడు సాటింపఁబంచెను. ఉరి రోజున ననేకలక్షలజనసంఘము చూచుచుండఁగఁ జాణక్యుఁ డురిస్థలమునకుఁ దన్నుఁ గొనిపోవు పుష్పభరితమైనశకటమును జాముపొద్దుండఁగ నెక్కెను. సాయంకాలమగువఱకు నూరేగించి చీఁకటిపడినతరువాత నురికంబములయొద్దకుఁ దీసికొని పోఁబడెను. జరిగినచిత్రమేమనఁగా బండికి రెండరలుండెను. పైయరపైఁ జాణక్యుఁడు బహిరంగముగ నుండెనుగాని యడుగరలో నొకమూఁగవాఁడుంచఁబడెను. ఉరికాలమునందు రెండరలకు మధ్యనున్న ద్వారిగుండ చాణక్యుఁడు క్రిందియరలోనికిఁ దిగి యచటనున్న మూఁగవానిని పైకిఁ ద్రోసెను. సంజ చీఁకటిని వాఁ డురిదీయఁబడెను. చాణక్యుఁడు చచ్చెనని జనులందఱు మిన్నుముట్టనార్చిరి. తరువాత బండి తిరిగి కోటలోనికిఁ బోయెను. చాణక్యునికొఱకుఁ ద్రవ్వింపఁబడిన పాతాళగుహలో నాతఁడు రేయుంబగళ్ళు నివసించుచున్నాఁడు. అతఁడు జీవించియున్నసంగతి రాజు, మఱియొకభటుఁడు, నీవు, నేనుఁ దప్ప మఱెవ్వరెఱుంగరు. నందరా జెవరిచేతఁ జంపబడె నని యిచ్చట వాడుకగ నున్నది?

ఇం—మిత్రద్రోహి యగుయాదవసేనుని చేత.

మై—కాదు. దుష్టశిక్షకుఁ డగుచాణక్యుని చేత.

ఇం—ఆఁ! నిజముగానే! జగన్నాథతీర్థయాత్ర యనుమిష పెట్టుకొని చాణక్యుఁడే యాదవసేనవేషపరివారాదిసహితుఁడై సంకేతస్థలమున నందునిఁ జంపినాఁడా?

మై—గీ. సఖుఁ డనుచు భ్రమతోఁ దనసచివశత్రు
నందుఁ డాసక్తిఁ గౌఁగిటియందుఁ జొదవి
ప్రాణములు త్యజించెను ఫలభ్రాంతి నెకుటి
దీపమును గీటకము చేరి దెరలునటులె.

ఇం—యాదవసేనుఁడు తనకుఁ గన్నులు పోనున్నవని వ్రాసెను. అది యసత్యమేనా?

మై—అది చాణక్యుఁడు వసంతుని మొసల యథార్థపఱిచెను.

ఇం—ఆలాగునా? రాజవిశ్లేషమును సహింపలేక వసంతుఁడాత్మహత్యనుఁ జేసికొనెనని యిచ్చట వాడుకగ నున్నదిసుమా!

మై—గీ. శిష్టుఁడైనచాణక్యుఁడు దుష్టుఁ డయ్యెఁ
దుష్టుఁడైనవసంతుఁడు శిష్టుఁ డయ్యెఁ
బ్రజలనోట, మూర్ఖులకంట వారిదంబు
కదలదు, విధుండు పరుగెత్తుగాదె మింట?

ఇం—చాణక్యుఁడు శిష్టుఁడే కాని యిఁకఁ బట్టుదలయందంతవాఁడు లేఁడు. ఒకరోజున ముక్కుపై నీఁగ వ్రాలినదని కోపముచే ముక్కుఁగోసికొనుటకు సిద్ధపడెను.

మై—ఎందుచేత?

ఇం—ముక్కుండుటచేత నీఁగ వ్రాలినదిగదా! కోసిన మొసల—

మై—అయ్యయ్యో? మఱికొన్ని యీఁగలు వ్రాలునే?

ఇం—ముక్కు మీఁద వ్రాలఁగలవా?

మై—ముక్కు గోసికొనుటయనిన జ్ఞప్తికివచ్చినది. చాణక్యుఁడు వసంతుని నాలుకఁ గోయించెనుజుమా!

ఇం—ఆ. చతురవక్త ననుచు మతిపోయి వదరెడు
 వానినాల్కఁ గోయవలెను, జక్కఁ
 దనమునందు సేనె యని విటులను జూడ
 నొప్పనట్టివేశ్యకొప్పవలెను.

మై—బాగుగఁజెప్పితివి. అట్టి దెవతె యైన నిచ్చట నున్నదా?

ఇం—లేకేమి! నన్ను లక్ష్యపెట్టని దా వారకాంత యొక్కతె.

మై—విటులను జూడనేచూడ దేమి? కన్నులు తెలుపించువాఁడు లేక పోయిన నదిచూచునా? అట్టిదానికిఁ గన్నులెక్కడనుండునని నీ యభిప్రాయము?

ఇం—నత్తగుల్లవలె నెత్తిపైఁ గొమ్మొక్కటియుండును.

మై—కాదు. మనసంచిలో నుండును. సంచి విప్పసరికి నది కనుల విప్పును.

ఇం—దానియాశప్రబలముగనున్నది. అందుచేతమనకుదానియాశ లేదు.

మై—చాలు. ధన మిచ్చుమాట యటుంచుము.

 ఆ. నోట నాల్కయుండి బోటిని వలఁకోనఁ
 బొదుపలేనివాఁడు పురుషుఁ డగునె?
 నోరు నాల్కయుండి చూరెలుకను బట్ట
 నట్టియంత్ర మెటుల యగును బోను?

ఇం—దానియొద్ద మనయాటలు సాగవు. అది పరమసౌందర్యవతి.చతుర వచనరచనయగు చతుర.

మై—ఆ! అదియేనా సునందయొక్క పరిచారిక?

ఇం—ఔను. అది నీకెట్లు తెలిసెను?

మై—చాణక్యుఁ డేమితంత్రమాలోచించి న న్నిక్కడకుఁ బంపెనో నే నెఱుఁగను. కాని, యాచతురను నన్నుంచుకొనుమని యాజ్ఞాపించినాఁడు. దాని కీయవలసినదని విశేషధన మిచ్చినాఁడు.

ఇం—వేశ్యనుంచుకొనుమని విశేషధనమిచ్చి నిన్ను బ్రోత్సహించి వేశ్య నుంచుకొని తన ధనమును బాడుచేసిన నాపైఁ గోపపడఁడని తోఁచుచున్నది. మిత్రమా! అది లభించినయెడల నీవంటియదృష్టవంతుఁడే లేఁడని చెప్పవచ్చును.

మై—చూతము. దానియిల్లెక్కడనో యచ్చటికిఁ బోదము రమ్ము.

ఇం—ఈమలుపులోనే దానిల్లు. అది యిప్పుడంతఃపురములో నుండును. గుడ్లగూబ పురుగులను బట్టికొనువేళ నది వెలుపలకువచ్చును.

మై—ఆసమయ మాసన్నమైనది. సరేకాని, ఇక్కడివిశేషము లేవైనఁ జెప్పవా?

ఇం—ఏమున్నది? భృంగవేణితల్లి పొగచుట్టను నిప్పువైపున నోటిలోఁ బెట్టి కునికిపాట్లుపడఁగఁ గొండనాలుక కాలినది.

మై—వేశ్యవాటికలోని విశేషముల నడుగలేను. వ్యావహారికములనడిగితిని. యాదవసేనునిపై కొకగొప్పసైన్యమును బంపినతరువాత రాక్షసుని యంతఃకరణ మెట్లున్నది?

ఇం—గీ. చణకజునిమృతికి ముదము జనపుమృతికి
నార్తి యధికారినను వేక్క యలవసంతుఁ
డీగ్గఁ జింత పోర జయముగల్గునను ప్ర
భయుఁ గలిగియుండు చతురంగపాళివలెను.

మై—అంతయేకాని చాణక్యుఁడు జీవించియున్నట్లు సందేహమే లేదుకదా!

ఇం—సన్న్యాసికిల్లువలె.

మై—నీయింటిని గూడ నమ్మివైచితివా?

ఇం—తాకట్టులోనున్నది.

మై—తాకట్టు నేనువిడిపింతును; మన మిద్దఱ మందున నివసింతము.

ఇం—ఇంటితాకట్టున కేమికాని శోభనాచలము గుమ్మమునొద్దజాగిలము వలెనున్న వేశ్యామాత వాకట్టున కేమైన ముందుగనీయవలెను.

మై—అటులె—ఇఁక నీసొమ్మునకు లోపము కలుగదు-(తెరలో) మొదట నందఱును నీసొమ్మునకు లోపములేదనువారే! తరువాత నాలుక పెఱికుకొన్నను రాగికాసైన నిచ్చువుణ్యాత్ముఁ డెవ్వఁడును లేఁడు.

ఇందు—(నిమ్మళముగ) అదియేచతురతల్లి! దానితో ముందుగ మాటలాడుదము. నామాటయూనవా లెఱుఁగును. నీవుపిలువుము.

మై—దానిపేరేమి?

ఇం—వరదునకు, వేశ్యామాతకుఁ బేరేమి? వరదును "బావా" యని వేశ్యామాత "నత్తా" యని పిలుచుట లోకాచారమేకదా!

మై—అత్తా! అత్తా! ఇటురమ్మి.

(తెరలో) ఎవరాక్రొత్తయల్లుఁడు? ఎవరాక్రొత్తయల్లుఁడు?

ఇం—అదిగో! దురాశాపాతకపుముండ కఱ్ఱ చేతఁబుచ్చుకొని తిర్యఙ్ముఖియై వచ్చుచున్నది.

గీ. విటురవము చెవిఁబడగానె వేశ్యమాత
పాఱుకొనుచు విటుకడకు వచ్చు దీప
దీప్తి దనకంటఁ బడగానె దీపదాహ
ఖండమును జేయ నేఁకలిబండవలెను.

[వేశ్యామాత ప్రవేశించును.]

మై—అత్తా! ఈకఱ్ఱ నాచేతి కిచ్చి కూరుచుండుము.

వేశ్యమా—కూఁతుండఁగలిగిన నీఁకేమి?

ఇం—పాపము కీల్లువంగవు కాఁబోలును!

వేశ్య—చిన్నతనమునుండియు భయభక్తులు లేక స్వేచ్ఛగఁ దిరిగిన పిల్లలవలెనే నాయనా! కాని, ఇప్పుడున "న్నత్తా" యని పిలిచిన వారెవరు?

మై—అందుకు నాకంటె సమర్థుఁడు మఱెవ్వఁడు ?

వేశ్య—సమర్థత కెక్కడికి? అనేకరాజులు రోజునుఁ దిరుగుచున్నారు.

ఇం—పేకలోనిరాజులు చేతిలో రోజునుఁ దిరుగుచున్నారు-(హే హే. నవ్వుచున్నాఁడు.)

వేశ్య--ఇందుశర్మా! నీకిట్టిమిట్టిపాటెందునకు? నీదీప్తి చల్లారినదిగాదా? ఇఁక నీకును నాకును స్త్రీపురుషభేదము తప్ప మఱేమున్నది ?

మై--అత్తా! అతనితో నెందునకు? అతఁడు పరిహాసప్రియుఁడు. చూడు. చతుర నీకడుపునఁ బుట్టినదేనా?

ఇం—కడుపునఁ బుట్టక కుంతిసంతానమువలెఁ జెవినిఁ బుట్టిన దను కొంటివా ? హే హే (నవ్వుచున్నాఁడు.)

వేశ్య—దానిని నేను బెంచుకొంటిని.

మై—మఱింతమంచిది. అది పెద్దదై యెంతకాలమైనది ?

వేశ్య—ఏదీ! అమ్మవారికిఁ బోతును వేసినరోజుననే కాదా ? రెండు మాసములు కావచ్చినది.

ఇందు—అయిదుసంవత్సరములమీఁద.

వేశ్య—గడ్డితినుమాటలనాడకు.

ఇందు—వృషభజాతిపురుషుఁడనైన నేను దినిన తినియే యుందును.

మై—అత్తా ! కోపపడకుము.

వేశ్య—కాను—కసుఁగాయ యైనప్పుడు దానిని నామాట నేను జెప్ప

కొనఁగూడదు. కాని నాకు మొన్నటి కోతలకు ముప్పది యొక్కటి వెళ్ళినది.

ఇందు—కోతలకుఁగాదు—క్రిందటి గోవిందద్వాదశికి! హే హే.

(నవ్వుచున్నాఁడు.)

వేశ్య—సిగ్గులేని నైజముకలవానికి—

ఇందు—సిగ్గుగలిగినయెడల మీ రీవృత్తి చేయఁగలరా ? మే మీవీధికి రాఁగలమా ?

మై—అత్తా ! నీవతనిమాటలను బరిగణింపవలదు. మీ చతురకొలకు నేనిచ్చుటకి వచ్చితిని. కోరినంతధన మీయఁగలను. బ్రాహ్మణుఁడను. విద్వాంసుఁడను. నీవు నన్నల్లుఁడుగఁ జేసికొనక తప్పదు. ఇదిగో (చేతిలోనొక నాణెము నుంచును.)

వేశ్య—నాతండ్రి ! నాతండ్రీ ! బంగారపుదేశద !

ఇం—అదేమిటి ?

వేశ్య—మాడ.

ఇందు—నీ మొగము.

వేశ్య—ఎటులుతిట్టుచున్నాఁడో చూచితివా ?

[తెరలో]

నిన్నుఁదిట్టవలెనా ! తన్నవలెనా ! పనిలేనివారితో నీకుఁబ్రసంగమేల ? ఛీ ! ఎన్నియేండ్లువచ్చినను—

వేశ్య—అమ్మాయి వచ్చినది. నేను బోవలెను (పోవుచున్నది.)

మై—(చేతినిబట్టుకొని) అత్తా ! నే నిక్కడనుండనా ?

వేశ్య—ఉండుము. దానిని బుజ్జగించి దీసికొనివత్తును.

(వేశ్యామాత పోవుచున్నది.)

ఇందు—ఈముసలికి తాఁ జేలువలె క్రిందిదెప్పయే లేదేమి ?

మై--తాఁబేటికిఁ బైడిప్పయుండదు. దీనికిఁ బైడిప్పలు వ్రాలుటచేత నటు లున్నది. కాని దీనిమొగము మొసలిమొగమువలెనున్న దిసుమా !

ఇందు--మొగమేకాదు. అంతఃకరణముకూడ నట్టిదే !

మై--చతుర సౌందర్యవతి కాఁబోలును.

ఇందు--ఆహా ! దానిని జూచితీరవలెను.

సీ. విరిసినజీరాడి పిఱుఁదుల దిగజాఱు
తలకట్టుగలసూక్ష్మతమవలగ్న
ఒడలికిమించినయొఱపైనహాంగని
యనిపించుగుబ్బల నెనయుకాంత
పక్కన నవ్వినఁ జెక్కులపైఁ జిన్న
గుంటలుగలవాలుగంటిమిన్న
తోలుకారుమెఱుపుతోఁ దులఁదూగురంగున
రమణీయ యైనట్టి కమలనేత్రి

ఆ. వె. పొడవుగాదు మఱియుఁ బొట్టియునుంగాదు
మట్టసంపురూపు మధురవాణి
దానిఁబోనిసానిదాని యౌనవుఁ బోని
సానివీథిలోన నేనుఁ గాన.

మై--చూచి యానందింపవచ్చును.

[తెరలో]

ఇందుశర్మా ! ఇందుశర్మా ! చతుర యిచ్చట నున్నది. నీమిత్రుని దీసికొని యిటురమ్ము.

ఇందు--వేశ్యామాత పిలుచుచున్నది. పోవుదము. (ఉభయులు పరిక్రమించి వెనుకఁదెరయెత్తఁగ గదిలోనుండి వచ్చు చతురను జూచుచున్నారు.)

మై--(అపవారించి) ఆహా ! మిత్రమా ! చూడుము.

ఆ. రంగుఅవిక వింతరంగుచీరధరించి
కళుకుబెళుకుకనులకులుకులాడి
గదిని బాసి వచ్చెఁగా పట్టుకొాయనుఁ
దొలఁగివచ్చునాకుచిలుకవలెను.

ఇం--(అపవారించి) మొదటఁ బ్రవేశించినప్పు డితఁ గొంగళిపురుగే. యౌవనమాహాత్మ్యముచేత నలుపువదలి చామనచాయ, చామనచాయవదలి బంగారురంగును దానికివలెనే కాలక్రమముగ వచ్చినవి. (ప్రకాశముగా)
చతురా !

ఆ. తలచు వేశవీథిఁ దిరిగెడువాఁడు స్త్రీ
ప్రియుఁడగుట బ్రొక్క కాదునాకు
మ్రొక్కవలె నితనికి క్రొత్తవాఁడను వర్ధ
మానుఁ డగుట బాలభానునటులు.

చతు--(మైత్రేయునికి)
అయ్యా బ్రాహ్మణోత్తమా ! నమస్కారము.

మై--కళ్యాణమస్తు.

చతు--ఇందుశర్మా ! నీవు స్త్రీప్రియుఁడవని చెప్పుచున్నావు. పురుషునికి రెండుచేతులు జోడించి నమస్కరింపవలెను. స్త్రీపురుషమధ్యావస్థాగతుఁడవైన నీకొక్క చేతితో నిటుల నమస్కరింపవలెను.

(ఇందుశర్మయొక్క చెంపపై మెల్లగఁ గొట్టును.)

ఇందు--అదృష్టవంతునకు స్త్రీస్పర్శసుఖము పరిహాసముననో యనురాగమువలననో కోపమువలననో కలుగుచునే యుండును.

మై--(తెరలో) ఆహా ! ఏమి యీ వారకాంతయొక్క విలాసము !

ఆ. కంకణములు మ్రోయఁ గర్ణపుష్పము లూఁగ
దండకట్టువంకి తాఁకునఁ గుడి
కుచ మిటూత్రిగిల్లఁ గొలఁదిచపేటం బొ
సంగుకేళికనులఁ జల్లఁబఱచె.

మిత్రమా !

గీ. నెలఁత మృదులాంగుళుల మీఁట నీకు జెంప
సంపదాలీఢ మయ్యె శుష్కస్వరూప
కఠినకర్ణరుద్రాక్షసంక్రాంత మైన
యీదవుడకట్టి సాఫల్య మెన్నఁ దగునొ !

ఇందు--చతురా !

తే. బ్రాహ్మణుని నిన్నుఁ గోరిన పండితేంద్రు
నమితధనవంతుని తని నతులితోరు
లలితలావణ్యలీలాకలాపవతికి
నీకుఁ బలిగాఁగఁ దెచ్చితి నీరజాక్షి !

చతు- ఆహా ! ఇందుశర్మా ! పుణ్యాత్ముఁడవు ! స్వప్రయోజన ధురంధరవ్యాపారము నవస్థాభేదముచే వదలి పరోపకారపరాయణత నవలంబించితివా ?

మై—గీ. సౌమ్యవాక్యవిజృంభణ సరసమైన
నాదునాలుక శక్తిహీనతను బొందె
మొదట నినుఁ జూడ సర్వసంపూర్ణదర్శ
నాఢ్యమౌ కన్ను మెఱుపుచే నైనయటులె.

గీ. ఇతఁడు నామిత్రి మగుటచే నింతవఱకు
నాహృదయసముద్ధతిఁ దెల్పె నాతి నీను

చన్నుఁగవయుబ్బుసంపర్క-జన్యమైతి౯
గంచుకముచాట నేరంబుగలదె? వెలఁది!

చతు-(అవిక వైపునఁజూచుకొని పైటఁబాగుగ సవరించుకొనుచున్నది.)

మై—గీ. పైఁటసవరించితివైన నీపండితుండు
పడఁతి నీదాస్యమును జేయఁ బనికిరాఁడె?
కాంత! సర్వశాస్త్రాంచల గ్రాహినైన
యేను చేలాంచలమెకొన నెటులుతగనొ.

[సమీపించుచున్నాఁడు.]

చతు—(కొంచెము దూరముగఁ బోవుచున్నది.)

ఇం—(తనలో) వేషము వెఱ్ఱిదిగ నున్నదికాని గండ్రిముండకోడు కే.

చతు—(నవ్వుచు) బ్రాహ్మణవర్యా! ఏమియీయసందర్భము. తలపై
రాంకవమేమి? చెవులనుగుండలములేమి? మెడస్ఫటికమాల
లేమి? దేహమున విభూతిరేఖలేమి? రసనను వేదాధ్యయన
మేమి? వేశ్యపై వలపేమి? వెఱ్ఱిఁబడి వెంబడించుటయేమి?విప
రీతవిద్వద్విటాగ్రేసరుఁడవు!

ఇం—(అపవారించి) ఊదరఁగొట్టిన యరఁటికాయవలె మెత్తఁబడుచు
చున్నది. వదలకు—

మై—గీ. వేషభాషలచేతనే వెలయు యశము,
మనసుఁ గన నెవ్వనికినైనఁ గనులులేవు,
బాహ్యరచనలచే దానిఁ బరిగణింత్రు
కాన శ్రోత్రియవేషంబుఁ బూనినాఁడ.

అయిన

సీ. బంగారుజలతారు రంగుచీరలనీయఁ
గలనంచు నత్తిరాంకవము దెలుపు

పలుదుమంజిముత్యాల సరము లీఁగలనని
ప్రకటితస్ఫటికమాలికలు దెలుపు
నెప్పుడు నవరత్న హేమవార్తలఁ జెవి
లాలింతు నని కుండలములు దెలుపు
ఘనసారఘనసారకలితచందనచర్చ
సేవింతు నని భూతిసేవ దెలుపు
గీ. నధరమాధుర్యమును గ్రోలునపుడు మిగుల
పెంచ్చరికఁ జేయఁగల నని యుద్ధశాస్త్ర
చయసమధ్యయనగతరసనయు దెలుపు
శ్రోత్రియస్వరూపము వేశ్యశోభకొఱకె.

చతు—ద్విజోత్తమా! మీ రెక్కడనుండి దయచేసితిరి?

మై—నీవు నా యోగక్షేమమం దాసక్తిగలదానివై యడిగితివి కావునఁ జెప్పెదను. (కొన్ని యడుగులు వేసి సమీపించి) అక్కడనుండి యిక్కడను దయచేసితిని.

చతు—(నవ్వుచు, తలవంచుకొనుచున్నది.)

మై—ఆ. మోమునందు ముందు ముసిముసినగవు ద్భ
వింప శిరమువంచు వింతసొబగు
కనులపండు వయ్యెఁగా మొగ్గగుత్తి ఘు
ప్పతిల వంగుజాతిలతికవోలె.

నేను మళయాళదేశబ్రాహ్మణుఁడను. ఈగ్రామమునకు వచ్చి రెండుగడియలైనది. నాకు మొదటినిమిత్త మిందుశర్మ. నీవు ద్వితీయవు! ఈతనియింటనే యునికి.

చతు—ఇందుశర్మా! నీకిల్లుకూడ నున్నదా?

ఇం—ఈతఁడు వేయివరాలనిచ్చి తాకట్టునువిడుదలఁ జేసెదనని చెప్పినాఁడు.

చతు-(తనలో) ఆకస్మికమిత్రుఁ డగుపీనికే వేయివరహాల నీఁదలంచిన యీవదాన్యుఁడు నాకేమియిచ్చునో! భట్టనాథుఁడు నాకుఁ జెప్పినప్రశ్నము ఫలించునుగాఁబోలు! (ప్రకాశముగా) మీ కభిమానశాస్త్ర మేది?

ఇం——కొక్కోకము.

మై——మంత్రిశాస్త్రము.

ఇం——ఇంతవఱకీతఁడు మాత్రశాస్త్రపండితుఁడు. నీవలన సానిశాస్త్ర మునందు విద్వాంసుఁ డగును. రెండునుగలసి మంత్రిసాని శాస్త్రపాండిత్యముగఁ బరిణమించి యీతఁడు మీయమ్మనుఁ బోలియుండును.

[తెరలో.]

అమ్మాయీ! రమ్మ! మాటలవారేకాని మూటలవారుకారు.

చతు——అమ్మా. ఇప్పుడే వచ్చెదను.

మై——(అపవారించి) ఇందుశర్మా! ఈవరహాను దీసికొనివెళ్లి దాని గొంతుక కడ్డముగఁ బడవేయుము.

ఇందు——(అపవారించి) నాకుఁ గూడ నేమైన నిచ్చినయెడల ఱెక్కలు వచ్చిన నుసిపురుగువలె నేదీపికనో చేరి తిరిగివత్తును.

మై——(అపవారించి) ఇదిగో! నీవు దీనినిఁ దీసికొనుము.

(ప్రకాశముగా) ఇందుశర్మా! రాత్రిభోజనమునకుఁ బ్రయత్నము చేయవలెనుకాదా!

ఇం——ఔను. నేను బోయెదను. చతురా! దయ యుంచుము.

(ఇందుశర్మ పోవుచున్నాఁడు.)

చతు——మీరీగ్రామమున కేలవచ్చితిరి ?

మై——సర్వతీర్థములను జూచి తుదకుఁ గాశిలో యజ్ఞముసేయనెంచి--

చతు-(కోపముతో) నేఁడో రేపో పోవువారికీకాలిసం కెలయెందునకు ?

మై—గీ. నరుఁడు రంభాపరిరంభణప్రియాశ
యాగకార్యం బొనర్చెడు నట్టిఫలమె
యిచట నాకు లభింపఁగ నింకయాగ
మేల? బాలమృగవిశాలలోలనేత్రి!

(కౌఁగిలించుచున్నాఁడు.)

చతు—ఇందుశర్మమాటలు తలఁచుకొన్న నాకు నవ్వువచ్చుచున్నది.

మై—ఏమనెను?

చతు—యజ్ఞము చేసెద నని నీవనఁగ జ్ఞప్తికివచ్చినది.

మై—నాయజ్ఞసంభాషణ మతనిమాటలనేమి జ్ఞప్తికిఁదెచ్చెను?

చతు—మతేమియు లేదు. తానుగూడ నొకయజ్ఞమును జేయవలెనని యున్నదనియును నన్ను సోమిదమ్మఁగఁ జేసికొందుననియు వేశ్యామాతలను యజ్ఞపశువులుగఁ జేసెదనియును నాతోఁ జెప్పినాఁడు.

మై—అతఁడు కొంటె. పరిహాసప్రియుఁడు.

చతు—ఏమైననేమి? చెడిపోయినాఁడు. నిక్షేపమువంటి చాణక్యుని సొమ్మంతయుఁ దగులఁబెట్టినాఁడు.

మై—చాణక్యుఁ డన జ్ఞప్తికివచ్చినది. అతనికిని మురకును సంబంధమాకి?

చతు—పాపము. మురబుద్ధిమంతురాలు. చాణక్యుఁడు నిర్దోషుఁడు. చంద్రగుప్తునికిఁ బట్టాభిషేక మగునని యెవఁడో చెప్పఁగ నసూయచేత నిట్టితంత్రము మాదేవి రాక్షసుని సాహాయ్యము చే పన్ని వారలను నాశనముచేయించెను. మొదట నీయంత్రము నాకుఁ దెలియనిచ్చినదికాదు. తరువాతఁ దానే చెప్పెను.

మై—(తనలో) ఎట్టిరహస్యము నిట్టె ముక్కు మొగ మెఱుఁగని నాతో నీవేశ్య చెప్పుచున్నది. (ప్రకాశముగా) చాణక్యుఁడు చంపఁబడెనుగాఁబోలు!

చతు--చాణక్యుఁడును, నందుఁడును నందహితుఁ డైనపాంచాలాధిపతిచేఁ జంపఁబడిరి.

మై--హరి హరీ! రాక్షసుఁ డెటు లున్నాఁడు?

చతు--నిరంకుశాధికారియై యున్నాఁడు. రాజబాలురకు సంరక్షకురాలై సునందయే రాజ్యమును బరిపాలించుచున్నది. యుద్ధమందుఁ బాంచాలాధిపతి కపజయము కలుగు ననియు నాతనిరాజ్యముగూడ మగధరాజ్యమునఁ గలియు ననియు రాక్షసుఁడు చెప్పుటచేత మాదేవికిఁ బట్టఁజాలని సంతోషముగ నున్నది.

మై--పాంచాలాధిపతికి నందుఁడు మిత్రుఁడనిఁ చెప్పితివే? అట్టి మిత్రు నాతఁడేలఁ జంపెను?

చతు--ఆప్రశ్నము మాదేవిగారు రాక్షసు నడుగఁగ నాతఁడిట్లు చెప్పెను.

మై--ఎట్లు?

చతు--పాంచాలాధిపతి మురనుజూచి మోహించి దాని నుంచుకొనె ననియు, దానిప్రోత్సాహముచేతనే నందునిఁ జంపె ననియు రాక్షసుఁడు చెప్పినాఁడు.

మై--(తనలో) హరి హరీ! ఈమరవగాహమైన సందేహమును భేదించుటకు రాక్షసుఁ డీకల్పనము చేసినాఁడు.

(ప్రకాశముగా)ఏకకాంతాపేక్షవలన మిత్రుల కెట్టియుపద్రవము లున్నవో చూచితివా?

చతు--ఆఁడుది బుద్ధికలిగియున్నఁ బ్రమాదమేమి?

మై--నిజమే. కాని కనకాభిషేకము చేసిన ట్లుండుటమాత్రము కల్ల.

చతు--ఇందుశర్మయింటిలోనేల? మనయింటనే నీవు నీసామ్ము మొదలగునవి యుంచుకొనవచ్చును.

మై--(తనలో)యీ వర్ధనమును దూరముగ నొకచోటఁ బాఁతిపెట్టితిని.

(ప్రకాశముగా)అలాగుననే. అయిన నిప్పుడు నాకుసొమ్మెందుకు?

చతు--(తొట్రుపాటుతో)అట్లైన నింబశర్మయింటికొక కంతసొమ్మెట్టు లీయఁగలవు?

మై—మనయిష్టానుసారముగఁ గావలసినంత సొమ్మును మనము చేసి కొనవచ్చును.

చతు—నాకు నీమాటలు తెలియలేదు.

మై—అయ్యో! వెఱ్ఱిదానా! రసవాదశాస్త్ర మని వినియుండలేదా? రాగిని బంగారమును జేయఁగల సామర్థ్యము నాయొద్దనున్నది.

చతు—ఆ ఆ! నిజముగానే? నిజముగానే?

మై—సందేహ మేమి?

చతు—అట్లైన మనయిల్లంత బంగారమగునా?

మై—భగవదనుగ్రహముండినఁ గాదువ యేమి?

చతు—అట్టియనుగ్రహముండుట చేతనే నీపాదసేవ నాకులభించినది. మాయమ్మాయి కెట్టిమగఁడువచ్చునో యని మాయమ్మ పల వించినందునకు—

[తెరలో]

అమ్మాయీ! ఇఁక భోజనమక్కఱలేదా? మగనిఁజూచుకొనఁ గనే కడుపునిండినదా?

మై-చతురా. నీవుపొమ్ము.నేనుగూడఁబోయి శీఘ్రముగ భుజించివత్తును.

చతు—తిరిగి శీఘ్రముగ వచ్చెదవా?

మై--రాకపోదునా?

చతు—ఎంతశీఘ్రముగ వచ్చెదవు?

మై—(ముద్దుపెట్టుకొని) ఇంత శీఘ్రముగ వచ్చెదను.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# ప్రచండచాణక్యము.

పంచమాంకము.

పాటలీపురమువీథి.

[ఇందుశర్మ, మైత్రేయుఁడు ప్రవేశించుచున్నారు]

మై—మనయిద్దఱియొక్కయసత్యకలహము చతుర నిజమని గ్రహించి నట్లేకద!

ఇం-సందేహమేమి? ఇంకను దానితో మఱికొన్ని సంగతులు చెప్పినాను.

మై—ఇప్పుడు చతుర యింటియొద్దలేదేమి?

ఇం—కోటలోనికివెళ్లినది. సునందతో నీసరికి మాటలాడుచుండును? ఈరాత్రి బహుశః కోటనుండి మనకు వార్త రావచ్చును.

మై—ఇఁక మనము తగుప్రయత్నములలో నుండవలెనుకాదా?

ఇం—సందేహమేమి? రమ్ము. పోదము.

(నిష్క్రమించుచున్నారు.)

(ఇది విష్కంభము.)

---

పాటలీపురము--అంతఃపురము.

చతు--భగవంతుఁ డనుకూలుఁడు కానియెడల నెవ రేమిచేయఁగలరు?

సునం-నట్టడవిని బలవన్మరణమునొందినభర్తకై యొకమూలగూర్చుండి యేడ్చుటకైన నవకాశము లేకుండ రాజ్యతంత్రనిర్వాహణము కూడ నెత్తిపైఁ బడినది. ఏమిచేయుదును?

చతు—మీకుఁ దెలియనిదేమున్నది? ప్రపంచస్వభావమును మీ రెఱుఁగరా? ఒకచెంపఁగస్తీరు. ఒకచెంపఁబస్తీరు. ఒకచెవి నసమసంగీతము. ఒకచెవి నశనిపాతము. ఒకకంటనిప్పుఅవ్వ.ఒకకంటఁగప్పురఁపురవ్వ. ఒకచేత నువ్వులు. ఒకచేతఁబువ్వులు.

సునం—క్రొత్తక్రొత్తమాటలు నేర్చుకొంటివి. ఎవరుచెప్పిరి?

చతు—నేను బైవారికిఁ బోకుండ నాభర్త నాకు వేదాంతమును జెప్పచున్నాఁడు.

సునం—కృష్ణపక్షమున నాకాశవీథిని దినదినాభివృద్ధిగ నక్షత్రసంఖ్య గానఁబడినట్లు నీదేహమున రోజునకురోజు నూతనాభరణచయము కన్పట్టు చున్నది. ఈనగలన్నియు నాతఁడిచ్చినవేనా?

చతు—మల్లికకుఁ బ్రసూనకలికాచయము వసంతుఁడుకాక మఱియెవ్వఁడీయఁగలఁడు?

సునం—ఆతఁడు విశేషసుందరుఁడా యేమి?

చతు—అచ్ఛశరత్కాలమేఘము వర్షించునా?

సునం—ఆ! ఈమధ్యమున నిన్ను మోసపుచ్చిన సుందరునివలెనే యందఱుందురా? ఈఁతడునల్లగనుండు నేమి? నల్లనిబ్రాహ్మణుని నమ్మఁగూడదుసుమా!

చతు—అల్లోనేరేడుపండులోనేకదా విశేషరాగరసముండును.

సునం—వేశ్యయెడల విశేషానురాగముకలవాఁడు శుంఠసుమా!

చతు—పండితు లతనియొద్ద శుంఠలు.

సునం—శుంఠలయొద్దనే పండితుఁడా? అయిన నతఁ డేశాస్త్రమునఁబండితుఁడు?

చతు—మంత్రశాస్త్రమున నఖండపండితుఁడు.

సునం—మనకోటలోనికి నతఁ డెప్పుడు వచ్చినట్లు వినియుండలేదు. అతఁడే

ద్రాకరిధనము నపేక్షింపనంతటిధనాధికుండా?

చతు—వ్యసనాయిగడ్డికి యాచించునా?

సునం—బంగారమును బండించునా?

చతు—ఆ!

సునం—ఎటులు?

చతు—రసవాదశాస్త్రపాండిత్యముచేత.

సునం—బంగారమును చేయుచుండఁగ నీవుచూచితివా?

చతు—అనేకపర్యాయములు. ఈవిద్యనుజాణక్యుని మేనల్లుఁడైనయిందు శర్మకుఁగూడఁ నాతఁ డుపదేశించిన ట్లున్నది. కొలఁదికాలము క్రిందట నశనశూన్యత్వ మనుభవించినయాతఁడు తిరిగి శుక్ల పక్షమధుకోశమువలె పూర్ణుఁ డగుచున్నాఁడు.

సునం—నీవుకూడ నేర్చుకొనలేదేమి?

చతు—స్త్రీలయంతఃకరణము జల్లెడవంటి దని చెప్పినాఁడు.

సునం—రహస్యము లోపల నిలువఁబడదనియా! అల్పమైనవిజారిపోవును గాని గొప్పవి నిలుచునని చెప్పలేకపోతివా!

చతు—నిలిచినవేవో యవి పరిత్యజింపఁదగినవేయని యాతఁడనెను.

సునం—నీకేమైన మంత్రములైనఁ జెప్పెనా?

చతు—జ్యాలతలేనివింటిని బాణసంధానమెటులో యజ్ఞోపవీతలతారహితులకు మంత్రోపదేశ మట్టిదఁట!

సునం—జ్యాలత లేనివి ల్లుండునా?

చతు—కావటిబద్ద. అది భారవహనోపయోగమే.

సునం—ఛీ! ఛీ! బ్రాహ్మణజాతికి సమబుద్ధి కలికములోనికైన లేదుగదా! చతురా! విద్వాంసునితో స్నేహము వృత్తిచ్ఛేదకమైన వేదాంతమునకుఁదప్ప మఱియొందున కుపయోగించినదికాదా?

చతు--అబ్రాహ్మణుఁడు నేర్చుకొనఁదగినది యొక్కటి యున్నదనియును దానిని నా కుపదేశించెద ననియును నాతఁడు వాగ్దానము చేసినాఁడు.

సునం--అది యేది?

చతు--ఎంతకాలముక్రిందట మరణించిన వారినైన నాతఁడు కనఁబఱుపఁ గలఁడు. అట్టియద్భుతవిద్య యాతనియొద్ద నున్నది; దానిని——

సునం——అతఁ డట్లు చేయఁగ నీవు చూచితివా?

చతు—ఆ! చూచినట్లే.

సునం—అనఁగా?

చతు--నేను జూడలేదు. కాని యిందుశర్మ చూచి నాతోఁ జెప్పినాఁడు.

సునం——ఎవరిని?

చతు--ఈనడుమ క్షయరోగముచే మరణించిన యాతనిప్రియురాలగు శశిరేఖను.

సునం--నిశ్చయముగఁ జూచి చెప్పినాఁడా?

చతు--ప్రత్యక్షముగ.

సునం--అతనిమాటలు విశ్వసింపవచ్చునా?

చతు--ఆతఁడు విశ్వసింపఁదగినవాఁడు కాఁడు. కాని, యిప్పటియవస్థచే నాతనిని నమ్మవచ్చును.

సున--ఎట్టులు?

చతు--ఆతనికిని నాభర్తకును మనస్పర్థలారంభమై యొకమాసము కావచ్చినది. ఇప్పటికిని పైకి హితులుగనే యున్నారు. అంతః కాలుష్యములు మాత్రమున్నవి. ఒకరోజున ప్రసంగవశముచే నాభర్త లేనిసమయమున నిందుశర్మ నాతో నిట్లనెను. “బంగారమును జేయువారు లోకమం దనేకసిద్ధు లున్నారు. మంత్ర

శాస్త్రప్రవీణు లనేకు లున్నారు. కాని ప్రకృతస్వభావములను గనఁబఱచుటయందు మైత్రేయునికిఁ గలయప్రతిహత ప్రభావ మద్వితీయము. క్రిందటి నెలఁ బరలోకగతిని జెందిన శశిరేఖను నాకుఁ గనఁబఱచినాఁడు. ప్రత్యక్షముగఁ జూచినాఁడను. ఒడలు జల్లుమనిపోయినది. ఆహా! అతఁడు దైవసముఁడు." అనెను.

సునం—ఈమాట లాతఁడు నీతోడ ననుసరికి వారికిఁ గలహావారంభ మయ్యెనా?

చతు—ఆరంభమై నెలయైనది. ఈసంగతి నిన్నగాక మొన్ననే నాతోడ నాతఁడు చెప్పినాఁడు.

సునం—(ఆలోచించి) యథార్థమై యుండవచ్చును. కాకుండిన మొదల నేమగఁడు సమీపమున లేనిసమయమున నిందుశర్మ యాతని నేలపొగడియుండును?

చతు—అదిగాక యెవనిపైసంతాపమున్నదో యాతనినే యేలపొగడి యుండవలెను?

సునం—ఒకవేళ నీ వేమనుకొందువో యని నీభర్తనుస్తుతించియుండునా?

చతు—అది యెంతమాత్రమును గాదు. దోషసహితుఁ డగునెంతవానినైన నెదుటనే దూషించు నిర్భయస్వభావముగలవాఁడెవ్వఁడు పరగుణమును బరోక్షమందే స్తుతించును. సాన్నిధ్యమందొకనిని స్తవముచేయువాఁడు పరోక్షమందు వానిని దూషించు స్వభావము గలవాఁడై యుండును.

సునం—కావున నిందుశర్మయొక్క మాటలను నమ్మక పోవుటకుఁ గారణమగపడకున్నది. చతురా! ఏవిధముగఁ గనఁబఱచినాఁడో యిందుశర్మనడిగి తెలిసికొంటివా?

చతు—ఒకపెట్టెయున్నదఁట! అఁట యననేల? నేనును జూచినాను,

ఆపెట్టెలో రెండుపెద్దయద్దము లున్నవి. ఆపెట్టెను మనయెదుటఁ బెట్టి మనము చూడఁదలఁచుకొనిన మృతస్వరూపము నాతఁడు ప్రత్యక్షము సేయునఁట !

సునం—చూడు ! ఇది చిత్రమైన మోసమనుకొందును. ఆపెట్టెలో పలనున్న యద్దములలో దీపములచాటునఁ బ్రతిఫలించిన మన స్వరూపమును మనమే చూచుకొని మృతస్వరూప మనుకొందుమేమో ! అదికాక తదేకనిష్ఠగ మనమేవస్తువునైనఁ జూడఁదలఁచుకొన్న యెడల నది మనకంటఁబడును. మనస్సున కట్టి శక్తి యున్నదని చెప్పుదురు. అదిగాక యిది కనుకట్టుకావచ్చును. లేదా యంజనమువంటిమోసము గావచ్చును.

చతు—అట్లు కాదు. అట్టిస్వరూపము మనలను జూచి నవ్వుటయు, సంజ్ఞలు సేయుటయు, మాటలాడుటయు గూడఁ గలిగియుండునని, యిందుశర్మ నాతోఁ జెప్పినాఁడు.

సునం—అట్లైన నత్యాశ్చర్యకరము. ఆతఁడు భూలోకనలినసంభవుఁడని చెప్పవచ్చును. మనమడిగిన ప్రశ్నముల కుత్తరములు చెప్పునేమి ? అమితాద్భుతము ! చతురా ! ప్రియవిశ్లేషదుఃఖితులకిది యమితాశ్వాసనసాధనము సుమా !

చతు—విగతజీవులకుఁ దాత్కాలికసంజీవినీలత యగునీవిద్య తద్బంధువులకు హృదయతాపనివారణచణసుధాధార కాదా ?

సునం—నాకా బ్రాహ్మణునిఁ జూడవలెనని యున్నది.

చతు—ఆతఁడు మరణించిన తరువాతనా ?

సునం—చతురా ! పరిహాసము కాదు. నా ప్రాణనాథునిపునర్దర్శనము నాకు లభింపఁజేయఁగల యీ బ్రాహ్మణు నిప్పుడే చూడఁ గోరుచున్నాను. ఆచక్రవర్తిదర్శనము నాకు దుఃఖనివారక

మగుటయే కాక యీమహానుభావుని జూచుటవలన నాకుఁ
శాపనివారణముకూడ నగును. ఉభయతారక మగునీపని నేల
చేయఁగూడదు ? అతఁ డిక్కడికి వచ్చునా ?

చతు—మహారాజ్ఞిగారిసెల వైన రాకుండునా ? ఆయంశమునుగుఱించి
నాకు సందేహము లేదు. కాని—

సునం—మఱిదేనినిగుఱించి ?

చతు—రాక్షసున కీసంగతిని దెలుపుటను గుఱించి.

సునం—అతనితో నేల చెప్పవలెను ? రాజకార్యములయందాతని
యాలోచనముగాని యిట్టికుటుంబవిషయములలో—

చతు—మంత్రియాలోచన మనవసర మనియే నాకును దోఁచుచు
న్నది.

సునం—అదికాక యాతనితో నీసంగతి చెప్పిన నంగీకరింపఁడు.

చతు—అంగీకరించుట కతని కేమియవశ్యము ? నందరాజేంద్రునిఁ
జూడవలెనని యాందోళన మాతనికుండునా ?

సునం—ఉన్నదనియే యెంచుము. ఈబ్రాహ్మణుఁ డెవఁడో మోసగాఁ
డని పెదవి విఱిచి మనయత్నమును నిష్ఫలముచేయఁ గలఁడు.
అతనితల యెంత పెద్దదో గుండెకూడ నంతపెద్దది. ఆతఁడు
చాణక్యునితో సమమైనబుద్ధికలవాఁడే కాని, చాణక్యుని
సాహసము, శౌర్యము, క్రౌర్యము నీతనియొద్ద లేవు. నాకా
శ్చర్యమైనది. చాణక్యుఁడు చచ్చిన ట్లిప్పటికి నాతనికి సంపూ
ర్ణమైననమ్మకము లేదని యాతఁడు నిన్ననే నాతోఁ జెప్పినాఁడు.

చతు—మామిడిపండునకు జీడివలె మహాబుద్ధిమంతునకొక వెఱ్ఱి యుం
కతప్పదు.

సునం—ఇదివఱకు వేలకొలఁది చారులను బా. చాలవేశమునకుఁ బంపి

నాఁడు. చాణక్యునిజాడ లేశమైన లేదని యందఱునైకంఠ్య ముగఁ బలికిరి. కాని, యింకను చాణక్యుఁడు జీవించియుండు నేమోయని సందేహపడుచున్నాఁడు. మనసేనలు యాదవసైన్యమునుమార్కొని రెండు స్థలములందు జయించెననియు నందవధకార్యమున యాదవసేనుఁడు చేసినద్రోహమున కాతని సేనాధిపతులందఱు నాతని నొల్లక మనలనుఁ గలిసిరనియు నమితోత్సాహమునఁ జెప్పుచు నింతలోఁ జాణక్యుడు జీవించి యుండునేమో యనునను మానము మనసునకుఁదగుల మాంస ముచేఁ గ్రుచ్చఁబడినగాలమును మ్రింగినచేఁపవలె బాధ నొందెను.

చతు—ఇంత యనుమానము గలవాఁడు మనమిూయింద్రజాలముఁజూడ నొప్పుకొనునా?

సునం——ఒప్పుకొనఁడు. ఆతనితోఁ జెప్పనేల? ఆతఁడు వలదననేల? ఆతనిమాట మనము వ్యతిరేకింపనేల? అందుపై నాతఁడిబ్బంది పడనేల? ఎందునకీయనవసరమైనక్షోభము? నీవువెళ్లి నీపతిని దీసికొనివచ్చెదవా?

చతు——అభ్యంతరమేమి? (పోఁబోవుచున్నది)

సునం——చతురా! ఆఁగు. మన మొకసంగతి యాలోచించుకొనవలసి యున్నది.

చతు——సెలవీయవలెను.

సునం--ఒకవేళ యీబ్రాహ్మణుఁడు మోసకాఁడైనయెడల మన కేమీ నష్టమున్నది?

చతు--మనరాజేంద్రునిఁ జూపించినయెడల మనకు సంతోషమే, లేదా, నడునడు బాపనయ్యాయని యవతలకు సాగనంపివేయుదము.

ఇంతేకాని నష్టము మన కేమి యుపద్రవ మున్నది.

సునం--అవును; నీవు పోయి అతనిని దీసికొనిరమ్ము. అతఁడొక్కఁడే రావలె సుజుమా!

చతు--చిత్తము. (పోవుచున్నది.)

సునం--పెద్దలతోఁగలసిన నందరాజవంశని నేనీరాత్రి సపుత్రకముగ దర్శింపఁగలను.

చతు--(ప్రవేశించి) ఆతఁ డొక్కఁడును రాలేననుచున్నాఁడు.

సునం--ఎందుచేత?

చతు--వేసవికాలపుగొల్ల భామపురుగువలె నున్నయాతఁడు--

సునం--పొడుగుకాళ్లచే మఱింతశీఘ్రముగ రావచ్చునే.

చతు--బరువైనపెట్టెను వీఁపుపైన మోసికొనిరాలేనని మనవిచేసికొను చున్నాఁడు.

సునం--అట్లైన నత్తగుల్లవలె మెల్లగరమ్మని చెప్పుము.

చతు--తమకంగీకారమైనయెడల శిష్యునిచేఁ బెట్టెను——

సునం--శిష్యుఁ డిందుశర్మకాఁడా?

చతు--ఔను. అతఁడు కోటలోనికి వచ్చువాఁడే!

సునం--సరే. పోయి శీఘ్రముగ రమ్మని చెప్పుము.

(చతురపోవుచున్నది.)

సునం--విశ్వాసఘాతుకుఁడును మిత్రద్రోహియు నగు యాదవసేనుఁడు యుద్ధమందు మాచే జయింపఁబడుఁగాఁక! మగధరాజ్యాధీశుఁడు పాంచాలరాజ్యలక్ష్మిని నూతనవధువుగఁ జేసికొనుఁగాత! నంద ఖండనపాపభూయిష్ఠుఁ డగుపాంచాలాధిపతిసతి నూతనవిధవగఁ జేయఁబడునుగాఁక! నాప్రథమపుత్రుఁ డగు కృష్ణనందుఁడు సపాంచాలకమగధరాజ్యమున శీఘ్రకాలములోఁ బట్టాభిషిక్తుఁ

డగుచు నష్టైశ్వర్యములతో నష్టసోదరులతో నిశ్చలస్వాస్థ్యము
నుభవించునుగాత!

[తెరలో]

ఓసీ! నీయిల్లు వల్లకాడుకాను. అమ్మా! అమ్మా! బావురు
పిల్లియొకటిచిలుకలయొక్క పెద్దపంజరమునఁదూఱి యన్నిచిలుకల
గొంతుకలను గొఱికివైచినది.

సునం—అయ్యయ్యో! శుభమునుకల్పించుకొనఁగ నశుభవాక్యములు
వచ్చినవి. కైశికీ! చిలుకల నన్నిటినిఁ జంపినపిల్లి యిప్పు డెక్కడ
నున్నది?

[తెరలో]

పంజరమున నుండుమధ్యపీఠమునఁ గూరుచున్నది.

సునం--ఆహా! తుచ్ఛుఁడైనచంద్రగుప్తుఁడు నిటులె నందవంశనాశనా
నంతరమునఁ దక్షకవంశరాజ్యసింహాసనముపైఁ గూర్చుండఁ
దలఁచుకొనినాఁడుకదా! బాలిశాధముఁడు. చాణక్యవధచే
నిప్పటి కాయుపద్రవము దాఁటినదికదా!

[తెరలో]

దాఁటలేదు. దాఁటలేదు.

సునం—ఆ. ఆ. ఆ! ఇదియేమి? హా! చంద్రగుప్తుఁడు చచ్చెననియమృ
తోపమానవాక్యములు నాచెవిని బడవయ్యెనుగదా!

[తెరలో]

పడుటమాట యబద్ధము. ఈమాత్రపుబరువున కేపడెదనా?
ఇంక నొకద్వారముదాఁటినఁగాని యంతఃపురములోనికిఁ బ్రవే
శింపమా యేమి?

సునః—"కడపటిద్వారము దాఁటితినా?" యని పేటికాభారవహాన

క్లిష్టుఁడైనయిందుశర్మ యనుగ దాఁటలేదు దాఁటలేదని చతుర ప్రత్యుత్తర మిచ్చుచున్నదేకాని భయకారణ మేమియు లేదు. అవయవమునఁ గురుపు వేయ నది మాటిమాటికి రేఁగినట్లు మన సునఁగలుగు బాధ ప్రతిస్వల్పాంశముచేతను వృద్ధియగును.

[ తెరలో ]

అమ్మా! రావచ్చునా?

సునం--ఆహా! రావచ్చును.

[చతుర, మైత్రేయుఁడు, పెట్టెనుమోసికొని యిందుశర్మ ప్రవేశించుచున్నారు.]

మై—జయము. జయము. మహారాజ్ఞీమణీ!

ఇందు--(పెట్టెదింపుకొని) అమ్మా! అబ్బా! పురుషప్రసవవేదన ! అమ్మా! జయము జయము!

సునం—ఇందుశర్మా! కోటలోనికివచ్చుటయే మానివేసినావఁట!

ఇందు—అమ్మా! ఎందునకు! మామామకోటలోనుండఁగ రావలసిన వాఁడనేకద!

సునం—ఇప్పుడుమాత్రము మీమామ కోటలోనున్నాఁడని వచ్చితి వా? ఏదోయొకవంక.

ఇందు--పూజ్యుఁడయినయీమహానుభావుఁడు నాకు గురువగుటచేత వీరితో వచ్చితిని.

చతు--పెట్టెనుమోసికొని.

సునం—చతురా! ఆపెట్టెలో వింతయేకాదా మనము చూడవలసినది ?

చతు—చిత్తము.

సునం--సరే. నీవాయనతో నాయభిప్రాయమును జెప్పుము.

మై—అమ్మా! స్వప్రతాపకథన మకర్తవ్యమైనను దూరదేశాగతుఁడ నైన నాయెడల క్షమార్హ మగునుగాక!

సునం--మీయుదంత మంతయుఁ జతురవలన వింటిని. మీరుమహాను భావులరు. అనేకవిద్యాపారంగతులరు. మీవిద్యానైపుణ్య మంతయును గనిపెట్టుటకు మా కవకాశము లేదు. మన్నింపవలెను. చతురా! చెప్పవలసిన దేదో చెప్పుము.

చతు--అయ్యా!

ఇందు--"అయ్యా" యనెద వేల? "ప్రాణనాథా" యనిపిలువుము.

చతు--ద్విజశిఖామణీ!

ఇందు--ఆ! ఎందునకు?

చతు--నిన్నుఁ బిలువలేను. నీకు శిఖామణి యోగ్యతకూడనా!

ఇందు--నీతో పాటు. నీతో పాటు.

మై--చతురా! ఏమి చెప్పఁదలఁచితివో చెప్పుము.

చతు--మగధమహారాజ్యసింహాసనమహామణియు, సునందాప్రాణవల్లభుఁడును, భాగ్యవంతుఁడునగు—

సునం--ఆమాటయేల? భాగ్యవంతుఁడేయైన యెడల సతీసుతామాత్య బంధుభృత్యసేవితుఁడై యంతఃపురమున మరణించును గాని కారడవిలో విశ్వాసఘాతుకుఁడైనహితునిచేఁ బొడువఁబడి ఘోరమరణమునొందునా?

ఇందు-ఆ. వె. ఇంటిలోనిమరణ మింతులకును బాలు
రకును దగునుగాని రాజవరుల
కటవి యుద్ధభూములం దరికరముల
నీల్గ భాగ్య మడవిమృగములటులె.

చతు--నందరాజేంద్రు నిప్పుడు మీరు కనఁబఱుపవలెనని మా దేవిగారు కోరుచున్నారు.

ఇందు--రాజేంద్రునిఁగాదు. రాజేంద్రస్వరూపము నని చెప్పవలెను.

మై--ఆ. వె. బ్రహ్మవిష్ణుశంకరముఖబృందారకు
లైన మంత్రిబక్షులైనయప్పు
డిటకు నందభూపుఁ డేలరాకుండును ?
గాని యొక్కమనవి గలదు తల్లి!

సునం--వినుట కవకాశముఁ గలిగియున్నాను.

మై--గీ. బ్రహ్మముఖజముల్మంత్రము ల్బ్రాహ్మణాస్య
యంబు మంత్రింబు ద్విజసాక్షికంబుగాన
మొదట మంత్రంబుచే నొక్క భూసురేంద్రుఁ
జూపునాచారమున్నదో సుగుణరాశి !

గీ. ద్విజునిఁజూపువాలాయము దీని వెనుకఁ
జూడఁగోరినయందఱుఁ జూపువాఁడ
మొదట విఘ్నేశసేవరీతా పిదపఁ గాని
చేయఁదలఁచినకార్యంబు చేయఁదగునె?

గీ. ఇతనిచాంద్రసతను క్షమియింపుమమ్మ!
ఎవనినైన నొక్క ద్విజుని యెంచవమ్మ!
అట్టె కనుమూసి తెఱచినయంతలోన
నతనిఁ జూపించి పిదప నీపతినిఁ జేర్తు.

సునం--ఆచార మేలదాఁటవలెను? అలాగుననే కావచ్చును-చతురా!
మనము చూడఁదగిన బ్రాహ్మణుఁ డెవఁడున్నాఁడు?

చతు--నాకెవ్వరును స్ఫురించుట లేదు.

సునం--ఇంద్రశర్మా! వచ్చినబ్రాహ్మణు నెవరినైనఁ బేర్కొనుము.

మై--ఆకేఁ డెందులకు మీరే కోరుఁడు.

సునం--అయిననేమి? 'ఇంద్రశర్మా! ఎవరినైనఁ గోరుము.

ఇంద్ర--నాకొక్కడిపి నాకుఁ జూపవలెననియున్నది. కాని నేనుబుట్టిన

ముందే మరణించినయాతని నే నానవాలెఱుఁగను. మీరంత కంటె నెఱుఁగరు. ఎవరినో యొకరిని జూపించి యితఁడే మీ తండ్రి యనిన మనముకాదని యెట్లు చెప్పఁగలము?

సునం--చతురా! ఇన్ని యాలోచన లెందుకు? ఇతని మేనమామయగు చాణక్యునిమాట మనము మఱచిపోయినాము. మరణకాల మందైనను మఱవఁదగనిచాణక్యుఁ డిప్పుడు మఱపునకు వచ్చె నేమి చెప్పుమా!

చతు--అమ్మా! నందరాజదర్శన సంభ్రమాచ్ఛాదిత మైనమీహృదయమున నున్నచాణక్యుఁడిప్పుడు పెట్టెలోనున్న త్రాఁచుపాము వలె నడఁగియున్నాఁడు.

సునం--బ్రాహ్మణోత్తమా! చాణక్యునిఁ జూపుము.

మై--చిత్తము.

సునం-(నవ్వుచు) ఇందుశర్మా! నీవు సంకల్పసిద్ధుఁడవు.మీ మేనమామ లేకుండఁ గోటకు రానంటివి! ఇప్పు డాతఁ డిక్కడికివచ్చును. నీ వున్నకోటలోనికేకాని రానని మీమామకుఁగూడ శపథమున్న ట్టున్నది.

మై--ఇందుశర్మా! నీ వీపచ్చడమును నీపెట్టెచుట్టునుబట్టుము.

ఇందు--చిత్తము.

మై—గీ. అఖిలనాశనమృత్యుదేవా! జయంబు
వహ్నిమరుదింద్రసోమాఖ్యభవ్యులార!
మీరు చాణక్యునకు దీప్తి యీను పాత్ర
యొడ లొసఁగి తెచ్చెదరుగాక వడిగనిటకు.

ఓచాణక్యా!

గీ. కంజమిత్రుఁడు నినుఁ బూతగాత్రుఁ జేయు!
మాతరిశ్వుఁడు జీవప్రదాత యగుత!

రమగ్రిఁ డిచ్చుత భాగ్య మారోగ్యవృద్ధి
యముఁ డొసంగుత ధర్మసమ్యక్సమృద్ధిఁ

ఓచాణక్యా!

గీ. చీఁకటిని బాసి వెలుతురుఁ జేరవయ్యా!
ముసుగుకొని యుంట మాని సంపూర్ణ దేహ
లలితవైభవయుతుఁడవై నిలువు మయ్యా!
లెమ్ము లే లెమ్ము చాణక్య! లెమ్ము లెమ్ము.

(పైపచ్ఛడము తీసి వేయఁగ లోన శిరముపై నొకముసుఁగుతోఁ చాణక్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సునం—బాగుగఁ గనఁబడుట లేదు. ముసుఁగు వైచినయా వస్త్రమును కూడఁ దీసి వేయుము.

చతు—అమ్మా! నాకు గుండెలు తల్లడిల్లుచున్నవి. అవ్వేల్లుచాణక్యునివే!

సునం--భయమేమి?

మై--మీరందఱును నిమ్మళముగఁ జేతులు తాటించుచు "చాణక్యా చాణక్యా"! అనవలెను.

అందఱు—(అటుల చేయుచున్నారు.)

మై--చాణక్యా! చాణక్యా మర్త్యా! మర్త్యా!

(పైముసుఁగుఁదీయఁగఁ జాణక్యుఁడగపడుచున్నాఁడు.)

చతుర--అమ్మయ్యో! అమ్మయ్యో! (గడగడ వడఁకుచున్నది.)

సునంద(అపవారించి) ఓసీ!పిఱికిదానా! ఎందులకు భయము? కన్నులు తెఱువుము. మనచే గొంతుకోయఁబడిన మహాబుద్ధిమంతుఁడైన చాణక్యుఁడేకదా! సజీవుఁడై యుపకారము చేయఁ జాలనివాఁడు చచ్చి యేమిచేయఁగలఁడు? ఈకుటిలుఁడు జీవించియున్న యెడలఁ జంద్రగుప్తుని కీతనిసాహాయ్యమునఁ బట్టాభిషేక మగు నేమో యని

మున కనుమాన ముండెనుకదా! చతురా! భయపడకుము. అటు చూడుము. ఆహా! నీపెనిమిటి దైవసముఁడు. దైవాధికుఁడని కూడఁజెప్పవచ్చును. భగవంతుఁడే--ఉన్నయెడలఁజుమా—తిరిగి చాణక్యుని సృష్టిచేయఁదలఁచినయెడల నింత బింబప్రతిబింబ భావానుగుణముగఁ జేయఁజాలఁ డేమోసుమా!

చతు--(వణఁకుచు) అమ్మయ్యో! నాకు దడయెత్తుచున్నది.

మై--ఇందుశర్మా! చతురను జూడుము.

ఆ. వె. పెట్టెలోననుండి యిట్టిచాణక్యుఁడు
పైకిరాఁగఁ జతుర వడఁకు భీతిఁ
బుట్టలోననుండి యిట్టెనిల్వునలేచు
త్రాఁచుఁ జూచుకప్ప దారిగాఁగ.

ఇందు--చతురకననేల? నాకే భయము వైచుచున్నది? "అగస్త్యం కుంభకర్ణంచ। శమీంచబడబానలం। ఆహారపరిణామార్థం। స్మరామిచ వృకోదరం." (చదువుచున్నాఁడు.)

మై--ఇందుశర్మా! మందాగ్నికిఁజదువుమంత్ర మిప్పుడుచదువుచుంటివేల?

ఇందు--మందాగ్నికి మామగారికి మంత్రమొక్కటేకాదా!

(వడఁకుచున్నాఁడు.)

సునం--మాంత్రికుఁడా! నీప్రభావ మద్వితీయము. మిక్కిలి మెచ్చితిని. వెలుతురును నీడయుఁ గలియుటచేత నిర్మింపఁబడిన విగ్రహమునకు లేని గ్రహణశక్తి దీనికుండునా?

మై--గీ. స్థూలసూక్ష్మశరీరముల్ గూడియొకటి
నుండునపుడు గ్రహణశక్తి యుండకున్నె?
వారివాతసంయోగవిభ్రాజిబుద్బు
దమునకు మనల గ్రహియింప దక్షిణలేదె?

చతు--అమ్మా! చాణక్యు నీతఁడు చేఁత పెయ్యఁగఁ జేయలేదుకదా!

సునం--చతురా! నీకిప్పుడు భయము కొంచెముతగ్గినదని తెలియుచున్నది.

(చాణక్యుని సమీపించుచున్నది.)

చతు—అమ్మా! దగ్గఱకు వెళ్లవలదు. అయ్యయ్యో! వెళ్లుచున్నా వేమి? ఆతనివలన నేమియుపద్రవము కలుగునో!

సునం—(చాణక్యుని సమీపించి) ద్విజశిఖామణీ! బుద్ధిమంతుఁడా! బ్రహ్మచారీ! మంత్రిశేఖరా! నానాథుఁ డగునందరాజేంద్రుం డు నిన్ను నిండుకొలువున జుట్టుచేతఁబట్టుకొని యీఁడ్చి యీఁడ్చి విడువఁగ వీడిపోయిన కేశపాశమును ముడివైచుకొనకుండనే చ చ్చితివేమి? ఛీ! నీతో నేమి? భూసురేంద్రా! ఇఁక నాకు నందరాజేం ద్రునిఁ గనుపఱుపుము.

చాణ--(పెట్టెలోనుండి వెలికిదుముకి) నందరాజును నీకుఁ గనుపఱుప వలెనుగాదా!

ఆ. అతనివలన నేమియగు? నందతుచ్ఛుని
నీకు నీసుతులకు నిమిషమాత్ర
ముననె చూపవచ్చితిని నేను జచ్చితి
ననుచు ముఱియుచుఱుపు లడఁగు నిపుడు.

చతు--అయ్యయ్యో! అయ్యయ్యో! ప్రాణనాథా! ప్రాణనాథా! మంత్ర ముపసంహరింపవయ్యా! అయ్యో! ఉపసంహరింపయ్యా!

(కాళ్లపైఁబడుచున్నది.)

మై--ఉపసంహార మొనర్చుటకిదిమంత్రముకాదు. సంహార మొనర్చుటకుఁ జేసిన తంత్ర మిది.

చాణ—ఇందుశర్మా! తలుపు లన్నియు లోపలివైపున గొళ్లెములువైచి తివికాదా?

శాము—ఇదివఱకే జాగ్రత్తపడినాను!

చాణ—మైత్రేయా! అంతఃపురద్వారరక్షకు లగుముసలివాండ్ర నిద్రజే సీకత్తితోఁ గంఠములు కోసిరమ్ము. లోనిధ్వని విని వారు కేకలు వేయఁగలరు.

మై—చిత్తము (పోవుచున్నాఁడు.)

చాణ—హా! సునంద! హా దురాయలాఁడీ!

గీ. నను( బరిభవింపఁ, జంద్రగుప్తుని హరింప,
మురను బంధింపఁ, బన్నినకుటిలపన్నాయ
కాదిశక్తి వయినవిరాడ్డాక్షత్రివిగ
దా! పరమనీచ! ద్రోహిణి' పాపచిత్త!

ఇాము—ప్రకృతినుండి గుణత్రయం బుద్భవించిన ట్లీమెవలన నపకారత్రియము పుట్టెను.

సునం—(తనలో) ఈతఁడు చాణక్యుఁడగుట నిశ్చయము. మాయోపాయమున జీవించి యిటకువచ్చినాఁడు. ఇఁక సంఘమరణము తప్పదు. రక్షించువాఁడెవ్వఁడును సమీపమున లేఁడు. దైన్యముచేఁ బ్రార్థించిన వినువాఁడు కాఁడు. ప్రార్థించుటకూడ నేనెఱుఁగను. పట్టుదలయే ప్రధానముగఁ గలవాఁడు. (చతురవైపు దిరిగి పరిహాసముగా) ఛీ! పాంసులా! ఛీ! కులటా! ఈచండాలురందఱ తంత్రమున నీవుఁగూడఁ జేరి నాకొంపఁ దీసితివా? కృతఘ్నురాలా! రాణికంటె అధికముగఁ జెక్కవయ్యె నేమి?

(తన్నుచున్నది.)

చతు—(కాళ్లపైఁబడి) అమ్మా! అమ్మా! నేనేకర్మమెఱుఁగను. వీరిద్దఱు నన్ను మోసపుచ్చినారు. అమ్మో!(ఏడ్చుచున్నది.)

సునం—నీమాంసము నీమాదిగవానికి విక్రయించుకొంటివి చాలదా?

ఇఁక నాకొడుకులమాంసముఁగూడ నీకటికవానికి (చాణక్యుని జూపి) విక్రయించి కడుపు నిండించుకొన నుంటివా ?

(తన్నుచున్నది.)

చాణ— నేను కటికవాఁడ నెట్లైతినో చెప్పెదను—

గీ. నందుఁ డనుమన్నపోతు నానంద మెసఁగ
గండకండలుగాఁ గోసి కాకులకును
గ్రద్దలకును డేగలకును రామబంధు
వుల కెగరవైచి పగఁదీర్చి వెడలినాఁడ.

సునం— ఆ. ఆ. హా హా! హా హా! (గుండెలు కొట్టుకొనుచు) ఓరీ బ్రాహ్మణాధమా! ఓరీ రాజద్రోహీ! నీవేనటరా నానాథు నటవీస్థలమునఁ జంపిన క్రూరాత్ముఁడవు.

(ఏడ్చుచున్నది.)

చాణ— క్రూరాత్ముఁడనేమి! ఆఁ!

గీ. మురకు నాకును గలదని మొఱఁగ దయయొ
పంచపక్షిమాటల నమ్మి బాలుఁ డైన
మహాత్ము హింసింపఁ బూనుట మాన్యసంబా!
ఖలునిఁ బ్రత్యక్షముగఁ జంపఁ గ్రౌర్యమేమి ?

సునం— బ్రాహ్మణుఁడవు. పరిత్యజపౌరుషమున కేమిలెమ్ము; తోడేలు రాత్రివేళఁ బొంచియుండి మేఁకలమందపైఁబడుట పౌరుషమా? దొంగతనమునఁ గోళ్ల నెత్తుకొనిపోవునక్కది ప్రతాపమా? ఛీ! ఛీ! చచ్చితి నని ప్రకటించుకొన్న నీపౌరుషము మండి నట్లయున్నది; పాంచాలాధిపతి బ్రహ్మహత్యఁ జేసెననియును, నతనికన్నులు కాలిపోయెననియు, జగన్నాథస్వామిని సేవింపఁదలఁచెననియు దొంగవార్తలు పుట్టించితి, దొంగ యుక్తి

రములు పంపి, దొంగవేషము వేసికొని, దొంగపోటున నుత్తుం
గభుజపుత్రుఁడైన నాప్రాణనాథుని గ్రుంగిపైచితివి. ఇప్పుడీ
తొత్తుమగలఁ జేరి వారినాశ్రయించి యీనందవంశమును డే
మూలముగఁ బెట్టెలోనికిఁ దూఱి ఛీ! ఛీ చచ్చినట్లుండె ఛీఛీ!
ఛీ! చచ్చినవారికిఁ జపుమంత్రములు చదివించుకొను ఛీ!

చతు—అమ్మా! చాణక్యుఁ డీపెట్టెలో నున్నాఁడని నేను బొంకఁగను
నీపాదములతోడు! (ఏడ్చుచున్నది.)

ఇం దు—అమ్మా! ఇది నిజమే చెప్పుచున్నది.

సునం—ఛీ! దాసికిఁ దార్పుడుకాఁడు సాక్ష్యమా? మనమాను
దూర దేశములోఁ జచ్చుటచేత శవదహనమైనఁ దటస్థింపలేదని
యేడ్చితివికాబోలు! ఇప్పు డీజీవచ్ఛవము నొక్కఁడవే మోసి
ధన్యుఁడవైతివి.

చాణ—గీ. నేను జీవచ్ఛవంబను గాను, నీదు
మగఁడు చచ్చుటచే నీవె యగుదు, వింక
నాత్మజులుచచ్చు వెన్క నీ తమ్యేదవు ను
ఱింతజీవచ్ఛవంబుగా నెగురు లేల?

సునం—ఓరీ! తుచ్ఛుఁడా! నాకొడుకు లేల చచ్చెదరురా?

చాణ—గీ. ప్రేలకుము నోటికొలఁదిని రేలుఁ బగలు
కమ్రిసంస్తుతిఁ జేయ రాక్షసుఁడఁగాను,
భగ్గుభగ్గునమండునీ బ్రాహ్మణునకు
స్త్రీవధము సేయుపాపంబుఁ దెత్తు వేమొ!

సునం—మహారాజవధ చేసి యమితపుణ్యమును గట్టుకొంటివి. మహా
రాజసుతుల నజ్ఞానులఁ గుసుమసదృశులఁ గోయఁ దలఁచి
మఱింతపుణ్యమును గట్టకొనఁదలఁచితివి. ఇఁక స్త్రీవధ పాప

మని సంకోచించుచుంటివా? విపరీతస్వ...గారవస్తివి! విశ్వా సఘనివి !

చతు—అమ్మా! ఆయనకు మఱింత కోపముఁ గలుగఁ జేయుచున్నావు. దైన్యముతోఁ బ్రార్థించిన శాంతించునేమో !

సునం—ఛీ! పాపిసా ! నీవు తీసికొని వచ్చితివి కావున నీవే ప్రార్థింపుము. నాయెదుట నిలువఁబడి గడగడలాడుచూడ వలసిన నా సేవకుఁడు నాభర్తనుగోసికొనితినినను గఱుపు నింపక నాకొడుకులను గూడ మ్రింగవచ్చితినని చెప్పఁ ఎంత గర్వముఁ బల్లుకొని బతిమాలుచుంటివా? కాళ్ళకైఁ బడుచుంటివా? సిగ్గు లేక, గౌరవము లేక. ధనప్రాణములే సర్వమని యెంచి తుచ్ఛనీయులగులవు మఱుఁగు లిడుటకుఁ దొత్తునసుకొంటివా?

(తెన్నుచున్నది)

ఇందు—(అపవారించి) మైత్రేయా! అంతటి తెగఁబడినతెనువాత నెంత మేధావంతుఁడైన "నొమె, మె" యనవలసినదేకదా!

మై—(అపవారించి) తుచ్ఛమైనయూరఁబంది సైతము శిశువులకు హానితటస్థించునని తోఁచినపుడు హానిఁజేయఁ దలఁచినదానిని రౌద్రరూపమై మార్కొనునుగదా! అట్టిచో నుత్తమక్షత్రియ కన్య పరమాభిమానవంతురాలు—ప్రేటుఁదిన్నయాఁడి పుదివలె భర్తృవిరహదుఃఖరోషార్తమైయున్నది. అట్టిసమయమున శిశువులను గూడఁ జంపఁదలఁచిన చాణక్యునామె లక్ష్యపెట్టునా ?

ఇందు—(అపవారించి) అదిమేకాక యామె పరిస్థితికూడఁ గొంచెము భయంకరమైన దని తోఁచుచున్నది.

సునం—చాణక్యుఁడా ! మాటలాడవేమి ? నాకొడుకు లేల చచ్చెదరు?

చాణ—ఆయువు లేక.
చతు—మహాప్రభూ! మీయనుగ్రహము లేక.
సునం--వారికాయువు లేకుండిన యెడల నీకుమాత్రమాయు వుండునా?
చాణ—ఆ—నీకొడుకుల నీచేతితోఁ జంపువఱకును నేను బ్రకుకుట నిశ్చయము.
సునం--ఆహా! పిల్లలనుగూడ నీవే చంపఁదలఁచితివా? బ్రాహ్మణుఁడవు! పవిత్రుఁడవు. అహింసాపరుఁడవు. కరుణాసముద్రుఁడవు. నీవు న్యాయముగానే చంపవలెనా? నరఘాతుకవృత్తి చేసికొను వాఁడెవఁడైన దొరకఁ డయ్యెనా?
చాణ--వాఁడు చంపినయెడల నాపగ యెటులుతీఱఁగలదు?
సునం--అజ్ఞానులయెడఁ బగయేమి? ఆజీవులు నీకుఁ జేసిన యపకార మేమి?
చాణ--చంద్రగుప్తుఁడు నీ కేమిచేసినాఁడు? మురయేమి చేసినది? చాణక్యుఁ డేమిచేసినాఁడు?
సునం--మూర్ధాభిషిక్తుఁ డగునని చెప్పఁబడిననాసవతి కొడుకుపై నాకు బగయుండ నసహజ మేమున్నది? కాని నీకు నాపుత్త్రిలపైఁ బగయేల యుండవలెను?
చాణ--నీపుత్త్రిలగుటచేత నే.
సునం— అది యైనను వారిదోషము కాదే. అయినను నాపుత్త్ర లేమి చేసిరి?
చాణ—ఏమిచేసిరా? నందన శమములోఁ జేరిరి.
సునం—అది నీకుఁ జేసినకీడెటు లగును?
చాణ—నాకుఁ గాదు. వంశమునకు. పీడిపోయినజుట్టు ముడివైచుకొనకుండఁ జచ్చితి వేలయని యంతకుముందే బుద్ధిపోటు పొడిచితివి.

జ్ఞాపియున్నదా? తక్షకవంశనాశనమునకు బయలు వెడలిన ధూమకేతువే యీ కేశపాశము. నీపుత్రులనందఱనొకరితరువాత నొకరి నీకన్నులఁజూడఁగనే చంపెదను. మైత్రేయా! నీవు పోయి యా మంచముపై శయనించుకృష్ణనందుని లేపి తీసికొనిరమ్ము.

మై—చిత్తము.

సునం—ఛీ! బానిసతో నాయంతఃపురమునకువచ్చి బ్రాహ్మణుని యాజ్ఞలను నిర్వహించుచుంటివా? హా! హా! ప్రాణనాథా! నీవులేకపోవుటచేత దిక్కుమాలినపక్షుల మైనీచసేవకులచేతఁబరాభూతుల మగుచున్నాము. (ఏడ్చును.)

ఇందు—ఇంతయల్లరి జరుగుచున్న నాదమఱచి నిద్రించువాని కదృష్టమేల పట్టును? కృష్ణదేవా! కృష్ణదేవా! లే.

కృష్ణ—నన్నీడ్చుకొనిపోకు. నన్నిడ్చుకొనిపోకు. మాయమ్మ దిక్కుమాలిన దగును!

సునం—నాతండ్రీ! నాతండ్రీ! నిన్ను యమభటులప్పుడే లాగికొనిపోవుచున్నారా? లేనాయనా! లే.

కృష్ణ—(లేచి) అమ్మా! అమ్మా! భయము వైచుచున్నది. (ఇటుచూచి) ఓహోచాణక్యుఁడా! నీవుమరణించితి వని వింటిమే.

చాణ—చచ్చియే తిరిగి వచ్చితిని.

కృష్ణ—అమ్మా! మానాయనగారుకూడ నటులు తిరిగివత్తురా?

సునం—(కౌఁగిలించుకొని) నాయనా! ఇఁక నీ కెక్కడి తండ్రిరా? నాతండ్రీ! ఏమిచేయుదునురా? మరణించినతండ్రిగారు మఱలివత్తురంటరా? ఎంతవెఱ్ఱివాఁడవు నాయనా! నీవెఱ్ఱిబాగులతనమైన నిన్నుఁగాయదంటరా! నాతండ్రీ! (ఏడ్చును.)

కృష్ణ—అమ్మా! చాణక్యుఁ డేలవచ్చినాఁడు?

సునం——చాణక్యుఁడు వచ్చినది దొంగచావురా! నాయనా!

కృష్ణ——చాణక్యా! దొంగచావని నిజమైన చావని రెండుండునా?

చాణ—నేను వచ్చినది దొంగచావు! నీవుచావ నున్నది నిజమైనచావు!

కృష్ణ——అమ్మా! దుష్టస్వప్నమటులే వచ్చినదిసుమా!

సునం—స్వప్నమేకాదు నాయనా! నిన్నుయథార్థముగఁ జంపుటకే చాణక్యుఁడు వచ్చినాఁడురా!

(ఏడ్చుచున్నది.)

కృష్ణ—అమ్మా! ఏడువకుము. అతఁడు నన్నేలచంపును? అతఁడు మనమంత్రి కాదా? చాణక్యా! నాచిన్నతనమందు నాకు——

గీ. పూలదండల సింగారములను జేసి
మెడకుఁ జుట్టును గిల్గింత యిడుచు నవ్వఁ
జేయు నీవు నామెడపై నిశితకరాళ
ఖడ్గమును మోపి యేడ్పింపఁగలవె యిపుడు?

సునం——హా. హా. హా. హా. నీతండ్రినే చంపినపాపాత్ముఁడు నిన్నేల చంపకుండునురా తండ్రీ!

(ఏడ్చుచున్నది.)

కృష్ణ—చాణక్యా! మాతండ్రిని జంపిన వాఁడవు నీవేనా? ఎంతపనిఁ జేసితివి! మంత్రివైయుండి యిటులుచేసితివా? ఆహా? హా! (యేడ్చుచున్నాఁడు) ఏమంత్రియైనఁదనరాజేంద్రునిఁగోసెనని వినియుంటివా! చాణక్యా!

చాణ——గీ. ఎట్టిరాజైనఁ దనమంత్రి నిద్ధచరితు
భయదనీలాపనిందకుఁ బాలుచేసి
కేశపాశంబు తనచేతఁ గీల్చి యిటులు
నిటులు జాడించిసభలోన నీడ్చినాఁడె?

గీ. ప్రబలసర్పకోపశిఖఁ బట్టవచ్చు
భయదసింహకేసరశిఖఁ బట్టవచ్చు
ప్రళయానలశిఖఁ బట్టవచ్చుఁ గాని
బ్రాహ్మణశిఖానాశశిఖఁ బట్టరాదు.

మైత్రేయా! అంతేకాదా?

మై—చిత్తము.

గీ. దైన్యమున వెలయాలిపాదములఁ బట్టు
వాఁడు, పరిహాసకమునకు బోతునయముఁ
బట్టువాఁడు, క్రోధముచేత బ్రాహ్మణశిఖలఁ
బట్టువాఁడు, నిర్వంశులై గిట్టువారు.

ఇందు—(తనలో) మైత్రేయుఁడు చెప్పినది మహాధర్మశాస్త్రము.

చాణ—కృష్ణదేవా! ఏడువకు. నిన్నును నీసోదరులను జంపుట నాకు మాత్ర మిష్టమా? ఏమిచేయుదును? చంపక తప్పదు.

కృష్ణ—తప్పదా? మంత్రిచంద్రా! ఎందుచేత?

చాణ—గీ. నాఁడు సభలోన నీతండ్రి నన్నుఁ బరిభ
వింప నమితకోపోద్రేకవిహ్వలతను
నందవంశంబు నాశన మొందఁ జేయు
దు నని శపథంబుఁ బూనినాఁడనుర వత్స!

కృష్ణ—శపథ మిప్పుడు తీర్చుకొనక మానివేసిన నిన్ను శిక్షించువా రెవ్వరు? చాణక్యా! చాణక్యా! దయయుంచుము.

చాణ—గీ. బ్రాహ్మణుఁడ, దోషరహితుఁడ, పట్టుదలను
గలుగువాఁడను బరిభవానలశిఖాప్ర
తప్తచిత్తుఁడ నే శపథంబుఁ దీర్ప
కున్నఁ బ్రబుకు కేల? విప్రత్వమూన నేల?

సునం—ఛీ! ఛీ! నీబ్రాహ్మణత రాజశిశువధముచేత గాని నిలువదా? రాజును జంపి యాతనికొడుకులను జంపినఁగాని నీబ్రదుకునకు సాఫల్యమేగలుగదా? నాకొడుకులను జంపకున్న నీబ్రదు కేల యనుచుంటివా! ఛీ! ఛీ! నీచేతిలోనికత్తిచే నీగొంతుకను గోసికొనిన యెడల సర్వశ్రేయముగ నుండునుగదా! సిగ్గులేక బ్రాహ్మణుఁడ నని చెప్పుచుంటివా? శపథము తీర్చుకొనకపోయిన బ్రాహ్మణత్వహానికలుగునా యేమి?

చాణ—ఆఁ; కలుగును.

గీ. విప్రునికి శిఖాయజ్ఞోపవీతములె ప్ర
ధానములు వానిలో శిఖఁ దాఁకెఁ గుక్క
దానిబదులుగ శపథంబుఁ దాల్చినాఁడ,
దీని విడిచిన విప్రత్వహాని గాదె?

కృష్ణ—శపథమును విడువ నక్కఱలేదు. ఒక్కసంగతి వినుము.

గీ. మాకు నాధార మైనట్టి మాదుతండ్రిఁ
జంపినపుడె మేమునుగూడఁ జచ్చినట్టి
కట్టెలముసుమ్ము; మూలంబు గిట్టఁజేయఁ
బువ్వు లాకులు పండ్లెండి పోవుఁగాదె?

సునం—(తలఁగొట్టుకొని యేడ్చుచున్నది.)

చాణ—సెబాస్! ఇదివఱకే చచ్చినవానికిఁకఁ జావుభయమేల? రా. రా. (అని పిల్లవానిని లాగుచున్నాఁడు.)

సునం—ఆ. ఆ. చండాలుఁడా! వదలు. వదలు. (తా నొకచేయి పట్టుకొనుచున్నది.)

కృష్ణ—అమ్మా! నన్నువదలింపవా? నన్నువదలింపవా?
(ఏడ్చుచున్నాఁడు.)

చాణ—గీ. తల్లినుండి తమ్ములనుండి ధరణినుండి
సర్వసుఖములనుండి వంశంబునుండి
నిన్ను వదలింపవచ్చితి నన్నుఁజూడు
మామె యేడ్చుటయేఁ దక్క యేమిచేయు?

సునం—ఓరీ! పాపి! కులద్రోహీ! నరాశనుఁడా! విడు విడు నాకొడుకును విడు. (గట్టిగలాగుచున్నది.)

చాణ—(గట్టిగఁబట్టుచున్నాఁడు.)

కృష్ణ—అయ్యో! అయ్యో!

ఆ. కరము నొప్పలెత్తె గురువులచేతను
దెబ్బయొక్కటైనఁ దిననివాఁడ
సులలితాంగుళములఁ జుబుకంబుపుడికిన
యీకరంబు కఠిన మెట్టు లయ్యె?

చాణ—గీ. గట్టిపిడిగలబాకును బట్టినీదు
పితను బాడువ గట్టివడిమె, నతనిదాడ
యవియఁగొట్ట నెత్తినకర మతఁడు మొగము
మీఁద భుజకీర్తిపైఁబడి మోటుదేతె.

సునం—కడుపుమండుకొనిపోవుచున్నది. హా! హా!

చాణ—అందుకొఱకే వచ్చితిని.

కృష్ణ—గీ. స్ఫటికమాలను ద్రిప్పుహస్తంబు దీనిఁ
శార్ఙ్గవమున నక్షతలుంచుపాణి దీనిఁ
దరణి కర్ఘ్యం బొసంగెడుకరము దీని
బుడుతనెత్తుట నిపు డెట్లు తమపఁగలవు?
(ఏడ్చుచున్నాఁడు.)

ఇందు—(అపహారించి మైత్రేయునితో) మహారాజపుత్రుఁడైనను వీనికిఁ

పౌరుషయోగము లేశమైనను లేకపోవుటచే నీతఁడు పర్వమునఁ దల్లిగర్భమునఁ బడె నని తోఁచుచున్నది.

మై—వంశనాశన మాసన్నమగునప్పు డిట్టిచెవులపిల్లిగుండెగల శిశువులు రాజవంశమున జన్మించుట యాచారమేకదా!

ఇందు—కాని యీతఁడు పిల్లవాఁడైనను మిక్కిలి తెలివికలవాఁడు సుమా! పాపము మిక్కిలి దైన్యపడి యేడ్చుచున్నాఁడు కదా!

మై—(అపవారించి) నీకు మనసు కరఁగుచున్నట్లున్న దే!

ఇందు—(అపవారించి) బ్రహ్మచారిగనున్నంతకాలము చిత్తము రాయివలె నుండెనుగాని. నారకాంతాసహవాసము కలిగిన తరువాత మెత్తఁబడినదిసుమా!

సునం—ఇప్పటికైన నీమనసు కరఁగదా? దారువా? పాషాణమా? ఇనుమా? వజ్రమా? హా! హా! బ్రహ్మచారీ! ఏకాకీ! నీకుఁ బిల్లలతీపి యెట్లు తెలియునురా? నీతల్లి గొడ్రాలైన కాదయ్యెను! ఆఁడుదానికి పుట్టితివటరా? (ఏడ్చుచున్నది)

చాణ—ఓరీ! యిందుశర్మా! ఆగణికను జెక్కలువిఱిచి యాస్తంభము నకుఁగట్టుము.

ఇందు—చిత్తము.

చతు—(ఏడ్చుచున్నది.) అయ్యో! అయ్యో! నన్నెందుకుఁ గట్టవలెను?

ఇందు—(అపవారించి) ఎందుకా? నన్నుఁగట్టుకొనకపోవుటచేత—

(చతురను స్తంభమునకుఁ గట్టుచున్నారు.)

చాణ—సునందా! చతురను జూడుము. ఈచిన్నవానిని విడువక లేనిపోని యల్లరిఁజేసి నాకడ్డువచ్చిన యెడల నీగతికూడ నట్లే యగును. జాగ్రత్త! జాగ్రత్త!

సునం—ప్రాణములును గొడుకు నొక్కసారి విడుతును.

కృష్ణ—అమ్మా! అమ్మా!

తే. గీ. కోరి యొకసారి తొమ్మండ్రికొడుకు కన్ను
లును మృదువులైన చేతుల నినుఁ గదించి
కౌఁగిలింపంగ సౌఖ్యంబు గాంచునీవు
పశువుగతిఁ గొయ్యఁ[illegible]నుఁ గట్టబడుదు వేమొ!

చాణ—విను. విను. చెప్పినమాటవిను. అతనిని వదలుము.

సునం—నేను విడువను.

కృష్ణ—అయ్యా! బాకు మొనకైన నవకాశము లేకుండ మాయమ్మ నీ కడ్డువచ్చుచున్నదా? ఆమె నన్ను గ్రహించియున్నందున నాకుఁ గల లాభమును జెప్పెదను వినుము.

తే. గీ. దవనమోద్వేలఖరఖడ్గధారచేత
వ్రేటొకటి నన్ను వేయఁగ విపులశీత
మంజుళసుధాభమాతృసంస్పర్శమునను
దానిబాధనా కంతగాఁ గానఁబడదు.

అయినను నీవుమాత్రము నరుఁడవుకావా? నీకుమాత్రము దయ లేదా? మాతండ్రి నీయెడల నేరమే చేసినను నేరముకంటెఁ బెక్కుమడుఁగు లధికమయిన యీశిక్ష యనర్హమని బుద్ధిమంతుఁడవైన నీ వెఱుఁగవా? అందఱురాజులును బ్రాహ్మణుల కెగ్గొనర్పనివారేనా? ఆబ్రాహ్మణు లారాజుల వంశనాశనములే చేసిరా? వంశ మున్నఁగాని పగఁదీర్చుకొనుట కవకాశ మేమున్నది?

ఆ. వె. నన్నుఁ గన్నయమ్మ, నాతండ్రి! నాతండ్రి!
యనుచు నేడ్చు చుండ, నమ్మ! యమ్మ!
యనుచు నేను నేడ్వ, నయ్యయో! మముఁ బాపఁ
దలఁచి యెటులు నన్నుఁ బాపఁ[illegible]గలవు?

చాణ—ఎటులు పోవఁగలనా? ఇటులు—(పోవఁబోవును.) (సునంద యడ్డురాఁగ నామె చేయి గీఱుకొని పోవును.)

సునం—నాయనా! నాయనా! నీకుఁ దగులలేదుకద! నీకుఁదగులలేదు కద! నాతండ్రి! నీకుఁదగులవలసిన దెబ్బయే నాకుఁదగిలినది. పోనీ! నాతండ్రీ! నీచావును నేను జూడకుండ వెళ్లిపోయినఁజా లును రా! చాణక్యుఁడా? కంఠ ముండఁగర మేల నఱికితివి?

కృష్ణ—చాణక్యుఁడా! ఎంతపనిఁ జేసితివి? మాయమ్మచేతినుండి రక్త మెటులుస్రవించుచున్నదో చూడు. నీవు నన్నుఁ జంపుచుండఁగ నడ్డువచ్చినందుల కామె కీబహుమానమా?

ఇందు—(తనలో) ఆహా! ఆహా! ఈమె కొడుకునకు నతనిమరణమునకు నడ్డుపడినదికదా!

గీ. తరుణతమ ముత్తమము దీర్ఘతమము నధిక
తమము నిశ్చలతమ మచ్ఛతమము మధుర
తమము నసమానగంభీరతమము మృదుల
తమ మగుచు వెల్లివిరియును దల్లిప్రేమ.

చాణ—పిల్లవానిని విడిచెదవా లేదా?

సునం—మమ్మిద్దఱ నొక్కవ్రేటున నఱకుము.

చాణ—ఇందుశర్మా! మైత్రేయా! మీరిద్దఱీ రాణి నాస్తంభమునకు విఱిచికట్టుఁడు.

ఇందు—(అపవారించి) నాకు మనసొప్పకున్నది. నాకీచతురమైనఁగాని యుం కెవ్వరిపైనను బగలేదు.

మైత్రే—(అపవారించి) నీ వేమాత్రము జంకిన మొదట నిన్నాతఁడు నఱుకును.

ఇందు—చిత్తము. కట్టెదను. (కట్టుచున్నారు.)

కృష్ణ—అయ్యో ! వలదు వలదు (అని యేడ్చుచున్నాఁడు.)
సునం—అయ్యో ! అయ్యో ! నీచేతులు కాలిపోవును. నందరాజేంద్రా! నీవు లేకుండుటచే నా కెంతగతి పట్టినది ! అయ్యో ! అయ్యో! నాకొడుకు బ్రతికియుండగనే నన్నుఁ గట్టుచుంటిరా ? నేను జచ్చిన వెనుక నన్నుఁ గట్టవలసినదే. ఇప్పుడే కట్టుచున్నారేమి? ఓ చాణక్యుఁడా ! యింక నాకొడుకును జంపు. కోసికొనితినుం. నరఘాతుకుఁడా ! మ్రింగు. అయ్యయ్యో గర్భశోక మెటులు భరింపనురా ? ఓ తండ్రి ! నీవింకఁ బెద్దలలోఁ గలిసిపోవుదు వఁటరా ! ఈశోభమును జూడలేక కన్నులు పొడుచుకొందమ న్నను చేతులు స్వాధీనముగ లేవయ్యెనుగదా !
చాణ—కృష్ణదేవా ! నీచావు చెప్పపాటులోనున్నది. రెండు చేతు లొక్కసారి పైకెత్తి భగవంతునిఁ బ్రార్థింపుము.
కృష్ణ—గీ. నాకు భగవంతుఁడవు నీవె, నాదుపాణి
యుగము సంధించి నీపాదయుగముమీఁదఁ
బడితి నింతకంటెను దైన్యపడఁగ నేమి
యున్నది ? దయాఢ్య ! నాతల్లి నన్నుఁ జేస్పు.
చాణ—బౌద్ధపుత్రుడవు ! నీవు భగవంతుని దలఁతువా ? లే. లే.
కృష్ణ—అమ్మా అమ్మా ! (ఏడ్చుచున్నాఁడు.)

[తెరలో]

అమ్మా ! అమ్మా ! పలువిధములైన కంఠరవములు వినఁబడు చున్నవి.
సునం—అయ్యయ్యో ! అయ్యయ్యో ! పిల్లలందఱును బిలబిలలాడుచు లేచినారు. ఇంకేమున్నది ! ఇంకేమున్నది ! (ఏడ్చుచున్నది.)
చాణ—కృష్ణదేవా ! నీవు లోనికి రమ్ము. నీతమ్ములందఱిటకువచ్చిన మఱింత యల్లరియగును. రా ! రా !

కృష్ణ—(పోవుచు) అమ్మా ! అమ్మా ! (వచ్చును.)
మై—అబ్బ ! ఈపిల్లవాఁడేమియేడ్చినాఁడు !
ఇందు—గాలితిత్తిలోనుండి గాలి పోవుచుండఁగ నది కీచుమనదా ?
మై—ఈతనికి వయ సెంత ?
ఇందు—పండ్రెండేండ్లు.
మై—ఓ ! వింతలే చెప్పుచుంటివేమి ? ఇతని కెనమండ్రు సోదరులె ట్లుండిరి ?
ఇందు—ఇతనితల్లి కనుటచేత. ఆమెకానుపులచిత్రమేయది. ఇతఁడును మఱియొకపిల్లవాఁడును గవలు తరువాత రెండేండ్లకొక కొడుకు. తరువాత రెండేండ్లకు గవలు. తరువాత రెండేండ్లకొక కొడుకు. తరువాత రెండేండ్లకుఁ గవలు. తరువాత నొకఁడు. ఆహా ! ఆహా ! ఒక్కనినైన నుండనీయక—అటుచూడుము. ఆహా ! ఒక్కనినైన నుండనీయక యెటులు చాణక్యుఁడు వారిని జంపుచున్నాఁడో చూడు.

తే. గీ. కౌరవశిరోమణీవధకార్య మైన
వెనుకఁ గృపకృతవర్మల వెంటఁగొంచు
ద్రోణజుఁడు శత్రుశిబిరంబు దూఱి చోర
మారణము సేసెఁ బోలు నిమ్మాడ్కిఁగాఁగ.

మై—అశ్వత్థామ పాండవశిబిరములోఁ బ్రవేశించినది దుర్యోధనమరణానంతరమా ? అశ్వత్థామ మేలుకొనియున్నవారి గొంతుకలు గోసెనా ? ఎవ్వరినైన మిగుల్పక యందఱ కుత్తుకలఁ గోసెనా? ఏమి భారతేతిహాసపాండిత్యము !
ఇందు—పోనిమ్ము. పోనిమ్ము. వారతరుణులు నాకుపదేశించినభారతమింతకంటె సూక్ష్మగ నుండునా ?

హా ! హా ! హా ! హా ! అమ్మా ! అమ్మా ! (పలువిధములైన రవములు కలుచున్నవి.)

ఇందు—చూచితివా ? చాణక్యుఁడు.

తే. గీ. కన్నుఁగవ బాష్పబిందువు ల్గ్రమ్ముచుండఁ
ప్రబలచింతాప్రశోషితవదనుఁ డగుచు
వారిఁ జంపుచు నుండె దుర్వారముగను
బూర్వభవమున ముసలి కాఁబోలునితఁడు !

మై—పోనిమ్ము. ఆగొడవ మన కెందునకు ? ఈ వేశ్యకిచ్చిన యాభరణము లన్నియు నేనుఁ దిరిగి తీసికొందును.

[దగ్గఱఁ జేరి నగ లొలుచుకొనుచున్నాఁడు.)

చతు—అయ్యో ! అయ్యో ! (వచ్చుచున్నది.)

ఇందు—చతురా ! నన్నుఁ గట్టుకొనక పోవుటచేత నీకుఁగట్టువచ్చెనని చెప్పితిని. వింటివికదా ! అదిగాక “నీకు శిఖామణియోగ్యత కూడనా” యని నీవునన్నాక్షేపింపఁగ “నాతోఁబాటే” యని నేనింతకుముందే ప్రత్యుత్తరమిచ్చితిని జ్ఞప్తియున్నదా ? నాకు శిఖామణియోగ్యత లేదు, నీకుఁగూడ లేకుండఁ జేయఁదలఁచినాను. మైత్రేయా !

ఆ. వె. చతురవక్త్ర ననుచు మతిపోయి వదరెను
వానినాల్కఁ గోయవలెను జక్కఁ
దనమునందు నేనె యని విటులను జూడ
నొప్పనట్టి వేశ్య కొప్పువలెను.

అని నేను వెనుకనీతో నన్న వేదాక్షరములు జ్ఞప్తిలో నున్నవా? ఇప్పుడు దీనితలకట్టు సున్నచేసెదను. మామేనమామ శిరములు గోయఁగ నేను శిరోజములనైనఁ గోయలే నను కొం

టివా? హా! హా! ఇదుగో అపరచాణక్యుఁడు—అపరచాణ క్యుఁడు.

చతు—(ఏడ్చుచు) నీయిష్టానుసారముగ నీసేవకురాల నై యుందును. నావలన నేరము వచ్చెను. చెంపలు గొట్టుకొనుటకుఁ జేతులు స్వాధీనములుగ లేవు. మైత్రేయా! ఆనగలు నీవిచ్చినవిగావు; అవికూడఁ దీసికొనెద వేల?

మై—ఎవరైన నొక రిచ్చినవేకదా!

ఇందు—నన్నిప్పు డంగీకరించుచుంటివా? ఇప్పుడు నీ వెవరికిఁ గావలెను? ఉవిదప్రాయ మూఁచబియ్యపుఁజును నేకాదా! (చతురకొప్పును గోయుచున్నాఁడు.)

మై—చతురా! ఎందున కేడ్చెదవు? బ్రాహ్మణుఁడు నీతలాటమునకు మంగలివాఁడగుట నీయదృష్టముకాదా? చతురా! చతుర! అబ్బా! ఏడువకు. మాటలాడవలెను.

చతు—ఇంక నేమిమాటలాడవలెను?

మై—దుద్దులకుఁ జీల రొండమ్రతిప్పా కుడిత్రిప్పా?

ఇందు—ఇప్పుడు సవ్యాపసవ్యము లేమిటికి? లాగు. చూడు! జీడిమామి డిపండు క్రిందిజీడిగింజవలె దీని ముక్కుకొన నున్నపెద్దయడ్డ బాస నూడఁదీసితివిగావేమి? సానివేషము వదలి సన్యాసివే షము వచ్చినదా? నెత్తిమీఁద ముసుఁగువైచికో.

మై—తుడుచుకో. కన్నులుతుడుచుకో.

చాణ—(ప్రవేశించి) (కన్నులఁదుడిచికొనుచు) ఇందుశర్మా! రాణీగా రిని గట్లు విప్పి లోనికిఁ బంపుము.

ఇందు—చిత్తము. (విప్పుచున్నాఁడు)

సునం—హా! హా! (లోనికిఁబోవుచున్నది)

చాణ-(తనలో) ఆ. పగను దీర్చికొనెడువట్టి నస్నింత
పట్టుదలను గలుగువానిఁ గాఁగ
నేల చేసితివిహరీ! హరిహరి హరీ!
కాదు నాదుపూర్వకర్మ మింతె.
[తెరలో]

హా! హా! యనురవమును బెద్దచప్పుడు నగుచున్నది.

చాణ—ఆధ్వని యేమి?

ఇందు--హా! హా! అంతస్సౌధాగ్రమునుండి సునందాదేవి క్రిందనుదుమికి తుత్తుమురులై పోయినది.

చతు—హా! హా! నాతల్లీ! వెళ్లిపోతివా? (ఏడ్చుచున్నది.)

మై—అయ్యో! ఈచతురను జంపుమని సెలవా? లేదా?

చతు--మీరు చంపనేల? నేనే చచ్చెదను. నాతల్లిపోయినతరువాత నేను జీవింతునా?

ఇందు-తల్లిగాదు—తల—

మై—చతురా! ఏరీతిగాఁ జావఁదలఁచితివో చెప్పుము.

చతు—నన్ను విడిపింపుము.

మై—(విడిపించుచున్నాఁడు.)

చతు—(గుండెలుకొట్టుకొనుచు) నూతిలోనుఱికెదను.
(పోఁబోవుచున్నది.)

మై—(చేయిపట్టుకొని) ఇఱుకునూతిలోఁ బడినయెడల దేహమునకుఁ గాయములుతగులును. మిక్కిలివిశాలమైననూతిని నేనుగనుపఱుతును రమ్ము.

ఇందు—అంతవిశాలమైనబావిసందర్భించునెడలఁ బనిలోపని-దానితల్లిని గూడఁ గట్టగట్టిపాఱవేయరాదా?

చతు—అయ్యయో! నన్ను బలవంతముగఁ జంపెదవా! నేను నూతిలోఁ బడను. ఇంటికిఁ బోదును.

మై—రాజరహస్యమును నాకు వెల్లడించిన నీవు నా రహస్యమును మఱి యొక మగనికిఁ జెప్పవా? నీవు జీవించిన యెడల నీ రహస్యము దాఁగి యుండునా? నీవు చావక తప్పదు. రా. రా. రసవంతమైన చావు దొరకునప్పుడు సందేహింపఁ గూడదు. (మైత్రేయుఁడు చతురను లోనికిఁ దీసికొనిపోవుచున్నాఁడు.)

చాణ—ఇందుశర్మా! రాక్షసుఁడింక జీవించియున్నాఁడు. అతఁడు తోఁట లోనిగదిలో శయనించుచున్నాఁడో లేక యింటిలో నేనిద్రించు చున్నాఁడో చూచి చెప్పు వేటుకాలములో రావలెను.

ఇందు—చిత్తము. (పరుగెత్తుచున్నాఁడు.)

చాణ—అతఁ డింటియొద్ద నుండిన యెడల నిప్పుడే పోయి యాతనిని— కాదు. ఎక్కడకో యీ సరికిఁ బాఱిపోయియుండును. కాని గ్రామమున నుండఁడనితోఁచును. తరువాత వంతుప్రకారము వచ్చు నంతఃపుర ద్వారరక్షకు లంతఃపుర బహిర్ద్వారమునొద్ద నుండు కళేబరములను జూచియుఁ దలుపు లోనివైపు బంధింపఁ బడుటఁ గాంచియు, చాణక్యా! చాణక్యా! అను రవమును హాహాకారములను వినియు, రాక్షసునితో నీవార్తలు చెప్పి యుందురు. మోసము చేత నేనంతఃపురము ప్రవేశించితినని యాతఁ డెఱిఁగి పాఱిపోయియుండును.

ఇందు—(ప్రవేశించి) రాక్షసుఁడింట లేఁడు. అతని కుటుంబ మింటియొద్ద లేదు. వారంద ఱెక్కడకుఁ బలాయనమైపోయిరో తెలియదు.

చాణ—అంతఃపురాందోళనము పసికట్టి పాఱిపోయినాఁడు. పాఱిపోయెనో బ్రతికెనో! ఇతని బుద్ధిబల మిప్పుడు పిక్కలలోఁ గనఁబడుచి

నాఁడు. ఆతఁడు కుటుంబముతోఁగూడఁ బాఱిపోవుట కవకాశ
ము చాలదు. అతఁ డొక్కఁడే పోయియుండును.

ఇందు—కుటుంబ మింటియొద్ద లేదు.

చాణ—కుటుంబమును ప్రాణసముఁడైనమిత్రునిస్వాధీనము చేసిపోయి
యుండును. కానిమ్ము. జరిగినదేదో జరుగనే జరిగినది. మైత్రేయా!

మై—(ప్రవేశించి) అయ్యా! వచ్చితిని.

చాణ—నీవు నిందుశర్మయు, నూరిలోనికిఁబోయి రాక్షసుఁడు నందసుతు
లను నందభార్యనుఁజంపి యెక్కడకో పాఱిపోయినాఁడని ప్రతీతిని
గలిగింపవలెను. అందువలన మనకు లాభమున్నది. వెంటనే పొండు.

ఇందు—చిత్తము. (అపవారించి మైత్రేయునితో) చతుర చచ్చినదా!
మనము దానియింటిదారినే పోవుదము. కాన నీసంగతి దాని
తల్లి చెవిని బడవైచి మఱిపోదము.

చాణ—ఇందుశర్మా! ఒకరు వినుచుండ మీలోమీరు ముచ్చటించుకొ
న్నట్లుండవలెను. కాని యీవార్తను వెల్లడిచేయుటకై వచ్చి
నట్లు మాట్లాడకుమా! జాగ్రత్త!

ఇందు—చిత్తము. (ఇద్దఱును పోవుచున్నారు.)

చాణ—ఆ. అప్రమాణవార్త యానోట నానోట
నిట్టె యిట్టె ప్రాఁకి యెల్లయెడల
వ్యాప్తమగునుగాదె వరుసగైన ప్రాఁతతా
టాకుటింటిమీఁది యగ్గివలెను.

ఎవరిదో కాని కాలిచప్పుడగుచున్నది.

[మైత్రేయుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చాణ—మైత్రేయా! వ్యాప్తమైనదా?

మై—నీటిమీఁది తైలబిందువువలె.

చాణ—సరే,

మై—అయ్యో!

చాణ—ఎందులకు?

మై—హారదాసుఁ డను సేనాధిపతియొక్కఁడు మాత్రమే నంద సేననంతయు దీసికొని పాంచాలదేశమునుండి వచ్చినాఁడు.

చాణ—(తనలో) మిగిలిన పదుసేన్గురు సేనాధిపతులును నా తంత్రము వలన నేగొంతుకలు కోయఁబడిరి. (ప్రకాశముగా) మైత్రేయా! నేనిక్కడ నుంటి నని చెప్పితివా?

మై—చిత్తము.

చాణ—సరే. రమ్మని చెప్పుము. నీవుపోయి రాక్షసునికిఁ బరమమిత్రుఁ డెవఁడో తెలిసికొనుము.

మై—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

[హారదాసుఁడు ప్రవేశించును]

హార—అయ్యా! నమస్కారము, మీరు జీవించియున్నందులకు సంతోషించుచున్నాఁడ. మీమీద రాక్షసుఁడు పన్నిన దుష్టతంత్రమంతయుఁ గొలఁదికాలము క్రిందటనే మాకుఁ దెలిసి విచారమునుబొందితిమి.

చాణ—నీకుఁ గన్నులు లేవా? హృదయము లేదా? రాజవంశము నీకు శత్రుస్థానమా? రాక్షసుఁడు నా యెడల జరిగించిన యుపకారమునుగుఱించి యిప్పుడు విచారించుచుంటివా? రాక్షసుఁడు లోకమునకుఁ జేసిన మహోపద్రవముతో నీకుఁబని లేదా?

హార—అయ్యయ్యో! ఆదుష్టవార్తను చెవులు చిల్లులుపడ వినియుంటిమి. కన్నులు కరఁగిపోవ నేడ్చితిమి. ఊరందఱు నేడ్చుచున్నారు. రాక్షసునిదుర్మూర్తి తిట్టుచున్నారు. మంత్రిశిఖామణీ! ఈసమయ

మున మీరిక్కడ దయచేసియుండుట మిక్కిలి మంచిదయ్యెను.

చాణ--ఉండవలదా? అంతఃపురమంతయు శ్మశానమైనది. ఈశవములకుఁ
దెల్లవాఱినది మొదలగ్నిసంస్కారప్రయత్నములు చేయవలదా?
రాజు నన్ను వదలుకొన్నను నాఘటమున కీ ఋణానుబంధ
మింకఁ దీఱినదికాదు.

హర--సచివశిరోమణీ! నేనందుల కొఱకు పనిపిచేయుచుండుట లేదు.

చాణ---మఱియెందుకు?

హర---యాదవసేనుఁడు యుద్ధమందు చేసినమహాతంత్రము---

చాణ---ఏమిచేసెను?

హర---అతని మనమంత్రులు సేనాధిపతు లొక్కసారి మా పక్షమునకుఁ
దిరిగినట్లు నటించిరి.

చాణ---(తనలో) నేను జేసిన తంత్రమిది. (ప్రకాశముగా) ఏకారణమున
మీవంకకుఁ దిరుగఁ దలఁచితిమని చెప్పిరి?

హర---పరమపూజ్యుఁడైన నందరాజేంద్రుని గొంగిలింతలోఁ బొడిచిన
యాచండాలుని---

చాణ---హరి హరీ! ఇఁక నాతనిమాట చెప్పకుము. తెలిసినది. ఆ సేనాధి
పతులేమిచేసిరి ?

హర---అర్ధరాత్రమున లేచి, పదునేగురకుత్తుకలు కోసిన వెనుక---

చాణ---పదునెన్మిదవది పవిత్రమైనసంఖ్య. నీకెట్లు దుష్టమరణము కలు
గును? (తనలో) అక్కడ నేను జరిగించిన యుద్ధతంత్రమంతయు
నిర్వహించినది. (ప్రకాశముగా) నే నిప్పుడిక్కడనుంట మంచి
దయ్యెనంటివి, ఇప్పుడు నన్నేమిచేయుమని నీయభిప్రాయము.

హర---ఉద్దండోత్కంఠాసహితుఁడై మగధరాజ్యసింహాసనముపై నధి
ష్ఠింపఁదలఁచి వచ్చుచున్న యాదవసేనుఁడందున్నాఁడు. అట్లైన
నేల హంతప్యుఁడు---

చాణ—ఓయి నెక్కువాఁడా! మన మాతని నెట్లు చంపఁగలము? మహనూ యోచించియుంటిమి. సేనాపతులా! నీవు తప్ప నందఱును గడతేఱిరి. మహారాజేంద్రుఁడా! చంపఁబడెను. అతనిపుత్రులా! వను నెప్పుడి ముక్కలైరి. మనకాత్మహత్యతప్ప నిఁక నేసాధనమున్నది?

హర—మహాబుద్ధిమంతుల రైనమీకుఁ దెలియని యంశము లేదు. యుద్ధమునఁ గడతేఱిన సేనాధిపతులపుత్రులను దీసికొనివచ్చి వారికి—

చాణ—తండ్రులయుద్యోగముల నిచ్చుట న్యాయమేకద!

హర--ఇచ్చువారెవ్వరు? మీరేయివ్వవలెను. ఇప్పటికి మగధరాజ్యాధి పతులు మీరే—

చాణ—హరిహరీ! యెంతమాటాడితివి! దేవేంద్రప్రతిమానుఁడైన మహారాజు మరణించి, మహోన్నతధనసంపత్తియైనసంతాన మంతయు నీ రెండినచెఱువులోనికమలసంతానమువలె నశించి నందవం శాంకుర మైన లేకపోయెను, ఎంతగతి పట్టినది!

హర--వంశాంకురము లేకేమి? అన్యక్షేత్రిజుఁ డయ్యును నందపుత్రుఁ డైన చంద్రగుప్తునిఁ బట్టాభిషిక్తునిగఁ జేయ సర్వోత్తమముకాదా!

చాణ--(పెదవి విఱిచి) ఏమో! అంత దింతవఱకు వచ్చినదిగదా! ఆతఁ డైనను యాదవసేనునిచే కారాగృహబద్ధుఁడై యున్నవాఁడు, ప్రారబ్ధము!

హర-- లేదు- లేదు-మురాచంద్రగుప్తులనుగూడఁ దీసికొనివచ్చుచున్నాఁ డఁట!

చాణ--(తనలో) అట్లు చేయవలసిన దని నే నిదివఱకే చెప్పియుంటిని. (ప్రకాశముగా) సరే. ఇదికొంతమంచిదే.చూడు యాదవసేను నికిఁబరమసంతోషకరముగమీరందఱును స్వాగతమీయవలెను

జుమా! మన యపకారోద్దేశ మాతని కేమాత్రమైనఁ దెలిసిన మనకు సంఘమరణము తప్పదు. మన మున్న నేమి? యూడిన నేమి? విచారము లేదు; కాని, తనకు స్వాధీనుఁడై యున్న చంద్రగుప్తుని నాతఁడు వధించి జనుల ననాథులఁగఁ జేయును. మగధరాజ్యమరాజకముగఁ జేయును. మిక్కిలి జాగ్రత్తగఁ బ్రవర్తింపవలెనుజుమా! నేను చెప్పిన సంగతి తెలిసినదా? అతనితోఁ గాని యతని సేనాధిపతులతోఁ గాని మనకు లేశము వైరము వలదు. కాని, చంద్రగుప్తుఁడు రాజుగఁ జేయఁబడిన జను లందఱా మోదింతురా?

హార—సందేహముకూడనా!

చాణ—సేనాధిపతులకందఱి కిష్టముండునా?

హార—అయ్యయ్యో! ఎంతమాట! మహారాజు విరక్తుఁడు. బలాఢ్యుఁడు. శౌర్యరాశి. దయాసహితుఁడు. అంతకంటెఁ గావలసినదేమి?

చాణ—సరే. ఆమూలనఁ గ్రుచ్చియున్న తాటాకును ఘంటము నిటులు దీసికొనిరమ్ము.

హార—చిత్తము. (ఇచ్చుచున్నాఁడు.)

చాణ—(దానిపైవ్రాసి) ఇదుగో! దీనినిజూడుము. ఈరీతినొక శిబిరము—వెంకటి దిక్కు డెక్కడఁగును? తాటాకుమీఁది సాయంకాలమునసరికినిర్మింపఁబడవలెను. తాటాకుప్పు దీని క్రొత్తగఁ గొట్టింపవలదు. ఆలస్య మగును. రాక్షసుని యశ్వశాలలపాఁక దీయించి వేయింపవలెను. సేనాధిపతుల నందఱను గౌరవపూర్వకముగ విడియించుము.

హార—చిత్తము. దీని కొక్కద్వారమే యున్నదేమి?

చాణ—ఏమైన నీ కెందుకు? తరువాత మఱికొన్ని సంగతులను జెప్పెదను పొమ్ము.

హార—చిత్తము. నేను సెలవునుదీసికొందునా? నమస్కారము.

చాణ—విజయీభవ.

(హారదాసుఁడు పోవుచున్నాఁడు.)

[తెరలో]

అయ్యా! అయ్యా!

చాణ—ఎవరక్కడ.

[తెరలో]

యాదవసేనమహారాజుగారియొద్దనుండి చాణక్యుఁడుగారి కొక యుత్తరమును దెచ్చినాఁడను.

చాణ—(తనలో) మగధసింహాసన మెక్కఁబోఁవఁగనే మహారాజయ్యో నేమి?

(ప్రకాశముగా) ఇటుతీసికొనిరమ్ము.

(సేవకుఁడుత్తరమిచ్చును).

సరే. నీవుపో-(సేవకుఁడు పోవుచున్నాఁడు).

(ఉత్తరమును జదువుచున్నాఁడు).

బ్రహ్మశ్రీ చాణక్య విప్రశిఖామణికి—

యాదవసేనుఁడు సాష్టాంగనమస్కారములు.

తే.గీ. అతులితధిషణాసమన్వితుఁడైననీవు
తలఁచినట్లె నీతంత్రంబు ఫలముఁజెందె
మురను సుతుతోడ దర్శనమునకుఁ దెత్తు
త్వరగఁ జెలికాఁడ! నామాట మఱవవలదు.

యాదవసేనుఁడు."

ఇఁకఁదనమాట యేమున్నది? మగధరాజ్యసింహాసనమునఁ దనపట్టాభిషేకపుమాటయా? ఆంతేకాదా! ఎంతయాసఁ బెట్టుకొనెను!

చూచెదముగాక. ఉషఃకాలము దాఁటవచ్చుచున్నది. స్నానసమయము మించినట్లున్నది. ఇఁకఁ బోవలెను. ఇక్కడ జరిగింపవలసినయపరవిధు లన్నియు విధ్యుక్తముగ నాచరించుటకు మైత్రేయునితోఁ జెప్పి తగుప్రయత్నముఁ జేయించెదను. ఈరాత్రి నేనిక్కడకుఁ దిరిగివచ్చి యాదవసేనుని పట్టాభిషేకప్రయత్నము చేయవలెను. శ్రాద్ధక్రియలతోఁ బాటుఁగ నిది జ్ఞప్తికివచ్చినది. ఏమియగునో!

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది పంచమాంకము.



శ్రీ

# ప్రచండచాణక్యము.

## షష్ఠాంకము.

పాటలీపురము—రాజభవనము.

[యాదవసేనుఁడు, చాణక్యుఁడును బ్రవేశించుచున్నారు.]

యాద—దానియభిప్రాయమే నీకుఁ దెలియలేదా?

చాణ—తెలిసిన నడుగుదునా?

యాద—మహాబుద్ధిశాలి వైననీ కంతమాత్రమే తెలియకుండునా? పరిహాసమునకుఁ బలుకుచుంటివని నేనభిప్రాయపడుచున్నాను.

చాణ—"నామాట మఱవవలదు" అని యుత్తరమున మీరు వ్రాయుటచేత మీరేదోయంశము నాకాజ్ఞాపించినట్లు కనఁబడుచున్నది. అట్టియుత్తరువేదియు మీరు నాకిచ్చినట్లు స్మరణకు రాకున్నది. జ్ఞప్తికిఁ దెచ్చినయెడల—

యాద—ఏదైన నొకకార్యము నాకుఁ జేయవలసిన దని నేను మిమ్ముఁ బ్రార్థించియుండలేదు.

చాణ—పోనిండు. మఱియొకందులకు భయపడుచున్నాను. నే నేమైన మీకు వాగ్దానముఁ జేసితినేమో? దానిని నెఱవేర్పుమని మీరు నాకానతి యిచ్చుచున్నారేమో యనియూహించిచూడ నేను మీ కేమియు వాగ్దానముచేసినట్లు నాకు జ్ఞప్తిలేదు. అదిగాక చేయుటకు నే నెంతవాఁడను.

యూద—మీకు నాకేదియును వాగ్దానమునుగూడఁ జేసియుండలేదు.

చాణ—అట్లైనయెడల "నామాట" యనునది నిరర్థకమేనా?

యూద—నిరర్థకము కాదు.

చాణ—సార్థకమా?

యూద—కాదు.

చాణ—సార్థకత యుండుటయు లేకపోవుటయుఁగూడనా?

గీ. అస్తితయు నాస్తితయుఁ గూడునట్టియిట్టి
యద్భుతాశంబు చెన్నారు నద్వితీయ
వాదమాయావిచిత్రతత్త్వంబుకరణి
మాధ్యమికశూన్యతత్త్వసంభారమటులె.

యూద—నాకీవేదాంతపుఁదలవెండ్రుకలచిక్కు సగమెఱుక. ప్రవృత్తి మార్గమగ్రేసరము ప్రపంచసృష్టియనుభవమునకు; మనకుభగవంతుఁడిచ్చినశక్తు లనుభవసాధనములు. ఫలము స్వలాభము. సుగుణ దుర్గుణములని,మిత్రత్వ శత్రుత్వములని, కీర్త్యపకీర్తులని, పుణ్య పాపములని యున్నవిభాగము స్వలాభముముందునశింపవలసినది. అట్లేకాకుండినయెడల—

గీ. నన్నుఁ బ్రాణమిత్రునిగాఁగ నెన్నుకొనుచు
నున్నసర్వార్థసిద్ధిని, నిన్నుఁజంపు
మనుచు నాకాజ్ఞయిచ్చిన యతని, నీదు
దొంగకత్తికి నెరఁబెట్టి త్రోయఁగలనె?

గీ. నందవంశాటవీదహనక్రియాకృ
శానుఁడగునీకు నేఁ బ్రభంజనుఁడ నగుట
నగణితాందోళనమునకు మిగులు బుగ్గ
కుంటఁగొట్టుకొనుట కనుకొంటి నయ్య!

గీ. నందవంశేంధనజ్వాల నవ్యహవ్య
వాహసాక్షిగ భూసురప్రథితవాక్య
హోయమునను మగధరమాహారిణ నేత్ర
పాణిపద్మంబు గ్రహియింప వచ్చినాఁడు.

చాణ—మీ కట్టియభిప్రాయమున్నదని మొదట నేలచెప్పరైతిరి?

యాద—తరువాత చూచుకొనవచ్చునని చెప్పలేదు.

చాణ—నాతోఁ గొంచెమైనను సూచించితిరా?

యాద—లేదు. ఐన నిప్పుడుకలబాధ యేమున్నది?

చాణ—ఒకబాధ యున్నది కాదా?

యాద—ఏదది?

చాణ—గీ. చంద్రగుప్తుఁడు సకలరాజద్గుణుండు
పాటలీపురరాజ్యసంప్రాప్తి నొంద
న్యాయమేకాదె నందుని యంశమునను
నవనిఁబుట్టిన పుణ్యాత్ముఁ డగుటచేత.

యాద—ఆ! అతఁడు నాపట్టాభిషేకమున కడ్డుగ నుండెనా?

చాణ—లేఁడా?

యాద—గీ. కన్నకులటకు అంకుమగఁ డగువాని
చేతఁ దన్నులు దిని చింతఁ జివికి చివికి
పొట్టకూఁటికి నాపంచఁ బట్టినట్టి
బొట్టెఁ డెట్టులు న న్నడ్డు పెట్టఁగలఁడు?

గీ. ఇదివఱకె యిట్టిసంగతి నెఱిఁగియున్న
నతనిఁ జంపక విడుతునే? యతని నీవు
తంత్రమున నాదుదరిఁ జేర్పఁదగును, సఖుఁడ!
నందరాజు నేఁ జేసినచందమునను.

చాణ—తొందరపడకుము. రాజ్యమున నున్న జనులందఱనేత్రములును
జంద్రగుప్తునిపై వ్రాలియున్నవి. జనుల కనిష్టముగ నున్నపుడు
మీ రేల సింహాసన మెక్కవలెను?

యాద—జనులయిష్టానిష్టములతో నాకుఁ బనియేమి?

గీ. భైరవాకారరణవీరవరగభీర
మగధవాహినీపతి వారమంథనంబు
చేసి దిగ్విజయమునొంది చెలఁగునేను
బ్రజలబోము ముళ్ళకే భయపడుదు నయ్య?

చాణ—ఈదిగ్విజయ వైఖరి నేనెఱుఁగనివా! ఏలాగుననో వచ్చితివికాన—

గీ. ప్రాభవాపేక్షపీడి సర్వచరధనము
ముడిఁచిహితమౌర్యునికి నేలవిడిచిపొమ్ము
పురుషు గెల్చి ధనము నొంది మొదటిపురుష
ఘనుభువిని నిల్పి చనునలగ్జాండరటులు.

యాద—గీ. ధనమహావాంఛ దండయాత్రలను జేయు
నతఁడు రాష్ట్రపాలనబాధ నందనేల?
బలవదాకృష్టరంభానుభవముదీరఁ
దృప్తుఁడైనట్టి దశకంఠుఁ డేమిచేసె?

నేనతనివలె బాదిపోటువ కధిపతినిగాను. యథావిధిగఁ బరిపాలిం
చుటకు వచ్చియుంటిని.

చాణ—యాదవసేనా! నేను జెప్పినమాట వినుము.

ఆ. నీకుఁ గప్పమిచ్చి నీయధీనుండయి
యిటను జంద్రగుప్తుఁ డేలుచుండు
వెనుక నీవు నందవిభునధీనుండవై
కప్ప మిచ్చి కొల్చుకరణిగాఁగ.

యాద—ఏమి? ఏమి?

తే. చంద్రగుప్త ప్రాణచయమును గ్రహియించు
కరముగలుగ నతనికర మదేల ?
నతఁడు రక్తపూరమం దభిషేకంబు
నొందు మగధరాజ్యమందుఁగాదు.

చాణ—ఆ! అనవసరమగు వాగ్వ్యయ మేల ? నీమొదల [illegible]
ముచేఁ జెప్పుచున్నాను. విను. విను. వెనుక [illegible]
తోడనైన నే నింత శాంతముగ మాటలాడినవాఁడను గాను.

ఆ. అర్ధమగధరాజ్యమందున నీవుండి
యతని కితర మైనయర్ధమిమ్ము
పాటలీపురమునఁ బట్టాభిషిక్తునిఁ
దప్ప కతనిఁ జేయఁ దలఁతు నేను.

యూద—బ్రాహ్మణుఁడవు. రాజుతో శూద్రునివిషయమై కోమటిబే
రములాడి వర్ణసంకరముఁ జేయుచుంటివా ? చాలు—

గీ. నందరాజేంద్రుఁ జంపి—

చాణ—(క్రోధముతో)సాహసోద్రేకసంరంభసఫలీకృతశపథాటోపుఁడ
నైన నేనెవర ననుకొంటివి ? నందరాజేంద్రుని నీవా చంపితివి?

యూద—లోకము వదుగుము.

గీ. నందరాజేంద్రుఁ జంపి యానందమొదవ
వాహినీపతులను యమపట్టణమున
కనిపి దశదిగ్విజయ మొంది యలరు నేనె
యిపుడు మగధరాడ్భూమి స్థాపింపఁబడుదు.

చాణ—తథాస్తు ! తథాస్తు ! (తనలో) నీయొక్క భూస్థాపనమే [illegible]
సంకల్పించుకొనియుంటిని.

యూద—అట్లులైన నీకిష్టమేనా ?

చాణ—అభ్యంతరమేమి !

యాద—సేనాపతీ ! (హరదాసుఁడు ప్రవేశించును.)

హర—జయము ! జయము ! యాదవసేనా !

యాద—చాణక్యా ! ఇతఁడేల ? మనసేనాపతిని బిలిపించరాదా ?

చాణ—(అపవారించి)హరదాసా! నాచే లిఖింపఁబడినతాళపత్రపుటము నందలి పటము ననుసరించియే శిబిరమును నిర్మించితివికాదా!

హర—(అపవారించి) చిత్తము.

చాణ—(అపవారించి) పాతతాటాకే నేయించితివా ?

హర—(అపవారించి) చిత్తము.

చాణ-(అపవారించి)సేనాధిపతులు సైన్యమునందున నేపడిసియుండిరా?

హర—(అపవారించి) చిత్తము.

చాణ—(అపవారించి) నేను వ్రాసియిచ్చినట్లు శిబిరముచుట్టును శృంఖలప్రాకార మేర్పఱిచితివా ?

హర—(అపవారించి) వరిముల్లంతయైన తమయాజ్ఞకు వ్యతిరేకముగ జరుగ లేదు.

చాణ—(అపవారించి) తాటియాకుల పాకకు గొలుసుల ప్రాకార మేమని వారడుగలేదు గద ?

హర—(అపవారించి) తమ సెలవు ప్రకారముగఁ జీఁకటిపడిన తరు వాత వారినందులో ప్రవేశింపఁ జేసితిని, గావున వారుదానిని జూడనేలేదు, కాని యిన్నిబిందెలతో నీళ్ళెందుకుంచితిరని యొక్క సేనాధిపతి నన్నడిగెను. వేసవికాల మగుటచేతను యాదవసేనుని పట్టాభిషేకోత్సవ మాసన్నమగుట చేతను దీప ములు మొదలైనవాని వలన శిబిరమునకు భయములేకుండఁ జాణక్యుఁడుగారి సెలవుప్రకార ముంచితిమని చెప్పితిని.

చాణ—(అపవారించి) ఆబిందెలలో నుంచినది నూనెయేకదా ! చిఱ్ఱి టగొట్టములుకూడ నక్కడనే యున్నవిగద !

హార--(అపవారించి) చిత్తము.

చాణ--(అపవారించి) నీసేన నంతయు సిద్ధపఱచితివా ?

హార--(అపవారించి) ఆ !

చాణ--(అపవారించి) కత్తులు, కటారులు, ఈఁటెలు, బాఁకులు, గండ్రగొడ్డళ్ళు, గునపములు, పెద్దరాళ్ళు మొదలైనవస్త్రయు సిద్ధపఱచుకొని శృంఖల ప్రాకారమునకు వెలుపలఁ జుట్టును, సేనతో ముట్టడించి చూరు నాఁగులఁమూలల నంటింపఁబనుపుము. ఇందువలనవారు మీసేనాధిపతులయెడలఁ జేసినద్రోహఋణమును దీర్చికొందురు.

హార—(అపవారించి) చిత్తము.

చాణ-(ప్రకాశముగా) ఏమి హారదాసా ! యాదవసేనమహారాజుగారి సేనాధిపతుల నందఱను బురోహితుని వెంటఁబెట్టుకొనిరమ్ము.

యాద—విశేషకష్టపడి యాదమఱచి నిద్రించు సేనాధిపతు లందఱి ప్పుడేలా ? ఒకనిని దీసికొనిరమ్ము. ఐనను యథావిధిగఁ బట్టాభిషేక మిప్పుడేలా ?

గీ. ప్రథమపట్టాభిషేకోత్సవంబు శాస్త్ర
సిద్ధసక్రమవైఖరిఁ జేయవలయు
నిదిద్వితీయంబు దీనికి నేల విహిత
విధులు కానిమ్ము రెండవపెండ్లికరణి.

చాణ—పురోహితుని మాత్రమే పిలువుము.

హార—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

యాద—చాణక్యా !

గీ. మహితధీయుక్తుఁడవు నిన్ను మంత్రిగాఁగఁ
జేసికొంటిని మౌర్యునిసేనలకును
ప్రపరిథమశాసకుఁడు గాఁగఁ బతియుఁగాఁగ
నేర్పఱచుకొంటి నోభూసురేంద్రచంద్ర !

చాణ--మీ రన్న యీమాట లవనిమాటలే! ఏల యన సింహాసనారో
హణము మీరు చేసిన తరువాత నీమాట లనఁ దగినవి.

[పురోహితుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురో—ఇంకను సింహాసనారోహణముఁ జేయవలె ననియే యను
చున్నారా? అయ్యయ్యో! కాల మాసన్నమైనది. మహా
ప్రభూ! యథావిధిగ జరుగనేరదు.

యాద—త్వరగఁ గానిమ్ము.

పురో—చిత్తము.

యాద—ఏమి యాలస్యము! వెనుకటిసంగతి నాకు జ్ఞప్తియున్నది.
సింహాసనమునకుఁ బ్రదక్షిణము చేయవలెను కాదా! చాణక్యా!
పెద్దకలకలము వెలుతురు గలిగి యీరాత్రి దీపావళిరాత్రిఁ
బోలియున్న దేమి?

చాణ—నరకాసురవధరోజవ నున్నట్లా?

యాద—ఏమి? చెప్పవేమి? ప్రదక్షిణమును జేయవలెనుగాదా?

పురో—చిత్తము.

యాద—(సింహాసనము చుట్టుఁ దిరుగఁబోయి) హాహా! (గోతిలోఁ
బడుచున్నాఁడు.)

పురో—అయ్యో! అయ్యో! (ఏడ్చుచుఁ బారిపోయినాఁడు.)

చాణ--గీ. జైనసిద్ధాంతరీతిగా జనునియాత్మ
ముక్తి మెంతకాలము పైకిఁ బోవుచుండు
నంతకాలము నీదేహ మడుగునకును
బోవుఁగాత! నిరంతర మగను రాజ!

గీ. నందవధ మయ్యెఁ; దత్సుతనాశ మయ్యె!
శత్రుసేనావిజయ మయ్యె! మిత్రుఁ డైన
శత్రుఁ జంపుట యయ్యెఁ; దత్సైన్యనాథ
సంఘసంపూర్ణదహన మింపరికినగును

[హారదాసుఁడు ప్రవేశించును.]

చాణ—హారదాసా! ఏమైనది?

హార—సేనానాయకులతోడ శిబిరము మసి యైనది. అయ్యా! యాదవ సేనమహారాజుగా రగపడుట లేదేమి?

చాణ—భూమియొక్క యధోభాగమునకుఁ బోయి చూచినఁగాని యాతఁడు కనుపడఁడు. మురాసహితముగఁ జంద్రగుప్తుని శీఘ్రముగఁ దీసికొనిరమ్ము.

హార—మహాప్రసాదము.

[పోయి మురాచంద్రగుప్తులతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

ముర—అయ్యా! నమస్కారము.

చంద్ర—భూసురశిఖామణీ! నమస్కరించుచున్నాను. మీ సంపూర్ణానుగ్రహమువలనఁ దిరిగి మాతండ్రిపురమును నేను జేరితిని.

చాణ—పురము నన నేల యాతని సింహాసనమునసే చేరితివి.

చంద్ర—సర్వదా యనుగ్రహపాత్రుఁడను.

చాణ—హారదాసా! ఆసింహాసనమునకు దక్షిణపువైపునకు వెళ్ళక ముందుకు జరుపుము—(అట్లు జరుపుచున్నాఁడు.)

చంద్ర—బ్రాహ్మణవర్యా! యాదవసేనుఁ డేఁడీ?

చాణ—గీ. సర్వజననయనానందసంప్రదాత
వైననీ వెక్కఁ దలఁచినయట్టిసింహ
పీఠమున కాతనిని బలివెట్టినాఁడ
నిపుడె పట్టాభిషేకంబు నెనయు మయ్యా!
[సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టినాఁడు.]

చంద్ర—బ్రాహ్మణచంద్రా! నన్నుఁ గృతార్థునిఁ జేసితిరి. నాకొఱకమిత మైనశ్రమపడినమహానుభావులకు సర్వదా సేవకుఁడను.

చాణ—ఇది యొక శ్రమ కాదు. ఇంతకంటె నధిక మైనశ్రమ ముందు పొందవలసియున్నది.

చంద్ర—మఱి యే మున్నది?

చాణ—గీ. రాక్షసుఁడు మాయ మయ్యె; నేరాజ్యమందు
నిలిచియున్నాఁడొ? మనకింకఁ దెలియదయ్యె;
నిన్ను బాధింప నతఁ డెంచి యెన్నమాయ
లైనఁ జేయును ధీమంతుఁ డతఁడు సుమ్ము!

ఆ. అతనిమాయ లన్ని యట్టిమాయలు గాఁగఁ
జేసి యతని నిటకుఁ జేరఁ దీస్తి
నీకు మంత్రిగాఁగ నేఁ జేసి కాశిలోఁ
దపముఁ జేయుటకును దలఁచినాఁడ.

గీ. నందుతోఁ దక్షకకుల మంతంబుఁ జెందె
మగధరాజ్యము నిటుపైని మౌర్యవంశ
మేల గల దాదిపురుషుఁడ వీ వనేక
వత్సరము లేలు మయ్య! శ్రీవైభవమున.

చంద్ర—(సింహాసనము డిగి) భూసురాశీర్వాదము గ్రహించినాఁడ.

మురా—నిర్వర్తితప్రతిజ్ఞుల రగుమీ రింకఁ గేశపాశమును ముడివైచి
కొందురుగాక!

చాణ—శీఘ్రకాలములో సన్యసింపఁదలఁచిన నాకింతలోఁ గేశబంధమేల?
చంద్రగుప్తా! ఇప్పుడు నీవు కోరున దేమున్నది?

చంద్ర—ఏమియు లేదు. ఐన నిటులు కోరెదను.

గీ. ధరణి యీతిబాధలు లేక తవరుఁ గాక!
ప్రజలయన్యోన్యవైరముల్ పాయుఁగాక!
కవిత రాజపోషణమునఁ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు నెగడుఁగాక!

చాణ—తథాస్తు! తథాస్తు! (అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది షష్ఠాంకము సర్వమును సమాప్తము.



# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | వాద్యంత | వాంద్యంత |
| 17 | 12 | ముందుగ | ముందు |
| 18 | 7 | తుంగమై | తుంగనై |
| 22 | 7 | అడుగో | అదిగో |
| 24 | 10 | పట్టుదో | పట్టున్నదో |
| 33 | 14 | గమ్ముకొను | గ్రమ్ముకొను |
| 36 | 23 | శిరచ్ఛేద | శిరశ్ఛేద |
| 38 | 9 | సహాయము | సాహాయ్యము |
| 39 | 6 | జాప్త్యా | జాత్యా |
| 39 | 17 | వన్వహించు | వన్వయించు |
| 41 | 8 | మురః- | మురః-(తనలో) |
| 41 | 21 | యుచ్ఛ | యూచ్ఛ |
| 43 | 2 | కోత | కోఁత |
| 44 | 9 | గక్కి | గ్రక్కి |
| ,, | 14 | పీల్చి | ప్రీల్చి |
| 69 | 4 | చోత | చేత |
| ,, | 12 | తోఁచ | తోఁచు |
| 78 | 14 | నండ | పండ |
| ,, | 19 | కరువడి | క్రరువడి |
| 80 | 20 | నేచు | నేము |

మహారాజశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి

# నూతన నాటకరాజములు.

(ముద్రణలో నున్నవి)

1 పద్మావతి—పౌరాణిక నాటకము. మనోవికారకల్పనగలది. వెల 0-12-0

2 మణిమాల—శృంగారరసాత్మకమైన నాటకము. ఉత్తమజాతి స్త్రీ తన ప్రేమబలముచేత నెంతమహోదారమైన కార్యములు చేయగలదో యిందువలన దెలియనగును. వెల 0-12-0

3 సరోజిని—ప్రాచీనమైనకథ. కష్టాంతకము. భర్త పరాంగనయం దభిలాషకలవా డయ్యెనని యెంచిన స్త్రీ యెంతభయంకరచర్యలు చేయునో యిందువలన దెలియును. మిగుల పరమానఘస్వభావయైన సరోజిని తుదకు కామపిశాచిపాలైపోయెను. కథాకల్పన మాశ్చర్యకరము. సరోజిని మాటలు చేష్టలు భయానకరసాత్మకములు. చదివితీరవలయును. వెల 0-12-0

4 కాత్యాయని—కల్పితకథ. ఇందులో కాత్యాయని సాహసము ప్రజ్ఞా విశేషము శత్రుసంహారణచాతుర్యము, మహామానవేశము మొదలగు గుణములు వెల్లడియగును. ఇది కష్టాంతనాటకము.

5 చూడు—ఇతిహాసకష్టాంతకము. సాంఘికనాటకము. ఇందులో గృహాధిపతియొక్క దుర్నయమువలన నతని కుటుంబములోని యందఱు నశింతురు. ఇందులోని ముఖ్యనాయికయైన ‘లక్ష్మి’ యెట్టి సుగుణవతియో తెలిసికొనఁదగినది.

6 విచిత్రవివాహము—శారదచట్టము త్వరలో రానున్నదని తొందరపడి జరుపవలసివచ్చిన యతిబాల్యవివాహము. గ్రంథారంభమునుండి గ్రంథాంతమువరకు తెఱపిలేని నవ్వే నవ్వు.



రావు బ్రదర్సు
పిఠాపురము,
(తూర్పుగోదావరిజిల్లా)